# ఈ బ్రాహ్మణ ప్రభుత్వమును

# [illegible] నాశము చేయండి




దు. రాఘవచంద్రయ్య సచ్ఛాస్త్రి

సెక్రటరీ

ది రియల్ ఇండియన్ నేషనల్ కాంగ్రెసు పార్టీ

బెజవాడ


---


ప్రకాశకులు

సద్బ్రాహ్మణాశ్రమము, బెజవాడ

1947

వెల **1-8-0**

# పీ ఠి క.

(1) మహాత్మాజీకి పిమ్మట, నెహ్రూజీ భారతీయ రాజకీయాంతరిక్షము నందు మిరుమిట్లు గొల్పు తేజస్సుతో వెలుగుచున్న వ్యక్తి. ఆయన భావములను దేశము అవలంబించును. కాని, ప్రశ్న మేమి అనగా ఆయన ఉద్దేశములు సత్యములా? మఱియు దేశ యథార్థ స్థితి కనుగుణములా?

(2) లాహోరులో ఉపన్యసించుచు "రాజ్యాంగములో క్యాథలికు క్రైస్తవ సంఖ్యాధికత కలదా? ప్రోటస్టెంటు సంఖ్యాధికత కలదా? యూదుల సంఖ్యాధికత కలదా?... ..........అను ప్రశ్నమును (బహుశః ఇంగ్లండు అమెరికాలలో) ఎవరును ఎప్పుడును విని యుండరు. కాని, (మన దేశములో) ముస్లిం మెజారిటీ, బ్రాహ్మణుల మెజారిటీ. బ్రాహ్మణేతరుల మెజారిటీ అను వాక్యములు వినవచ్చుచున్నవి. ఈ సమస్య ఏల వచ్చినదనగా మనకు ప్రత్యేక నియోజక వర్గము లుండుట వలననే" అని నెహ్రూజీ చెప్పెను. ప్రత్యేక నియోజక వర్గము లనర్థ దాయకములను మాట నిజమే. కాని, ఆయనర్థ చర్చతో పాటు ఏ స్థితి గతులు వానిని అమలులోనికి వచ్చునట్లు చేసినవో వానిని గుఱించి చర్చింపక యుండఁ గలమా?

(3) ఇంగ్లండులో బ్రిటిషు పార్లమెంటులో ఏ సంఘమునకును ప్రత్యేకముగా రిజర్వేషనులు లేని మాట నిజమే. కాని, అందుకు హేతువేమి? ఆ దేశీయులు కుల తత్వమును అతిక్రమించి "జాతీయ" తత్వముతో దేశ సమస్యలను ఆలోచింపగల స్థితికి వచ్చిరి. కాని, ఇంగ్లండులో కూడ 'మధ్య యుగము' లో ప్రోటస్టెంటు క్రైస్తవులను, క్యాథలిక్కులును మఱి అట్లే క్యాథలిక్కులను ప్రోటస్టెంటులును పరస్పరము జీవించి యుండగనే తగుల బెట్టుకొనిరి.

(4) కాని, ఇండియాలో నేడు మనము ఇంకను దాదాపు ఆ "మధ్యయుగము" లోనే ఉంటిమి. నెహ్రూజీ "మధ్యయుగము" అనగా "మత సంస్థ రాజకీయపక్షముగా వ్యవహరించు కాలము" అని నిర్వచించెను. (నెహ్రూజీ లాహోరులో ఒసంగిన ఉపన్యాసమును 19–7–1945 తేదీ హిందూ పత్రికలో చూ.)

(5) దురదృష్ట వశాత్తు మన ఇండియాలో కల రాజకీయ పక్షములలో చాల వానికి మతవాసనకలదు. ఇట్లు హిందూమహాసభ, ముస్లింలీగు, సిక్కులీగు, సర్వహిందూ దేశక్రైస్తవలీగు మొదలగునవి పెక్కులు మతపుపునాదుల మీద నిర్మింపబడిన రాజకీయ సంస్థలు.

(6) హిందువులలో పంచములనువారు ప్రత్యేక వ్యక్తిత్వముకల శాఖ యని, దేశములోని శాసన సభలలో

రిజర్వేషనులుండవలయునని రాజకీయవేత్తలు అంగీకరించిరి. అదినిజముగా రాజకీయమును మతరీతిగా ఆలోచించుటయే యగును.

(7) 1919-వ సం॥పు ఇండియా గవర్నమెంటు శాసనములో మద్రాసు రాష్ట్ర శాసనసభలో రిజర్వేషను స్థానములను బ్రాహ్మణేతర హిందువులకిచ్చిరి. అదియు మతరీతిగా రాజకీయ సమస్యను పరిష్కరించుటే.

(8) ఇండియా దేశములో ఏల యిట్లు ఈ రాజకీయ సమస్యమతవిషయికాధారము కలదైనది? ఏల కొంచెమించుగా అన్నిజాతులవారు తమ తమ రాజకీయ భాగములను తమ మత విషయిక కులముల సంఖ్యలను బట్టి కొలిచి చూచుకొనుచున్నారు?

(9) దీనికి సమాధానమేమి అనగా హిందూదేశములో నేడు నివసించుచున్న వివిధ జాతుల, కులముల సామాన్య రాజకీయ నిర్మాణము అవినాభావ సంబంధముగా తమ మత వర్గములతో లీనమై యుండిపోయినది.

(10) సర్వ భారత భూమి స్థితియు నిట్లే కలదన్నచో హైందవ భారతములో ఇంకను హెచ్చుగా రాజకీయము కుల వర్గ సంబంధిగా ఉన్నది. దీనికి హేతువు వేల కొలది సంవత్సరములనుండియు భారత భూమిలో రాజకీయము మతముతో విడదీయ రాక మిళితమై యుండు

టయే. చాల పూర్వమునకు వెళ్లక సుమారు రెండున్నరవేల సం॥ముల క్రింద జన్మించిన గౌతమ ధర్మ సూత్రములను చూచితి మేని, శూద్రులను వారినది పరిపాలకులు, యుద్ధ భటులు, యోధులు, ఆర్జనము చేసికొను వర్తకులు కారాదని శాసించినది. మఱియు, వారు ఆర్యపాలకులగు ద్విజత్రయము (బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు) వారికి బట్ట లుతుకుట, క్షౌరము చేయుట మొదలగు నీచ సేవలు చేయవలయు నని విధించి దానిని అతిక్రమింప సాహసించిన శూద్రులను వారిని ధర్మశాస్త్ర మను అధర్మ శాస్త్రముతో చాల తీవ్రముగా శిక్షించిరి.

(11) క్షత్రియు లనువారికి కూడ, వారి అధికారమును చలాయించుటకు సంపూర్ణాధికారము లేదు. "రాజా సర్వస్యేష్టే బ్రాహ్మణ వర్జం" రాజు బ్రాహ్మణులకు రాజుకాదు, తక్కిన వారికి మాత్రమే (గౌతమ ధర్మ సూత్రములు 2–2–1). అందుచే పేరునకు క్షత్రియుడే రాజుఅయినను క్రియాపూర్వక చక్రవర్తి బ్రాహ్మణుడే. మంత్రియై, జడ్జియై, అధికారము చలాయించు అన్ని ప్రధాన స్థానములు ఆక్రమించి ఆతడే ఎల్లప్పుడు ఎల్ల విషయములలో రాజ్యము చేయుచుండెను.

(12) మన పురాణములు, ధర్మశాస్త్రము లనబడు అధర్మశాస్త్రములు, భారతాదులగు నితిహాసములు వేల

కొలఁది వత్సరములనుండి యీ విధమగు భావములనే దేశమునకు బోధించుచుండెను.

(13) గతించిన ఏబది వత్సరములలో క్రొత్త రాజకీయ భావములు దేశములోనికి వచ్చువఱకు ఎట్టి భిన్నములగు అభిప్రాయములును దేశములో లేవు. కాని యీ క్రొత్త భావములు ఆంగ్ల విద్యా సంపర్కముకల కొలదిమందికి అనగా నూటికి ఒక్కరికే కలిగినవి. అందుచే ఈ నూతన భావములు జనసామాన్యములో కలిగించిన పరిణామము చాల స్వల్పము. వారు వేలకొలఁది సంవత్సరముల నుండి ఆలోచించు పద్ధతులలోనే యుండిరి.

(14) మహాత్మాజీయు వారి తరమువారును ఆంగ్ల పండితులయ్యు ఈ నూతన భావసరణి ననుసరింపరైరి. హేతువేమి అనగా వారు భగవద్గీత మొదలగు శాస్త్రము లను వాని వలలలోఁ దగుల్కొనిరి.

(15) మహాత్మజీ "రామరాజ్య" స్థాపనము చేయవలయునని కృతనిశ్చయుడై యున్నాడని మన మెఱుంగుదుము. బ్రాహ్మణ బ్రాహ్మణేతర సమస్యను గుఱించి మహాత్మజీ దక్షిణ హిందూదేశ నాయకులతో సల్పిన ప్రసంగమును గురించి మహాదేవ దేశాయిజీ 24–11–27 తేదీ గల యంగు ఇండియా పత్రికలో ప్రకటించిన ప్రశ్నోత్తర మాలిక చూ.

(16) రామాయణములోని "రామ రాజ్యమును" ఆర్య సారస్వతములో అంత లోకోత్తరముగా ఏల స్తుతించిరనఁగా సర్వ భారత ప్రజను బ్రాహ్మణ మతమునకు బలి చేయుటకే. మఱియు దానిని లోకమును మోసగించి దేవుని పేర, దేవుని వాక్యములనుపేర కావించిరి.

(17) ఆ రామరాజ్యము శూద్రులనువారికి (పంచములనువారి మాట అటుండనిండు; ఏల అనగా వారు వర్ణాశ్రమ సోపానములో పశువుల కంటె నీచులుగనే భావింపబడిరి.) గృహములలో నీచ సేవకులనుగా జేసి ఆ పాప వ్యవస్థ నతిక్రమించిన వారిని ఘోర శిక్షలతో నాశము చేసిరి. ఇది ప్రత్యక్ష నరకము కాదా ?

(18) మచ్చున కొక యుదాహరణముఁ గైకొని చర్చింతము. తపస్సు చేసినందులకు శంబుకునేల చంపవలయును ? తపస్సు అనగా నేమి ? "ఋతంతపశ్శాంతం తపశ్శమస్తపో దమస్తతపో యజ్ఞం తపో భూర్భువర్బ్రహ్మై తదుపాస్స్యై తత్తపః" దేవుని ఆరాధించుట, సత్యమును పలుకుట,........ మానసిక, శారీరక వాంఛలను జయించుట. ఉపవాసము సలుపుట, శత్రువులను ప్రేమించుట........ ఈ మొదలగునవి "తపస్సు అనఁబడును. అనగా ఆత్మ పవిత్రీ కరణము తపస్సు. దీని ననుష్ఠించిన పవిత్రుడగు శంబుకు నేల సంహారింప వలయును ?

(19) మహాత్మ్మాజీ దీనికి చెప్పు సమాధాన మేమి అనఁగా :— “ అనేక రామాయణములలో ఏమి చెప్పబడి యున్నను నా రాముడు శంబుక వధ చేయ గల్గిన వాడయి యుండడని నమ్ముచున్నాను (పైనిచెప్పిన మహాదేవ దేశాయిజీ ప్రశ్నోత్తర మాలికను 24–11–27 తేదీ యంగు ఇండియాలో చూ.)

(20) అదియే సమాధానమునకు మార్గ మగుచో “గజం మిథ్య పలాయనం మిథ్య; ఏనుగ పాఱిపోలేదన్నచో ఏనుగే. లేదని ఏల అనరాదు ? ” అను సామెత లేదా ? అనేక రామాయణములలో ఉన్న శంబుకవధ జరుగ లేదన్నచో రాముడే లేడనియు అనరాదా ? పురాణములగు గాక ఇతి హాసములగు గాక మన యెదుట నున్న గ్రంథములలోని సాక్ష్యమును బట్టి మనము వస్తువుల సత్యములను నిర్ణయింతుము. వసిష్ఠుని దుష్ట ప్రబోధముచే శ్రీరాముడు శంబుక మహర్షిని పవిత్ర తపస్సు చేయుచున్నందుకు చంపెనని అందఱును విశ్వసించుచున్నారు. మఱి ఆ శంబుక వధ యనునది వేదము విన్నందుకు శూద్రులనువారి చెవులలో కరిగిన సీసము (ఇదియే వారిని చంపుటకు చాలును)ను పోయవలయు ననియు, బ్రాహ్మణ స్త్రీతో సంపర్కము చేసిన శూద్రుడను వాని రహస్యాంగమును (ఇట్టి తప్పునే చేసిన బ్రాహ్మణుని క్షమింప వలయునని చెప్పుచు) కోసి వేయ వలయుననియు శాసించిన సనాతనులనబడు వారి దుష్ట ధర్మ ప్రణాళికతో సంపూర్ణముగా ఏకీభవించు

చున్నది. అందుచే అది అప్పటి కాలములో వాడుకలో నుండిన సత్యకార్యమే.

(21) మఱియు ఆ " వర్ణాశ్రమధర్మము " అనునది కేంద్రీకరించిన దుర్నీతి. ఏల అనగా 'దుశ్శీలోపి ద్విజో పూజ్యోనతు శూద్రో జితేంద్రియః; ఎంత అవినీతి పరుడై నను బ్రాహ్మణుడను వాడు పూజ్యుడు మఱి కామక్రోధలోభ మోహాదులను జయించిన పవిత్రుడు అయినను శూద్రుండనువాడు పూజ్యుడు కాడు' అను సూత్రము ఆ రోజులలో ప్రతి ఘటింపబడని, మఱియు సర్వత్ర అంగీకరింప బడిన సిద్ధాంతమైనది. అందుచే తపస్సును శూద్రుడనువాడు చేయుట ఊహింపరాని విషయము. అందుచే మన అందఱి వలెనే మనుష్య మాత్రుఁడగు శ్రీరామునిచే శంబుక మహార్షి చంపింపఁబడె ననుటలో ఆశ్చర్యము లేదు.

(22) " దుష్టాత్ముడైనను బ్రాహ్మణుడు పూజ్యుడు కామక్రోధాదులు జయించిన పూజ్యుడైనను శూద్రుడను వాడు పూజ్యుడుకాడు " అను ధర్మము నవ్య భారతభూమికి గూడ ప్రమాణము అగునేని బ్రాహ్మణులకును శూద్రులను వారికిని మధ్య జాతీయత యుండునా? రెండు జాతుల మధ్య సమానత్వము లేనిచో జాతీయత అనుదాని అర్థమేమి? నల్గురైదుగురు పుత్రులుగల యొక హిందూ కుటుంబములోని బిడ్డల కందఱకు సమానత్వము ఉండునట్లు ఒక జాతిలోని వారి కందఱకు సమానములగు హక్కులు

ఉండవలదా ? కాని ఆశ్చర్య మేమనగా 7 లక్షల ఏబది వేల గ్రామములలోను ఈ 1947-వ సం॥రములో కూడ స్వల్ప మగు సంబోధనలో గూడ బ్రాహ్మణులతో శూద్రులను వారికి సమానత లేదను భావమే కలదు. ఏల అనగా బ్రాహ్మణుడు బ్రహ్మశ్రీ ; శూద్రు లనువారు మ.రా.రా.శ్రీ.లు. బ్రాహ్మణుడు భూదేవుడు, పూజ్యుడు ; శూద్రుడు జన్మనుం డియే పాపాత్ముడు. మఱి అర్చకత్వ, వేదపాఠ, యజ్ఞ పరిషత్సంతర్పణ సహపంక్తి భోజనములకు అనర్హుడు.

(23) రాముడు ప్రపంచము నంతటిని " బ్రాహ్మణ మత దాసుల " నుగా జేయుటకు చిహ్నము. అందుకొఱకు అతనిని బ్రాహ్మణులు దేవునిగాఁ జిత్రించిరి. మఱియు అతనిచే శంబుక మహర్షిని జంపించిరి. అది ఆర్య రాజ్యము నకు ఆచారము కావలయునని చేసిన హింస. ఆర్యుల ప్రయోజనములకు అతడు చాల హెచ్చుగా తోడ్పడుటచే రాముని దేవుడని స్తుతించిరి.

(24) బ్రాహ్మణ క్షత్రియ, వైశ్యులు అను ద్విజులు ముప్పురు ఆర్యులు, శూద్రులనుబడువారు పంచము లనబడువారు అనార్యులు (ఆర్యాస్త్రైవర్ణికః అనార్య శ్శూద్రః) అని గౌతమ ధర్మ సూత్రములలోని 2-1-69-వ సూత్రము మీద వ్యాఖ్యానము చేయుచు హరదత్తులు స్పష్టము చేసిరి. అందుచే ఈ యిరువురు భిన్న జాతుల వారనుట స్పష్టము. " వర్ణ సిద్ధాంతము '' అను నది ఈ అనార్య జాతులను

వేదము పేర, దేవుని పేర, దైవ వాక్కుల పేర సర్వతోముఖ నాశము చేసి తమకు బానిసలనుగా జేసికొనుటకు పన్నిన ఆర్యుల మేధాసంపద యొక్క మూర్తి. అందు కొఱకే ఆర్యులు కొందఱిని భగవంతులనుగా జేసిరి.

(25) ఇట్లు ఆర్యులు మొదట ఏ నిరంకుశ రాజ్యమును ఖడ్గముతో స్థాపించిరో దానిని తరువాత శాస్త్రములను దుష్ట శాస్త్రములలో చొప్పించి తమ్ము శాశ్వతముగా భూపాలకులనుగా జేసికొనుటకును ద్రావిడ సంఘములను శాశ్వతముగా వారికి బానిసలనుగా జేసికొటకును ఈ పన్నుగడను పన్నిరి. అది యిట్లు దైవ మానవ ద్రోహకరమగు గొప్ప మోసము.

(26) మొదటి ప్రశ్న ఏమి అనగా కొంత కాలము నుండి హిందూమతమను పేరుతో వ్యవహారింప బడుచున్న "బ్రాహ్మణ మతము" లోనికి ఏల శూద్రులనువారు ప్రవేశింప వలయును? శూద్రులను నామమును ఏల అంగీకరింప వలయును? మఱియు సృష్టికర్తకు, సృష్టింపబడిన వారికి లోకములో సర్వత్ర కల సంబంధము చేతను పురుషసూక్త ధర్మము చేతను రక్త సంబంధముకల బ్రహ్మదేవుని బిడ్డలగుటచే కల్గిన వారి బ్రాహ్మణ ధర్మానుష్ఠానపు హక్కులను ఏల గోలుపోవలయును?

(27) అట్లే ఏల పంచములనువారు ఈ బ్రాహ్మణుని మోసపు వ్రాతలలో చిక్కి తాము పంచములు లేక

చండాలురను అష్టాదశ మహాపాపుల దుష్ట నామమును పొంద వలయును? — నిజమునకు, సృష్టి అంతము వరకు పాపాత్ములు అను నర్థము ఇచ్చు చండాలురు అను పదము కంటె అపవిత్ర మగు నామము ప్రపంచములో ఏ యితర భాషలోను లేదు—గ్రామములలో నివసించుటకు అనర్హులని నీచులుగా చూడబడుటకా?

(28) నిజముగా భగవద్గీత పరమేశ్వరుని పవిత్ర గ్రంథమే యగుచో ఏల "స్త్రియో వైశ్యాస్తథా శూద్రాః యేపిస్యుః పాపయోనయః" స్త్రీలు వైశ్యులు శూద్రులు జన్మచేతనే పాపాత్ములు అని చెప్పవలయును? 20 కోట్ల మంది శూద్రు లనువారు ఏ పాపమును చేయక పూర్వమే జన్మతోనే పాపాత్ములా? పద్భ్యాం శూద్రో అజాయత అనగా శూద్రుడు విరాట్పురుషుని పాదముల నుండి జన్మించిన పవిత్రుడు (కావుననే బ్రాహ్మణులా ఈశ్వర పాదములకు మ్రొక్కుదురు). మఱి జన్మచే పాపాత్ము డగుట యెట్లు? ఈశ్వరుని నుండి జన్మించిన యితడు పాపాత్ముడైనచో బ్రాహ్మణుడును పాపాత్ముడే కదా?

(29) మఱి శూద్రులు పాపాత్ములను నిట్టి సిద్ధాంతము ఈశ్వర సిద్ధాంత మెట్లగును? మఱి యీ పాప సిద్ధాంతమును సత్య సిద్ధాంతముగా చెప్పిన "భగవద్గీత" యనునది ఈశ్వర సిద్ధాంత మెట్లగును? బహుశః ఇచ్చట 'నీవు నాస్తికుడవు' అను వాదము వచ్చును కాఁబోలు.

మూర్ఖుడు తప్ప ఇతరు లెవ్వరును దేవుని ఉనికిని ప్రశ్నింపరు. ఏల అనఁగా 'దేవుడు లేడు' అను వాక్యములోని పూర్వ సిద్ధాంతమును ఉత్తర పక్షములో లేదనుచున్నాడు. లేని వస్తువును పేర్కొను టెట్లు? ఎవరైనను లేనిదానిని పేర్కొందురా? మఱి "యునికి" కానిచో దేవుడేమి? నిరీశ్వరవాది లేదనుచున్నది దేనిని? కావున నిరీశ్వరవాది మొదటి పక్షములో ఒక వస్తువును (ఎఱుగని దానిని నిర్దేశించి చెప్పఁజాలడు) స్పష్టీకరించి రెండవ పక్షములో దానిని లేదనుచున్నాడు.

(30) అయినచో మీ దేవుని స్వరూపమేమి? మన జాతీయ మహాకవి కాళిదాసు చాల రమ్యముగా దైవ స్వరూపమును నిర్ణయించెను. 'వాగర్థా వివ సం పృక్తౌ। వాగర్థ ప్రతి పత్తయే జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ' ఇందు మనకు ప్రకృతి పురుషుల మనోజ్ఞమగు ఐక్యతను ప్రతిపాదించు పార్వతీ పరమేశ్వరుల స్వరూపమును చిత్రించెను. ఈ యభిప్రాయము బ్రాహ్మణుల, నాస్తికుడను శాపమును తప్పించుకొనుటకు చెప్పినది కాదు. మఱిలోని సత్య స్వరూప మగు అంత రాత్మను తృప్తి పరచుటకు మాత్రమే.

(31) 'చాతుర్వర్ణ్యం మయా సృష్టం' అని భగవద్గీత చెప్పుచున్నది. దేవుడు సృష్టిలోని క్రైస్తవులను, సిక్కులను, మహామ్మదీయులను సృష్టింప లేదా? ఒకటి

రెండు మూడు అను సంఖ్యతో సంబంధముకల జాతులు (1) బ్రాహ్మణులు (2) క్షత్రియులు (3) వైశ్యులు (4) శూద్రు లనువారే యైనచో మఱి తక్కిన ప్రపంచము వారి మాటేమి? హిందూ మతములోనే పంచములను వారు కలరని అష్టాదశ మహా పాపులగు బ్రాహ్మణులు చెప్పుచున్నారు కదా? వారందఱిని వేఱు దేవుడు సృష్టించెనా? మన దేవుడు కులదైవమా? ఇది తప్పు. ఏల అనగా 'విశ్వ తశ్చక్షురుతవిశ్వతోముఖో విశ్వతో హ స్తఉత విశ్వత స్పాత్; విశ్వములో సర్వత్ర నా కండ్లు, ముఖము, చేతులు, పాదములు కలవు. మఱి యవి లేని స్థలము లేదు' అనగా మన దైవము దేనికి ఆవల ఏదియు ఉండదో ఆ విశ్వమునకు కర్త.

(32) అందుచే సనాతనవాదుల మనుకొనువారి వ్యాఖ్యానము ప్రకారము ఏర్పడిన వర్ణ సిద్ధాంత మనునది సత్యసిద్ధాంతము కాదు.

(33) మఱియు సనాతనులను వారు పవిత్ర గ్రంథములు అని చెప్పు వేదములు, భగవద్గీత, ఉపనిషత్తులు అనునవి వారి యర్థముల దృష్టితో చూచినచో అందు ఈశ్వర స్వరూపమగు (i) సత్యము (ii) అహింస (iii) ధర్మము (iv) నీతి లేవు కనుక సత్యములు కావు.

(34) సనాతనుల మనుకొను వారు ప్రదర్శించు ఆస్తి విభాగపు పత్రము (చూ. అనుబంధము 1) దైవ

విరుద్ధమగు రాక్షసుల ఆస్తి విభజనము. ఏల అనగా (1) ఈ జన్మలోనే ఏ అడ్డును లేక భూలోక దేవత్వమగు బ్రాహ్మణత్వమును పొందుటకుగాను సర్వ ద్విజేతర సంఘములకును సర్వ ప్రపంచమునకును ఇచ్చిన బ్రాహ్మణ ధర్మ అనుష్ఠాన హక్కును అది లేకుండజేసి ఈ జనములను ఆధ్యాత్మిక హత్య చేయుచున్నది. (2) మఱియు వారి 18 అత్యంత ప్రధానములగు జన్మ హక్కులను (అను బంధము (ix) చూ.) హరించు చున్నది.

(35) ఇచ్చట " రామరాజ్యము " అను పేరుతో మరల సంస్థాపించి తీరవలయునని మహాత్ముడు చాల ఆతుర పడుచున్న " గాంధి వర్ణ సిద్ధాంతము " మనకు దాపరించు చున్నది. దురదృష్టవశాత్తు సనాతనుల రాక్షస సిద్ధాంతము ఎంత పాప భూయిష్ఠమో ఇదియును అంత పాపభూయిష్ఠమే. ఏల అనగా (i) అంతరాత్మకు అనుగుణ ముగా తన వృత్తిని తాను ఎన్నుకొనుటకు వ్యక్తికి స్వాతంత్ర్యమును ఈయ కుండుటయు (ii) అత్యుత్త మాధ్యాత్మిక ధర్మము అయి భూలోక దేవత్వమును పొందుటకు ప్రపంచములోని ప్రతి మనుజునికిని ఈయ బడిన దైవ వర్ణ సిద్ధాంతమును భౌతికముగ పొట్టకూటి కార్జించు మతమునుగా సనాతను లనువారి పద్ధతి ననుసరించి చేసియు (3) సనాతనులు తరము తరముగా చేయుచున్న శూద్రు లను వారి ' ఆధ్యాత్మిక హత్య 'ను మహాత్ముడు తానుకూడ అంగీకరించెను.

(36) శూద్రు లనువారిలో బహుశః భూములు గలిగి చాల ఉచ్ఛస్థితిలో ఉన్నవారికి ఆయన వైశ్యత్వమును ఇచ్చెను. కాని, వైశ్యులు కూడ భగవద్గీతలోని 'పాప యోనయః' అను శ్లోకములో చెప్పిన "పుట్టుక నుండియు పాపాత్ములు" అను వర్గములలో జేరిన వారే. మోక్ష సిద్ధికి బ్రాహ్మణత్వము నందుటకు వీలులేని వైశ్యత్వముతో తృప్తి పడనేల? అంత కంటె అసలు ఆ బ్రాహ్మణుల యురి త్రాళ్లలో చిక్కుకొని శూద్రులు, వైశ్యులు అను ఆ పాపాత్ముల దుష్ట నామములు అంగీకరింపనేల? ఇది సర్వ జాతులను బ్రాహ్మణ మత మునకు బలి యిచ్చుట కాదా?

(37) పంచములను వారిని 'శూద్రత్వము' తో తృప్తిపడుడని మహాత్ముడు కోరుచున్నాడు. వారికి మోక్ష సిద్ధికి బ్రాహ్మణత్వమును పొందు అధికారము ఈ జన్మలో లేని శూద్రత్వమేల? మఱియు 'ఇంతవఱకే మఱి పైకి పోరాద' ను ఈ నియమ మేల? మఱియు వారు (ix)వ అనుబంధములో ఉదహరించిన 13 నిషేధములకు ఏల పాత్రులుకావలయును?

(38) ఇట్లు ఈ రెండు గొప్పజాతులను బ్రాహ్మణమతములోనికి నెట్టుటలో మహాత్ముడు బహుశః తలవని తలంపుగా వారిని శాశ్వతముగా అగౌరవముతో గూడిన

నీచస్థితి లోనికి—ఉద్దేశము భిన్నమే అయినను — తీసికొని వెళ్ళుటే అగును.

(39) ఉన్నతి నీచత అను భావములను ఆయన తొలగించిన మాట నిజమే కాని బ్రాహ్మణులు బ్రాహ్మణ ధర్మము ననుష్ఠింప వలయునను సూత్రము ఆ గౌరవము విశ్వములో సర్వత్ర ఆయా వృత్తులకు నిర్ణయింపబడిన సార్వలౌకికములగు విలువలను బట్టియే కోరకయే వచ్చును.

(40) వర్ణాంతర వృత్తులనబడు వానిని శూద్రులు పంచములు అనువారు తమ జీవన వృత్తులుగా అవలంబింప రాదను నిషేధమే వారిని శాశ్వతముగా తర తరముల నుండియు వచ్చుచున్న నీచ వృత్తులలోనే ఉంచును. తర తరములనుండి వారికి గౌరవ వృత్తులు అగు బ్రాహ్మణ క్షత్రియ, వైశ్యవృత్తులు నిషేధింపబడినవి కదా ? ఈ యిరువుర జాతుల వృత్తులలో గొప్ప ధనార్జనముకాని, రాజ్యాంగ పాలనము కాని, గొప్ప విద్యా సంపదకాని లేవు. మఱియు ఈ వృతుల నవలంబించుదురేని ఆర్జనము కొఱకు వానిని వినియోగింప రాదనుట వారిని మఱియు చెప్పకయే నిషేధించుటే అగును. ఒక వృత్తిని అవలంబించుట దానివలన సహజముగా వచ్చు ఆర్జనమును నిషేధించుట జరుగని పనులు. యంగు ఇండియాను ప్రకటించుట దాని వలననుండి వచ్చు అపార లాభమునుండి విడదీయ లేము. నిజమునకు " యంగు ఇండియా " బోధలు

గొప్ప జ్ఞాన బోధ లగుటచే "బ్రాహ్మణత్వమే." దానిని విక్రయించుట బ్రాహ్మణత్వ విక్రయమే. దాని నుండి వచ్చిన ఆర్జనము ధర్మకార్యముల కొఱకు వినియోగించితి మన్నను మహాత్ముడు నిర్దేశించిన పతితత్వము రాక తప్పదు. మఱియు ఒక వృత్తిని అవలంబించుటలో ఆర్జనాంగమును తీసి వేసితిమేని లక్ష్యకొక్కడుకూడ స్వీకరింపడు.

(41) సనాతన వాదుల మనుకొనువారి వర్ణాశ్రమ ధర్మమను నదియు సంస్కరింపబడిన 24–11–1927–వ తేదీ గల యంగు ఇండియాలో చెప్పబడిన గాంధి వర్ణ సిద్ధాంతమును దైవవర్ణ సిద్ధాంతములుకావు. అవి వ్యక్తి స్వాతంత్ర్య సూత్రమునకు మఱియు అట్లాంటికు ఛార్టరునకు విరుద్ధములు.

(42) వానిని దైవ సిద్ధాంతములను, వర్ణాశ్రమ వాదులును ఈశ్వర వాక్కు అగు భగద్గీతనుండి గైకొంటి నని చెప్పు మహాత్ముడును వాని సత్య శీలమును ఋజువు చేయవలయును. ఇట్టి వివాదాంశములు కల్గినప్పుడు పూర్వము ఆకాశవాణిని పిలిచి పరిష్కరించుట వాడుక. అందుచే మహాత్ముడుకాని, సనాతనుల మనుకొనువారుగాని, ఆకాశ వాణిని ఆహ్వానించి వాని సత్యమును ఋజువు చేయవలసి యుండును. ఏల అనగా అవి శూద్రులనువారి పంచములను వారి జన్మ హక్కులగు బ్రాహ్మణ ధర్మానుష్ఠానపు హక్కు

లను నిషేధించుచున్నవి. మఱియు వానిలో సత్యము, అహింస, ధర్మము అనునవి లేవు.

(43) అందుచే అవి ఆర్యుల దైవ విరుద్ధ సిద్ధాంతములు. మోసము చేసి వానిని వేదములను వాని పేర భగవంతుని వాక్యములను పేర మఱి ఆయా పవిత్ర గ్రంథములలో పెక్కు ప్రక్షిప్తములను జేర్చి లోకమునకు బోధించిరి. దురదృష్ట వశాత్తు మహాత్ముడు వీనిని సర్వతోముఖముగా గాకున్నను చాలవఱకు నమ్మెను. ఆయన నమ్మిన భాగమే శూద్రు లనువారిని, పంచము లనువారిని ఆర్థికముగా, సాంఘికముగా, మత విషయికముగా, రాజకీయముగా ఇట్లు సర్వతో ముఖముగా నాశము చేయుటకు చాలును.

(44) బ్రాహ్మణుడు జన్మచేత శూద్రుడు కాడా? ఉపనయన సంస్కారము చేత కాదా బ్రాహ్మణత్వమును పొందుచున్నది?

(45) "బ్రాహ్మణోస్య ముఖమాసీత్" అను పురుష సూక్త సిద్ధాంతమును బట్టి శూద్రత్వము బ్రాహ్మణునికిని శూద్రులనబడువారికిని బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులను ఆ నాల్గు వర్ణముల మొదటి పుట్టుక స్థానము. ఆ విరాట్పురుషుని నుండియే వర్ణములు సంక్రమించుచుండగా శూద్రులయి జన్మించిన ఒకరికేల ఉండవలయును? రెండవ వారికేల లేకపోవలయును?

(46) ఈ "బ్రాహ్మణత్వ నిషేధము" శంబుక మహర్షి నాటినుండి యీనాటి వఱకు అయిదు వేల సంవత్స రములనుండియు తరము తర్వాత తరముగా చేయబడుచున్న ఆధ్యాత్మిక హత్య కాదా?

(47) బ్రాహ్మణీ కరణపు హక్కును బ్రాహ్మ ణేతరులగు వసిష్ఠుడు, విశ్వామిత్రుడు పొందలేదా? మఱియు గొప్ప దేశములలో అసంఖ్యాకులగు ప్రజలు బ్రాహ్మణత్వ మును పొంది నట్లు శాస్త్రములు చెప్పుచుండుట లేదా? "అబ్రాహ్మణ్యే తథా దేశే కైవర్తాన్ ప్రేక్ష్య భార్గవః" పరశురాముడు ఆ దేశమునకు వెళ్ళి యచ్చటను బ్రాహ్మ ణులు లేకుండుటనుజూచి చేపలు పట్టు వారికి యజ్ఞోపవీతము లిచ్చి బ్రాహ్మణులనుగా జేసెను" అని భాగవతములో చెప్పబడలేదా? ఆ హక్కు నేడు ఏల మాకు నిషేధింప బడవలయును?

(48) "బ్రహ్మ క్షత్రియ విశాం శూద్రాణాంచ పరంతప కర్మాణి ప్రవిభక్తాని స్వభావ ప్రభవైర్గుణైః" అను గీతా వాక్యములోని "స్వభావ ప్రభవైర్గుణైః" అను సూత్రములో చెప్పినట్లు స్వస్య = తన యొక్క, భావే = భావ మునందు, ప్రభవైః = పుట్టిన, గుణైః = గుణములచే (ఇచ్చట వర్ణమునకు పునాది వ్యక్తి భావము అని చెప్పబడినది కాని వర్ణభావము, పితృభావము ఈ మొదలగునవిగా చెప్పబడ లేదు.) నాల్గు వర్ణములును సృష్టింప బడినట్లు స్పష్టమై

నప్పుడు వేదములను, ఉపనిషత్తులను, గీతలను (1) నైతిక ధర్మ సూత్రములకు (2) అహింసకు (3) సత్యమునకు (4) ధర్మమునకు అనుగుణముగా పరిశీలించి సత్యార్థమును మేము నేడు నిర్ణయించుకొనరాదా ?

(49) సనాతనుల మనుకొను అష్టాదశ మహాపాపులగు బ్రాహ్మణుల "మనుజుని జన్మ పూర్వ నిర్ధారిత వృత్తి" యనునది "స్వభావ ప్రభవైర్గుణైః" అని గీతలలో ప్రతిపాదించిన వ్యక్తి స్వాతంత్ర్య సిద్ధాంతమునకు విరుద్ధమయి యుండగా మఱియు నేడు ప్రపంచములోగల సర్వ విశ్వ విద్యాలయ విద్వాంసులు — అంతరాత్మ స్వాతంత్ర్యమే సర్వ నైతిక ధర్మములకు మొదటి ప్రాణము అని చెప్పుచుండగా భగద్గీతలోని వ్యక్తి స్వాతంత్ర్యమును, ఆధునిక నైతిక శాస్త్ర వేత్తల సిద్ధాంతమును మఱియు సత్యము, అహింస, ధర్మము, నీతి అను వానిని పాటింపని "వర్ణాశ్రమ వాదులము" "సనాతనులము" అనుకొనువారి సిద్ధాంతములో సత్యము కలదా ?

(50) బ్రాహ్మణత్వ, క్షత్రియత్వ, వైశ్యత్వ, శూద్రత్వములు నాల్గు పరస్పర భిన్నవస్తువులు కావు. చతుర్గుణమై, ఐక్యమై, ఏక పురుష రూపమైన ఆధ్యాత్మిక స్వరూపమై (ఈ గ్రంథములో 25–30 పేరాలు చూ.) మాధ్యస్థితి యగు శూద్రత్వము నుండి క్రమాంతరముల ద్వారా ఈశ్వరత్వమగు బ్రాహ్మణత్వమునకు పోవుటకు సాధన మగు అవిభాజ్య

మైన వస్తువు. వ్యక్తిత్వము అడ్డము గాను, నిలువు గాను మామిడి పండువలె కోయదగిన వస్తువు గాదు. అందుచే రాబోవు రాజ్యాంగములో ఏ హిందువు డైనను ఒకవ్యక్తియే క్రమాభి వృద్ధి ననుసరించి రెండు మూడు సార్లు గాని—లేదా భిన్న వ్యక్తులుకాని బ్రాహ్మణు డగుటకును, క్షత్రియు డగుటకును, వైశ్యు డగుటకును హక్కు కలిగినట్లు—ప్రకటింపవలయును.

51 మఱి యిప్పుడు సర్వ హిందూదేశ కాంగ్రెసు బ్రాహ్మణ నాయకులు "కులతత్వము"తో ఆయా సమస్య లనుజూచుచున్నారా లేదా అను విషయమును గుఱించి చర్చింతము.

(52) 1937–వ సం॥పు మద్రాసు కాంగ్రెసు మంత్రివర్గపు ఎస్టేటు ల్యాండు ఆక్టు కమిటీ రిపోర్టులో "మైనరు ఈనాములు" అను నవి ఈనాం దారులవికాని వ్యవసాయము చేయుచున్న రైతుల భూములు కాదని ప్రకటించిరి.

(53) ఈ ప్రకటన ప్రచ్ఛన్న కులతత్వము కాదా? మఱియు సత్యవిరుద్ధము కాదా? సర్వలోకాశ్రయ మహారాజు యొక్క చెందురర్‌గ్రామ శాసనము వలన (i) అగ్రహార ములను దానము చేయు కాలములోనే (ii) భాగములనుగా జేసి బ్రాహ్మణులకు ఇచ్చుచుండిరనియు (iii) అన్ని అగ్రహార ములను 'బ్రహ్మదేయ మర్యాద' అను ఒక పద్ధతితో

ఇచ్చుచున్నారనియు తెలియుట లేదా? (iv) అవి సొంత వ్యవసాయము కొఱకు ఈయబడినవా? (ఏల అనగా వ్యవసాయము బ్రాహ్మణుని వృత్తి కాదు కనుక) (v) అవి సతత అవిచ్ఛిన్న పంచ మహా యజ్ఞములు చేయుటకు ఇచ్చిరనియు తెలియుటలేదా?

(54) మఱియు ఈ శాసనము "మైనరు ఈనాములు" అను వాని సూత్రములకు సమగ్రముగా అన్వయించు చున్నవి. ఈ మైనరు ఈనాములను సొంత వ్యవసాయముల కొఱకీయలేదు. మొదట ఇచ్చునప్పుడే "పెదెన బోయ" కు రెండు భాగములు "కొదింకె బోయ" కు రెండు భాగములు ఇట్లు విభజించి యిచ్చిరి. ఇవి భాగములు అయినను కొన్ని భాగములు చాల పెద్దవియై వందల ఎకరములు కలవిగా ఉన్నవి.

(55) ఆ రోజులలో (1) ఏ రైతు అయినను 10 ఎకరముల కంటె హెచ్చు భూమిపై వ్యవసాయము చేయగలిగి యుండెనా? (2) బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు ముగ్గురును అందు ముఖ్యముగా బ్రాహ్మణులు వ్యవసాయము అనగా భయపడుచుండెడివారు కాదా? (3) ఆ భూముల వ్యవసాయమును వారు ఇతరులకు అప్పజెప్పలేదా? (4) భూములను వందల కొలది సంవత్సరములు తండ్రి తర్వాత కుమారుడు, తరము తర్వాత తరముగా సేవ్యము చేసిన వారు శూద్రులు కాదా? (5) ఈనాములుకాని

శేరీ భూములు ఒక సం॥రము ఒక రైతునకు మఱి యొక సం॥ము వేఱొక గ్రామము వానికిగాని వేఱొక కులము వానికి గాని ఇచ్చుచుండగా ఈనాం భూములు సర్వత్ర ఒక్క కుటుంబములోనే తరతరములు మారకయుండుట (6) 1936–వ సం॥రములో ఈనాముల శాసనము పుట్టు నాటికి ఈనాందార్లలో ఎవ్వరును వ్యవసాయము చేయక యుండుట ఈ విషయము లన్నియు భూమి రైతుల దనియు ఈనాందారునకు గల హక్కు శిస్తు వసూలు చేసి కొను నంత వఱకే అనియు స్పష్టముగా తెలియుట లేదా ?

(56) మఱియు జమీందారీ భూముల విచారణ కాలములో ఈనాం భూముల విషయమై విచారణ చేయ బడుటలేదను భావము ఈనాం రైతులకు కలుగలేదా ? అందుచే నిజముగా ఈనాముల విషయమై విచారణ జరిగినదనుట కేవల మోసము.

(57) ఇంక సాక్ష్యమును తీసికొన్న విషయము ఇంతకంటెను గొప్ప మోసము. న్యాయ స్థానములో నూరు రూపాయల విలువగల పదిసెంట్ల భూమి విషయ ములో నేని రెండవ పార్టీలేకుండ తీర్పు చెప్పగలరా ? అయినను ఈ 1937–వ సం॥రపు మద్రాసు మంత్రివర్గ పరిషత్తు —— ఒక సెంటు ఈనాం భూమి గలవారినుండి కూడ——భూమిలోనుండి తొలగించు సిద్ధాంతము ఇమిడి

యుండుటచే — సాక్ష్యమును దీసికొనవలసి యుండగా లక్షల ఈనాం రైతులలో 25 లేదా 30 మంది దగ్గరనే సాక్ష్యమును పుచ్చుకొనిరి. ఆ సాక్ష్యముకూడ సర్వ మద్రాసు రాష్ట్రపు ఈనాం రైతుల సంఘము నుండి లేదా శాస్త్రీయ ప్రతినిధుల సంఘములనుండి గాక మొత్తం ఈనాం భూము లలో నూటికి ఇరువదియవ వంతు భూములకు గూడ ప్రాతి నిధ్యము లేని అందుకూడ చాల భాగము వ్యక్తులనుండియే సాక్ష్యమును తీసికొనిరి. ఇంక జమీందారీ భూముల విషయములోనో 450 సాక్ష్యములను సర్వ ప్రతినిధి సంఘములనుండియు ప్రతి జమీందారుని దగ్గఱనుండియు చాల శాస్త్రీయముగా తీసికొనిరి.

(58) ఈ తీసికొన్న స్వల్ప సాక్ష్యమునుండియు కూడ స్పష్టముగా అర్థమగుచున్న విషయమే మనగా (i) ఈనాందార్లు దేశములో చాల పలుకుబడిగల విజ్ఞాన (ii) గొప్ప ఆదాయములు వచ్చు ఉద్యోగ వ్యాపార ములు చేసికొనుచు వారు హిందూ దేశములో సర్వత్ర ఈ భూముల మీది ఆదాయము మీద జీవింపవలసిన స్థితిలో లేక సుఖముగా ఉన్నారనియు (iii) ఈనాం రైతులలో చాల మంది ఈ భూములమీద జీవించుచు వ్యవసాయమునే జీవితాధార వృత్తినిగా గైకొని తరతరముల నుండియు జీవించుచున్నారనియు స్పష్టముగా తెలియుట లేదా ?

59. మార్కెటులో ఈనాం భూముల ధరలు హెచ్చుట కాదా వ్యవసాయము చేయు రైతులను భూముల

నుండి తరిమివేయునట్లు ఈనాందారులను ప్రోత్సహించినది ? మఱి అట్టి గొప్ప ధరలు ఆ భూములకు వచ్చునట్లు చేసినది తరతరములనుండి చెమట యోడ్చి కష్టపడి యెన్నియో అభివృద్ధులు చేసిన ఆ రైతులు కాదా ? అయినను పాపభీతి లేకయే 1937–వ సంవత్సరపు రాజాజీ మంత్రివర్గ పరిషత్తు (1) సత్యము (2) ధర్మము (3) "వ్యవసాయము నున్నతికి దేవలసిన ఉదారమగు "జాతీయ కార్యక్రమము" మఱియు (4) వ్యవసాయ వృత్తియొక్క అభివృద్ధి, ఈ సూత్రములలో దేనినిబట్టి చూచినను రైతులే ఆ భూములకు అధిపతులు కావలసియుండగా లక్షల కోట్ల రూపాయల ఆస్తిని ఈనాందార్ల ఆస్తియని రాజాజీ మంత్రివర్గ మేల చెప్ప వలసి వచ్చెను ? ఇది ప్రమాద కరమైన కులతత్వ కార్యక్రమము కాదా ? ( సప్రూ కమిటీకి సమర్పించిన అనుబంధములో రాజాజీకి వేసిన మా ప్రశ్న మాలికలు చూడుము.)

(60) "మధ్య యుగము" మత సంస్థ రాజకీయ సంస్థగా వ్యవహరించుటయై దేశమున కనర్థమైనచో; ఇది నిగూఢ కులతత్వమును, దేశమునకు వేయి రెట్లు ద్రోహకరమును కాదా ? అందు కులతత్వమును వేయి సభావేదికల మీద ఖండించిన సర్వ హిందూదేశ నాయకులు ఈ భావములతో నుండినచో అది యెన్నివేల రెట్లు దేశమునకు హాని చేయును ?

(61) నిజమునకు అది ఈ రాజధానిలో గల నాల్గు, ఐదు కోట్ల ప్రజల 'ఆలోచన విధానము' 'విశ్వాసము' అను వానిలో హిమాలయోన్నతముగా ప్రమాద కరమగు హానిని కలిగింపలేదా? ఏల అనగా ఆ యమాయక ప్రజలు కాంగ్రెసు నందు గల అపార భక్తిచే, అది తప్పు చేయజాలదని, బీద రైతుల ఈనాం భూములను హరించు కార్యక్రమమును ధర్మ సమ్మత మని భావించి యీనాం భూములు ఎస్టేట్లు కావని ఎస్టేట్సులాండు ఆక్టు కమిటీ వారు రిపోర్టు చేసినను ఆ యక్రమమును గుఱించి తగినంత ఆందోళనమును చేయరైరి.

(62) ఒక యీనాములో మూడు ఎకరముల భూమిని వేఱొకరికి ఇచ్చినంత మాత్రమున సంపూర్ణముగా దాని స్వరూపము మాఱెనని సంపూర్ణ గ్రామ ఈనాములు ఈనాందారు లవి కావని; "997 ఎకరముల ఈనాము" ఈనాం దారునిదని చెప్పుట చాల గారడీ విద్య కాదా? ఒక భూమిలో ఒక చిన్న భాగమును తగ్గించినంతనే యట్లు వాని స్వభావము మారుననుట హాస్యాస్పదము. ఈనాములను బ్రాహ్మణులకు యజన, యాజనాదిక షట్కర్మలను చేయుచున్నందులకు లేదా సర్వోత్తమములగు కొన్ని సేవలను దేశమునకు చేసినందుకు నిచ్చిరి. అవి గ్రామములగుటచే అందు ఇదివఱకే వ్యవసాయము చేయు రైతులు కలరు. మఱియు బ్రాహ్మణులు వ్యవసాయ దారులు కారు. వానిమీఁద వచ్చు

శిస్తులు వసూలు చేసికొని అనుభవించుటకు మాత్రమే వారికి హక్కు కలదు. ( మా సప్రూ కమిటీ నివేదిక అనుబంధము చూ.)

(63) కావున ఈ 'రహస్య కులతత్వము' శూద్రులనువారి ఆలోచనలోని ఈశ్వర ప్రతినిధియగు హేతువాదమును జంపలేదా? వారు ఏబది యైదు లక్షల జీవితములకు సంబంధించిన, 55 లక్షల భూములకు చెందిన ఈ గొప్ప "ఈనాము సమస్య" విషయములో; గాంధిజీకి, పవిత్ర కాంగ్రెసు సంస్థకు సంబంధించిన మహా నాయకులు తడి గుడ్డతో గొంతుకకోయు పద్ధతితో జేసిన యన్యాయమగుటచే; నిజము గ్రహింప లేక చేయవలసినంత ఆందోళన చేయమి రహస్య కులతత్వ ఫలితముకాదా? అది మఱియు ఈ రాజధానిలో ఇంత ఘోర అన్యాయము జరుగుటను చూచు 5 కోట్ల మంది జనుల బుద్ధిలోని న్యాయ విచక్షణ శక్తిని కూడ ఏక కాలములోనే చంపలేదా?

(64) 'సర్వ ధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ' అని శ్రీకృష్ణ భగవానుడు చెప్పెను. మహాత్మాజీ "కళా శాలలను విడువుడు, ప్రభుత్వోద్యోగముల మాట తలంపకుడు, నా వెంట రండు" అని దిక్కులు మాఱుమ్రోయునట్లు ఘోషించెను. వేలకొలది మంది ఆయనతో చేరలేదు. ఆదర్శవాదులు కొందఱు ఆయన ఆహ్వానము నంగీకరించిరి. అట్టి కొలది మందిలో

దు. రాఘవచంద్రయ్య సచ్ఛాస్త్రి యొకరు. ఆయన పట్ట పరీక్షలో ఒక భాగములో గెల్చి, కాంగ్రెసులో గౌరవ భృతిని సుమారొక వత్సరము పొంది (దానిని సర్వ హిందూ దేశ కాంగ్రెసు కమిటీ సమావేశములు మొ॥ వానికే వినియోగించి) 1920–వ సంవత్సరము నుండి సేవ చేసెను. సంవత్సరము తరువాత గౌరవ వేతనమును గైకొనకయే కాంగ్రెసు సేవ చేయుచుండెను.

(65) 1937–వ సం॥ములో మహర్షి జీతోను, పట్టాభిజీ తోనుకూడిన ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు కార్య వర్గమువారు, సద్బ్రహ్మశ్రీ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుగారి వంటివారి సమ్మతి పొందిన "అష్టాదశ మహా పాపి యగు బ్రాహ్మణునితో సాహాయ్య నిరాకరణ మొనర్పుము" అను గ్రంథమును సచ్ఛాస్త్రిగారు ప్రకటించిరను కారణముచే సెంట్రలు అసెంబ్లీ సభ్యత్వమును ఆయన కిచ్చుటకు సమ్మతింపరైరి.

(66) "జెయిలులో సచ్ఛాస్త్రి వేదపాఠమును నిరోధించుటకు మహర్షి సాంబమూర్తిగారు చేసిన ప్రయత్నమును గురించి పైని జెప్పిన గ్రంథములో ఉదహరింపకుండి నచో ఆ సెంట్రలు అసెంబ్లీ సభ్యతను తప్పక పొంది యుండెడివాఁడు" అని మహర్షి జీ స్పష్టముగా జెప్పెను.

(67) ఈ మహర్షి జీని తృప్తి పరచుటకును, పైని చెప్పిన గ్రంథమును వ్రాసినందుకు సచ్ఛాస్త్రిని శిక్షించు

టకును మఱియు కనీసము 10 ఏండ్లు తక్కువ కాంగ్రెసు సేవ కల్గిన బ్రాహ్మణుని సంతోషపరచుటకును ఆ అభ్యర్థిత్వమును ఆయన కిచ్చుటకు ఆ బ్రాహ్మణ వర్గము తిరస్కరించిరి.

(68) కాని 45-వ సం॥రము వయస్సు కలిగి అప్పటి వఱకు 17 ఏండ్ల (1937-వ సం॥రము వఱకు) కాంగ్రెసు సేవజేసిన నెహ్రూజీ తన జీవిత చరిత్రలో చెప్పినట్లు, గౌరవ వేతనమును గూడ విడిచి, లంచములు పుచ్చుకొనుట, అక్కౌంట్లు లేని అక్కౌంట్లు చూపుట మొదలగు పద్ధతులు లేక తన జీవిత సమస్యను ధర్మ యుతముగా పరిష్కారము చేసికొన్న కాంగ్రెసు సేవకుని హక్కులను త్రోసిపుచ్చుట ఆయనను 'రాజకీయ హత్య' చేయుటకాదా ?

(69) కాంగ్రెసు వర్కింగు కమిటీలో ఆంధ్ర ప్రతినిధి యని ఆంధ్రుల గర్వమునకు పాత్రుడగుచున్నవాడు, మహాత్మాజీ సూక్తులకు వ్యాఖ్య చేయుచున్నవాడు, కాంగ్రెసు చరిత్రము వ్రాసినవాడు అగు పట్టాభిజీ రెండవ సారి 1941-వ సం॥రములో (శ్రీ తిరుమలరావు గారు వదలి నప్పుడు) ఆ స్థానమును రమారమి అప్పటికి 15 సం॥ముల పిమ్మట, కాంగ్రెసు అధికారమునకు రాబోవు కాలములో, చేరి తత్ఫలముగా పాలకొల్లు మ్యునిసిపాలిటీ అధ్యక్షతను పొందిన శ్రీ అద్దేపల్లి సత్యనారాయణగారి

కిచ్చుట జాతీయత అను పొదుగు మాటున దాచిన 'కుల తత్వము' కాదా ?

(70) మఱి నేఁడు రాష్ట్రీయ బ్రాహ్మణ నాయకులు మరల మూఁడవసారి సచ్ఛాస్త్రి దరఖాస్తును ఈ 1945-వ సం॥ములో రాబోవు అభ్యర్థిత్వములలో ఈ సంవత్సరము కాంగ్రెసులోనికి తీసికొను అభ్యర్థులతో పాటుకూడ సమముగా అంగికరింపకుండ త్రోసివేయుటకు ఆలోచించుచున్నారు.

(71) మూఁడు వత్సరములకు పిమ్మట జెయిలు నుండి విడుదలయై వచ్చినేఁడు పట్టాభిజీ 'నేను అద్దేపల్లి సత్యనారాయణగారిని ఏల అంగీకరించితి ననగా ప్రభుత్వము వారు కావించిన 'జాతీయ సవాలునకు (అనగా మీ ప్రతినిధులను మేము అనర్హులుగా జేయుదు మను సవాలునకు) జవాబు' అని చెప్పిరి.

(72) కాని, ఈ సమాధానము సత్యమైనదా ? అదే సమయములో ప్రభుత్వము వారు సర్వ హిందూ దేశములో ఆరంభించిన 'జాతీయ దండన ఫలితములగు' సెంట్రలు అసెంబ్లీ సభ్యత్వముల ఖాళీలకు ఆ యా రాష్ట్ర నాయకులు "జా తీ య స వా లు" సూత్రము పైని ప్రతి సభ్యులను ఎన్నుకొనిరా ? నిజమునకు ఆ రోజులలో ఆ యా రాష్ట్రములలో అయిన ఖాళీలను భర్తీ చేయుటకు, చేయకుండుటకు స్వాతంత్ర్య మిచ్చు మ హా త్మ ని పద్ధతి

సరియైనది కాదని, ఒక్కొక్కప్పు డొక్క ఓటుతో సెంట్రలు అసెంబ్లీలో మనకు మెజారిటీ లేకపోవుటచే కాంగ్రెసు తీర్మానములను ప్రభుత్వము ఓడింప వచ్చునని, అందుచే అన్ని స్థానములకు ఎన్నిక జరుపుట మంచిదని (నిజమునకు ఉత్తర హిందూ దేశములో ఆ రోజులలో అయిన ఖాళీలకు కొన్నిటికి కాంగ్రెసు వారు అభ్యర్థులనే పెట్ట లేదు) సచ్చాస్త్రి గారు డాక్టరుగారితో చెప్పిరి. మఱియు ఈ "జాతీయ సవాలు" అను సూత్రమును పట్టాభిజీ కి మహాత్ముడు కాని, తక్కిన వర్కింగు కమిటీ సభ్యులు కాని ప్రతిపాదించ లేదు. అంతే కాదు. "జెయిలునకు వెళ్లిన కాంగ్రెసు యోధుడు పార్లమెంటరీ కార్యక్రమము ఇత్యాది పౌర హక్కులలో మృత తుల్యుడే" అను మహాత్ముని ధర్మ సూక్ష్మము పట్టాభిజీ యెఱుంగనిది కాదు.

(73) మఱియు ఆ 'జాతీయ సవాల్' సర్వ హిందూ దేశము మీదను ప్రయోగింపబడినను అది కాంగ్రెసును మైనారిటీగనే చేసియుండెడిది. జెయిళ్ళలో లేని కాంగ్రెసు వారిని అభ్యర్థులనుగా ఏర్పఱచుటయే కాంగ్రెసు వారు ముస్లిము లీగుతో కలిసి 10, 12 సార్లు ప్రభుత్వమును ఓడించుటకు, ఈ సంవత్సరపు మొదటి రోజులలో అవకాశమిచ్చినది. అట్లోడించుటయే 'రాజ్యాంగ వేత్త' యగు వైస్రాయి వేవెల్ ప్రభువునకు భారత దేశ స్వాతంత్ర్య విముఖుడగు చర్చిలుయొక్క కఠిన ప్రభుత్వమును

లొంగఁ జేసి 'వేవెలు భారత పరిష్కార పద్ధతిని' తెచ్చు టకు వీలు అయినది.

(74) ఏడేండ్ల నాడు పట్టాభిజీ ఆంధ్ర మహాసభ వేదిక నుండి 'తాను పెంచి, పోషించి, మహోన్నత స్థితికిఁ దెచ్చిన ఆంధ్ర ఇన్ష్యూరెన్సు కంపెనీ నుండి తన యిష్టము నకు భిన్నముగా వెళ్ళిపోవలసిన దుర్గతి' ని గుఱించి బహుశః ఆ కంపెనీ వర్గమునకు నచ్చఁ జేయుటకు గాబోలు చెప్పిన పశ్చాత్తాప వాక్యములు నిజముగా ఆ డాక్టరుగారు మహర్షి యయ్యెనను ఆశ్చర్యమును కలిగించెను. కాని, ఆయన కులతత్వమును విడువనే లేదు.

(75) (i) 'మధ్యమ యుగతత్వ' (ii) 'రహస్య కులతత్వము' లలో నిస్సందేహముగా మొదటిది సాధా రణముగనే చాల తక్కువ హానిని కల్గించును. కులతత్వమో రాజాజీవంటి మహానాయకుల చేతను, సర్వ భారత కాంగ్రెసు కార్య సంఘ సభ్యుల చేతను ఆచరింపబడునప్పుడు కలుగజేయు హానికి పరిమితి లేదు. ఏల అనగా జనసామా న్యము ప్రతి చిన్న విషయములోను గల అనేక సూక్ష్మాంశ ముల మీద చర్చ చేసి సత్యాంశములు నిర్ణయింపఁజాలరు. అందుచే వారు "పూజ్యులగు ఆచార్యులుగారు లేదా, పంతులుగారు చెప్పిరి. కనుక సత్యమే''అనుకొందురు. మఱి ఆ 'జాతీయమగు సవాలు'లక్షల కోట్లఆస్తికి సంబంధించిన కృష్ణా గోదావరీ మండలముల వంటి గొప్ప రైతుల ఎన్నిక వర్గముల

విషయములో కాంగ్రెసునకుగల బాధ్యతను జంపివేయునా? (రైతుల ప్రయోజనములు, మిల్లు యజమానుల ప్రయోజనములు పెద్దపులి, మేకల ప్రయోజనములవలె నిరంతర విరోధము కలవి) (ii) మఱి కోరు అభ్యర్థుల విద్యాధికత (iii) వయస్సులో అధికత, న్యూనత (iv) కాంగ్రెసు సేవలో అధికత, న్యూనత ఈ మొదలగు ధర్మ సూత్రములను సమన్వయింపవలసిన యవసరము లేదా? (v) మఱియు ఇది కేవలము మోసము. ఏల అనగా సర్వ హిందూ దేశములో లేని, ఒక్క వ్యక్తి విషయములో ఆచరించిన జాతీయమగు సవాలు (ఏక భట యుద్ధము వలె) హాస్యాస్పదమైనది. (vi) సర్వ హిందూ దేశమును అవలంబించినచో అసెంబ్లీ శూన్యమయ్యెడిది. (vii) అది గాక "సవాలు" అను నది శత్రువును సంపూర్ణముగా—ధర్మరాజు నిండు పేరోలగములో తన భార్య యొక్క కోకను వలుచుచుండ అట్టి ఘోరమగు అవమానమును కూడ సహించి 12 ఏండ్లు అరణ్యములో తిరిగి, ఒక్కయే డజ్ఞాత వాసము చేసి సరియగు ఋణము వచ్చినప్పుడే చేసినట్లు అనగా జయింపదగు కాలము వచ్చినప్పుడే—సక్రమముగా చేయందగినది కదా?

(76) యూదుల అధిక సంఖ్య, ప్రోటస్టెంటుల అధిక సంఖ్య, క్యాథలిక్కుల అధిక సంఖ్య ఈ విధముగా రాజ్యాంగ బలమును కులతత్వపు కొలతపాత్రతో కొలవరని నెహూౄజీ చెప్పెను. కాని యే యూదుడైనను తన

మోక్షసిద్ధి కొఱకు ప్రోటస్టెంటు మతములోనికి గాని, క్యాథలిక్కు మతము లోనికి గాని రాఁగూడదని నిషేధింపఁ బడుచున్నాఁడా ? కాని, ఈ దేశములో శూద్రులను వారికి పంచములను వారికి బ్రాహ్మణత్వమును అనుష్ఠించు హక్కును ఏల నిషేధింపవలయును ? మఱి ఒక యూదుడు ప్రోటస్టెంటు కన్యను—మఱి యట్లే ప్రోటస్టెంటు మతస్థుడు యూదులకన్యను—పెండ్లాడవచ్చును. కాని, బ్రాహ్మణుని అనులోమ విలోమ సిద్ధాంతముం జూడుడు. తన కూతు నెవ్వడు వివాహ మాడరాదు; శూద్రుడనువాని కన్యను తాను వివాహమాడ వచ్చుననుచున్నాడు. నెహ్రూజీ ! తా మొక నిమిషము శూద్రుడనని భావింపుడు !. ఈ అగౌరవమును మీరు సహింపగలరా ? సమానత్వమును ఈయనంత కాలము చర్చిలు యుద్ధ వర్గములో ఒక బానిసగా నేను పని చేయఁ జాలనని చెప్ప లేదా ? అవి నిజముగా ఉదార వాక్కులు. కాని, మన స్వరాజ్యము బ్రాహ్మణులకేనా ?

(77) మఱి, అసంఖ్యాకము లగు ఈ యవమానముల మాటేమి? సహపంక్తి భోజనముమాట అటుండనిండు. భోజనము చూచిననే పాపము వచ్చుననుటేమి ? మిమ్ము మా యింటికి గౌరవాతిథినిగా బిలిచి, యింటి వెలుపల వసారాలో — సహ పంక్తిని కూర్చుండ నిచ్చుట అగౌరవ మను భావముతో — విందు జేయుటను మీ రంగీకరింపఁ గలరా ? అయినను 20 కోట్ల మంది శూద్రులను వారికి నిత్యము

జరుగు అవమాన మిది కాదా ? ప్రొటెస్టెంటులు కాని, యూదులుకాని, క్యాథలిక్కులు కాని "చూచిన మైల (పాపము) వచ్చును, అంటిన పాపము వచ్చును మా భోజన పంక్తిలో కూర్చుండరాదు" యిట్టి అవమానము లను నిత్యము తమలో తాము ఒకరొకరి విషయములో అనుష్ఠించు చున్నారా ?

(78) ఏల నెహూృజీ సత్యమును మఱుగు పరచ వలయును ? శూద్రు లనఁబడు మేము "ప్రత్యేక నియోజక వర్గములను" ఏల కోరుచుంటిమి అనగా బ్రాహ్మణులు (i) అంతర్వర్ణ వివాహములు నిషేధించియు (ii) తమ బ్రాహ్మణ జాతిలోని వ్యభిచారిణులను, హత్యలు చేయు వారిని అంగీకరించుచు సత్పురుషులను గూడ సహపంక్తి భోజనములకు రాగూడదని నిషేధించియు (iii) మాకు మోక్షసిద్ధిని కల్గించు బ్రాహ్మణ ధర్మమును అనుష్ఠింప రాదనియు (iv) అర్చకత్వమును నిషేధించియు—వీని నన్ని టిని మేము చేసిన పాపఫలముగా గాక ఒక సంఘములో జన్మించిన హేతువుచే—చేయుట లేదా ? మఱి ఇది విజాతీయ తత్వము కాదా ? ఆర్యుడగు బ్రాహ్మణుడు ద్రావిడులగు బ్రాహ్మణేతరులకు ఈశ్వరుని పేరఁ జేయు హింస కాదా ?

(79) కావున ప్రత్యేక నియోజక వర్గములనునవి మమ్ములను రక్షించు కొనుటకొఱకు అడిగిన ఆత్మరక్షణ

సాధనలు. అవి దైవము మాటున బ్రాహ్మణుడు చేయు హింసనుండి కాపాడుకొనుటకు ఉపపాదించిన నివారణోపాయములు. అనఁగా "మందు." అంత కంటె మంచి మందును మీరు సూచింపవచ్చును. దానిని రోగముగా ప్రదర్శింతురేల ? (మీరు చెప్పిన లాహోరు ఉపన్యాసము మహమ్మదీయుల ప్రత్యేక నియోజక వర్గములం గూర్చి యైనను అది శూద్రులనువారికిని అన్వయించును.)

(80) కావున కాంగ్రెసు కార్య నిర్వాహకవర్గములో బ్రాహ్మణు లధిక సంఖ్యగా ఉన్నారు అనుట పాపము కాదు. అది మఱియు ప్రత్యేక నియోజక వర్గముల ఫలముగాని, ప్రత్యేక రిజర్వేషనుల ఫలముకాని కాదు. అష్టాదశవిధ బహిష్కారమును, నిష్కారణముగా అష్టాదశ మహాపాపియై దేశముమీద ప్రయోగించిన బ్రాహ్మణుని మనస్తత్వ ఫలము.

(81) ప్రపంచ విఖ్యాతుఁ డగు విమర్శకుఁడును, గ్రంథకర్త, రాజకీయ వేత్తయునగు ఎడ్గరు స్నోగారేమి చెప్పుచున్నారో చూడుడు:– " ఈ విధముగా బ్రాహ్మణత విజ్ఞానమునకు, సర్వసమాన సభ్యతకు, పరస్పర సహకారమునకు, సాంఘిక సంతోషములకు — ముస్లిముల — హిందువుల మధ్యనే గాక ; హిందువుల హిందువుల మధ్య కూడ గొప్ప ఆటంకము. అది పాశ్చాత్త్యులకును కష్టహేతువే. నేను ఇండియాకు వెళ్ళిన కొలఁది రోజులకు మదన మోహన

మాళవ్యాజీ శిష్యవర్గములోని యొక ఉత్సాహియగు ఆంగ్ల భాషా కోవిదుడు వచ్చి తనతో భుజింపుడని తన యింటికి దీసికొనివెళ్ళి, ఒక టేబిలుమీద కూర్చుండబెట్టి, ఒక నవుకరు ద్వారా భోజనమును బంపెను. — ఆ క్షణములోనే తాను తిరిగి వచ్చి నేను (ప్రారంభింపక ముందే) భోజనము చేసి వచ్చితినని చెప్పగా చాల ఆశ్చర్యపడితిని. తరువాత ఇట్లు నాతో భుజింపకున్నను ఆయన స్నానముచేసి పవిత్రుడు కావలసి యుండుననియు, నాతో కూర్చుండి భుజించి యున్నచో పురోహితునిం బిలిచి ప్రాయశ్చిత్త కర్మ కాండ చేసికొనినగాని పాపము హరింపదనియు తెలిసికొని అట్టి అవస్థను ఎవ్వరి విషయములోను మరల కల్గింపనైతిని. (ఎడ్గరు స్నో గారు వ్రాసిన గ్లోరీ అండు బాండేజి అను పుస్తకము (1945) 17 పుట చూ.) నేడు భారత భూమిలో ఎవ్వరు విజాతీయమగు వస్తువు? బ్రాహ్మణుడా? నోరు లేక ఈశ్వరుని పేర, పవిత్ర గ్రంథముల పేర వారుపెట్టు నరక బాధ లనుభవించుచున్న శూద్రులను వారును, పంచము లను వారునా?

(82) మంత్రిత్వ పదవులను విడుచుచున్న జస్టిసు పక్షమువారు 1937 లో వ్యవసాయకులకు రెమి షనుగా ఇచ్చిన 75 లక్షల రూపాయలను క్రొత్తగా వచ్చిన కాంగ్రెసు మంత్రివర్గము(1937)ఏల రైతులకు ఆ లాభమును చెందం జేయలేదు? 1931 లో ప్రారంభమైన ఆర్థిక సంక్షోభ

ఫలముగా ఆ యాభైదు సం॥ములు రైతువర్గము చెప్పరాని బాధల పాలుకాలేదా? దానిని 1939–వ సం॥ము వఱకు ఆచరణలో ఏల పెట్టకుండవలయును? 1939–వ సం॥లో ఏల అడ్వైజరు గవర్నమెంటు ఆ లాభమును రైతుల కందఁ జేయవలెను?

(83) ఇచ్చటనే "బ్రాహ్మణుడా! రాజకీయమును విడిచిపెట్టుము" అను సూత్రము ప్రారంభ మగుచున్నది. (i) వర్ణాశ్రమ ధర్మము (ii) సర్వే జనాస్సుఖి నోభవంతు అను ఉదార సూత్రములను దైవ వాక్కులను పవిత్ర నామముతో జతపరచి 20 కోట్ల శూద్రులనువారిని 8 కోట్ల పంచము లనువారిని ఈశ్వర సిద్ధాంతముగా నమ్మించి శ్రోత్రియు లనువారు నాశము చేసిరి. మఱి నేడు రాజకీయ బ్రాహ్మణుడు "జాతీయత" అను సూత్రముతో — నిజముగా ఈ మోసము జయించినదికూడ — ఏల అనగా 5 కోట్ల ఈ రాజధాని ప్రజలు ఈనాములు నిజముగా ఈనాందార్లవి కానిచో ఏల పవిత్రమగు కాంగ్రెసు "రైతులవి కావని ఈనాందార్లవని చెప్పవలయునని" భ్రమించి యాందోళనము చేయక మిన్నకుండిరి కదా? మఱియు బ్రాహ్మణులకు ఈనాము లివ్వ వలయు ననుటలో తప్ప ఇతర విషయములలో పవిత్రుడగు టి. ఆర్. వెంకటరామ శాస్త్రియరు గారు లిన్‌లిత్‌గో ప్రభువును ఈనాములు

రైతులవి కావని, ఈనాందార్లవని అసత్యముగా ఏల నమ్మించి రైతులకు అన్యాయము చేయవలయును ?

(84) అందుచే బ్రాహ్మణేతర రాజకీయజ్ఞుల మధ్య బ్రాహ్మణుడు ఉండుట అనగా వినాశకర మగు ద్రోహ మాచరించుటే. బ్రాహ్మణేతరులు, బ్రాహ్మణ సంఘములను "అణగద్రొక్కుటకు" "ఏడ్పించుటకు" "హింసించుటకు" ప్రయత్నించుచున్నారని రాజాజీ ఆరోపించిరి. అది సత్యము కాదు. నిజమునకు వారే బ్రాహ్మణేతర సంఘములను అణగ ద్రొక్కుచు, ఏడ్పించుచు, హింసించుచున్నారు. అందుచే ఈ సందిగ్ధ సమయములో బ్రాహ్మణుడు రాజకీయమును విడిచిపెట్టి, వైదిక బ్రాహ్మణుల పవిత్ర యజన యజనాదిక వృత్తులలో నుండుట చాల అవసరము.

(85) నిస్సందేహముగా నెహ్రూజీ, రాజాజీ, పట్టాభిజీ మొదలగు బ్రాహ్మణ రాజకీయజ్ఞుల పవిత్ర సలహాలను—మహాత్మాజీ నుండి కాంగ్రెసు, సర్వ భారత భూమివారు, కాంగ్రెసు సమావేశములలో "వేవెలు పథకము" మొదలగు వానిలో చాల స్వల్పముగా ఆయన జోక్యము కలుగ జేసికొనుచున్నను — సలహాలు తీసికొను చున్నట్లు తీసికొనుచుందురు.

(86) అది పంచము లనువారికి, శూద్రు లనువారికి స్వతంత్రముగా రాజకీయ సమస్యలను. జాతీయ, అంతర్జా

తీయ విషయములలో యోచించుటకు అవకాశ మిచ్చును. మఱియు ఇతర రాజకీయ పక్షములతో చేరి ప్రభుత్వములను నడపుటకు, విచ్ఛిన్నము చేయుటకు, ప్రతిఘటించుటకు, ఆ యా తరుణములకు తగినట్లు మారుచుండు రాజకీయావసరముల ననుసరించి, యత్నించు చుందురు. అది వారికి మంచి రాజకీయ శిక్ష నొసంగును.

(87) మఱి ఈ బ్రాహ్మణుని రాజకీయ విరమణము ముప్పది వర్షముల కంటె హెచ్చుగా నుండ నక్కఱలేదు. ఈలోగా తగిన శ్రద్ధతో పనిచేసినచో శూద్రు లనువారు, పంచములనువారు తమ మీద ప్రయోగింప బడుచున్న 18 నిషేధములను (అనుబంధము 5 చూ.) మఱియు బ్రాహ్మణుని శాశ్వతములగు 12 రిజర్వేషనులను (అనుబంధము 6 చూ.) తొలగించుదురు. అట్లు చేయుదురేని సర్వాంగ సదృశవృద్ధితో శోభించు హిందూ జాతిని సృష్టించిన వారమై నేడు బ్రాహ్మణ రూపమగు ఏనుగు ముఖము తోను, చాల సంకుచితమై చిన్నదగు క్షత్రియ రూపమగు తనువుతోను, వికారముగా, కేవలార్థికముగా విజృంభించిన వైశ్యులను ఊరువులతోను నాశమై జేనెడు కూడ లేని శూద్రత్వ పాదములతోను చాల వికారముగా ఉన్న హిందూ స్వరూపము సర్వ లక్షణ లక్షితమై ఆయా యంగములకు తగిన పరిమితితో శోభిల్లును.

(88) నేటి జాతీయ పునర్నిర్మాణములో చేయదగిన అత్యంత ప్రాముఖ్యమగు వస్తు విదియే. ఏల అనఁగా హిందూ సంఘములో అష్టాదశ మహాపాపియగు బ్రాహ్మణుని రాక్షస నీతిచే హిందువులు విదేశీయుల నాహ్వానించి స్వరాజ్యమును గోలుపోయిరి. నేటి భారత దేశపు తూర్పు స్థితి గతులు పశ్చిమోత్తర ప్రాంతములు చాల క్లిష్టముగా ఉన్నవి. మఱి హిందూ దేశములో సర్వత్ర హిందూ ముస్లిము విభేదము చాల తీవ్రముగా ఉన్నది. సర్వతో ముఖముగా ఐక్యత గల హిందూ భారత మొక్కటే నేడు మనను రాబోవు గొప్ప విపత్తునుండి రక్షింపఁ గలది.

(89) కాని, అట్టి పరస్పరాంగీకారము లేనిచో శూద్రులనువారికి, పంచములనువారికి ప్రత్యేక నియోజక వర్గములనిచ్చు టొక్కటే రక్షణకు దారి. మఱియు ఈ జాతులకు 'హైందవ భారతములో' వారి వారి ప్రత్యేక జన సంఖ్య యెంతెంత పాలుగా ఉండునో, వారు వారు రాష్ట్ర శాసన సభలలోను కేంద్ర శాసన సభలలోను రాష్ట్ర కేంద్ర మంత్రి వర్గములలోను అంతంత పాలుగా ప్రాతినిధ్యము కలవారై యుండవలయును.

(90) మఱి ఈ తరములో ద్విజవర్గము అందు ముఖ్యముగా బ్రాహ్మణులు శూద్రులనువారితోను పంచములనువారితోను అంతర్వర్ణ వివాహములు అంతర్భోజనములు చేయుటకు ఇష్టపడుటలేదు. అది నిజముగా హిమా

లయోత్కృతమగు కులతత్వభావము. నిన్న మొన్న రాజాజీ అంతర్వర్ణ వివాహములను ప్రతిపాదింపగా చాల గొప్ప వ్యతిరేక విమర్శ బయలుదేఱినది. గొప్ప సంస్కృత పండితుఁడు, వేదాంతి, విమర్శకుడు అగు నాగరాజ శర్మ గారు బ్రాహ్మణుల "రక్త పరిశుద్ధత" కొఱకు అంతర్వర్ణ వివాహములు జరుగరాదని బోధించెను.

(91) నేటి బ్రాహ్మణ రక్తము అంత పరిశుద్ధముగా నున్నదా? వసిష్ఠ, ముద్గల, విశ్వామిత్ర గోత్రముల మాటేమి? వారు బ్రాహ్మణేతరులై బ్రాహ్మణులు కాలేదా? "అబ్రాహ్మణ్యే తథాదేశే కైవర్తాన్ ప్రేక్ష్య భార్గవః" అని భాగవతములో చెప్పినట్లు (పీఠికలో 19–వ పుట చూ.) చేపల పట్టు వారిని——దేశము లకు దేశములనే బ్రాహ్మణులనుగా పరశురామా దులు చేయలేదా? ఈ సాంకర్యములు అంతర్వివాహ ములచే సర్వ బ్రాహ్మణ సంఘమునందును వ్యాపింప లేదా? వ్యభిచారముల మధ్య శూద్రాదులకు జన్మించి గుసగుసల మధ్య నిరంతరము బ్రాహ్మణు లగుచున్నవారి మాటేమి?

(92) మఱియు ప్రతి తరములోను బ్రాహ్మణ పుత్రికలు "స్త్రియో వైశ్యాస్తథా శూద్రాః" అను భగవద్గీత వాక్యానుసారము శూద్రులు కారా? మగఁడు బ్రాహ్మణుడు, భార్య శూద్రయు తరతరములుగా ఆదినుండియు

అయి యుండగా పరిశుద్ధ రక్త మెక్కడినుండి వచ్చును? మఱియు నీ జన్మ వర్ణము శూద్రత్వము కాదా? ఉపనయనముచే కాదా బ్రాహ్మణత్వము వచ్చుచున్నది? అదియునుంగాక బ్రాహ్మణత్వమే — కొన్ని నిత్య ధర్మములు అనుష్ఠించిననే నిలుచునదియు, చేయనినాడు పోవునదియు అగు షరతుల మీద ఆధారపడిన ప్రతి వ్యక్తి యొక్కయు స్వసంపాదనము కాదా? అది ఆ వ్యక్తితోనే పోవునదియును కాదా? అందుచే "ప్రత్యేక పరిశుద్ధరక్త" సమస్య యేది? రెండు పూటలు సంధ్యానుష్ఠానము మానినచో పోవు బ్రాహ్మణత్వము జాతి వస్తు వెట్లగును? కావున బ్రాహ్మణులు సంపూర్ణముగా పరిశుద్ధ రక్తము కలవారని నాగరాజ శర్మగారు చెప్పగలరా?

(93) పోనిండు! వాద సౌకర్యము కొఱకు బ్రాహ్మణులు "పరిశుద్ధ రక్తము కలవారే" అని భావింతము. ఆ "పరిశుద్ధ రక్తము" నకు పోషణము ఉండవలదా? నేడు శూద్రులను వారు, ముస్లిములు మొదలగువారు గుమస్తాలు వగైరాలునుగా బ్రాహ్మణులను గైకొని పోషించు చుండుట లేదా? ఆ "పరిశుద్ధ రక్తమును" పోషించు సర్వసంస్థలలోను ముఖ్యముగా (1) శిఖరము నుండి పాదమువఱకు రాజ్యాంగోద్యోగములలోను (2) అన్ని రాజ్యాంగ భిన్నములగు ప్రజా వ్యాపారములలోను (3) అర్ధ ప్రభుత్వాంగములగు మ్యునిసిపాలిటీలు, జిల్లా బోర్డులు,

సహకార సంస్థలు వగైరాలలోను (4) మఱియు అర్చకత్వ (5) పౌరోహిత్యములలోను (6) రైల్వేలు మొదలగు అన్ని లిమిటెడు కంపెనీలు ఇంతయేల నూటికి కనీసము 60 వంతుల మూలధనమును లేదా నిత్యాదాయమును బ్రాహ్మణేతరులనుండి పొందు అన్ని సంస్థల నుండియు "అపరిశుద్ధుల పోషణ" నుండి, పాపమునుండి విముక్తి కల్గించుటకు తొలగించితిమేని—బ్రాహ్మణులు స్వతంత్రులై జీవించుదురా ?

(91) ఆ "పరిశుద్ధ రక్త వంతులు" భోజనమునకు ధాన్యాదులు సృష్టిచేయుటలో స్వయం సహాయ్య సూత్రము మీద జీవించుచున్నారా ? భోజన మెవ్వరిచ్చుచున్నారు ? బ్రాహ్మణుడు భూములు దున్నుచున్నాడా ? పశువులను మేపి తగినంతగా పాలును సృష్టించుకొనుచున్నాడా ? శాకములు పండ్లు వగైరాలు పండించుచున్నాడా? ఏల 'అపరిశుద్ధ రక్తవంతులు,' 'తక్కువ వారు' నగు శూద్రులనువారు వారిని గుమస్తాలు మొదలగు స్థానములలో ఏర్పాటు చేసికొని ఆ పరిశుద్ధ రక్తమును పోషింపవలయును ? — తక్కువ వాడవు భోజన కాలములో నీ మొగము చూచిన పాపము, అంటుకొనిన పాపము — అని పరాభవము చేయించుకొనుటకా !. మఱియు పశ్చాంతరములో పరిశుద్ధ రక్తము గల బ్రాహ్మణుడు ఏల తాను తక్కువ వారని భావించు శూద్రులను వారిని, ముస్లిములు

వగైరాలను — ఇది నిజముగా శాస్త్రములో నిషేధింప బడినది కూడను—పొట్టకూటికై సేవింప వలయును ?

95. ఆ బ్రాహ్మణుడు ధాన్యములను, బెల్లము, పాలు, పెరుగు, బియ్యము ఉచితముగా "అపరిశుద్ధ రక్త" వంతులగు శూద్రుల నుండి గైకొని వారు వేల కొలది రూప్యములు ఖర్చు చేసి కావించు సంతర్పణలు, సమారాధనలు వగైరాలలోనే ఆ దాతలనే చూచినను, అంటినను పాపమని సహ పంక్తిని గూర్చుండ రాదని నిషేధించి బ్రాహ్మణ వ్యభిచారిణులను హత్యలు చేయు వారిని కూర్చుండఁ బెట్టుకొని భుజింప వచ్చునా ? మఱియు చిత్ర మేమి అనగా ఈ ధాన్యాదులు, విత్తు నాటి నప్పటి నుండి పండించి బియ్యము అగు వఱకు కల నూఱు వివిధాంతరము లలో ఎచ్చటను "ఆ తెలివిగల అంటు" (ఆ పంట బ్రాహ్మణులు పండింపజాలనిది అగుటచేత) ఉండదు. మంచినీటి విషయములో కూడ నూయి త్రవ్వుట, వెల్లవేయుట మొదలగు అంతరములలో (ఏల అనగా ఈ పనులను బ్రాహ్మణుడు చేయఁజాలఁడు గనుక) అంటు లేదు. అట్లే ఇంటి లోనికి నీటి పంపు, వచ్చిన తర్వాతనే అంటు ప్రారంభ మగును.

96. కావున ఇట్టి అపరిశుద్ధ రక్తవంతులగు శూద్రు లనువారితో, పంచము లనువారితో ఎట్టి సంబంధమును లేకుండ పవిత్రులుగా ఉండుటకు ఏ సముద్రములోని లంకకో పోయి వంటకు ముందు జరుగు నూఱు అంతరముల

లోను ఏ అపరిశుద్ధ రక్త వంతులును అంటకుండ స్వయం సాహాయ్య పద్ధతితో పండించుకొనుట బ్రాహ్మణులు చాల సంతోషముతో చేయఁ దగిన పనికాదా ?

97. పోనిండు ! అట్లు వారు కావించి రనుకొందము. అప్పటికిని ఈ సమస్య పరిష్కారము అగునా ? చాల గొప్ప దండయాత్రలు, నవీనాయుధ పరికరములొప్పు మహాయుద్ధ ములు కల ఈ కాలములో 2 లేక 3 కోట్ల మంది బ్రాహ్మ ణులు (ద్విజులు) విదేశీయుల సంఘర్షణల నుండి తమ్ము కాపాడుకొన గలరా ? అప్పుడు అపరిశుద్ధ రక్తము గల పంచము లనువారు, శూద్రు లనువారు విదేశములతో పోరాడుటకు సాయము రావలయునా ?

98. కావున ఈ 1945–వ సం॥ములో నేటి బ్రాహ్మణుని కార్యక్రమమును సంగ్రహముగా పలుకుదు మేని (1) తాను దేవుని ముఖము నుండి పుట్టితినని అం దుచే భూదేవుఁ డనని గర్వించుట (2) మఱియు ఆ వాద ములోనే తన పాదములు కూడ ఈశ్వరుని ముఖము నుం డియే జన్మించె నను వాదము లీనమై యుండుటచే (ఏల అనగా తన పాదములు దేవుని ముఖములో పుట్టలే దన్నచో శూద్రుని ముఖము ఈశ్వర ముఖము నుండి జన్మించె నను వాదము తనంతనే వచ్చును ) ఈశ్వరుని పరాభవించుట (3) తాను దేవునికి కూడ దేవుఁడననుట (బ్రాహ్మణో మమ దేవతా) (4) ఆ బ్రాహ్మణత్వమును భూలోకములోని

ప యితరునికిని లేకుండఁ జేయుట (5) అట్లు శూద్రులను వారిని శాశ్వతముగా తరము తర్వాత తరముగా ఆధ్యాత్మిక హత్య చేయుట (6) తనకు సంతర్పణలకు, సమారాధనలకు వందలు, వేలు ఇచ్చిన ఉపకారులను కృతఘ్నతతో భోజనాదికమందు అంటరాని వారినిగను (7) మఱియు చూడరాని వారినిగను చూచుట (8) యజ్ఞాదికములలో, దేవాలయ స్వయం పూజాదికములలో తన సన్నిధి నుండరాని వారినిగాఁ జేయుట (9) అన్ని ఆర్జనాంగములను వైశ్యుల కిచ్చుట (10) రాజత్వ, యోధత్వ, భటత్వములను, క్షత్రియులకు (11) పంచము లనువారిని వర్ణేతరులనుగా జేసి సర్వ సంస్కారములు నిషేధించి, పశువులనుగా జూచుట (12) మఱియు వారికి రాజకీయ హక్కులు లేకుండఁ జేయుట (13) శూద్రు లనువారిని తన కన్యకలను పెండ్లాడరాని వారని (14) వారి కన్యకలను తాను పెండ్లాడ దగిన వాడనని అవమానించుట (15) మఱియు నీచనామములగు 'శూద్రులు' అను పదమును కొందఱికి (16) 'పంచములు' అను నీచ నామము మఱికొందఱకు ఇచ్చుట (17) వైశ్యులను పేరు కొందఱకు (18) క్షత్రియులను పేరు మఱికొందఱకు ఇచ్చి ప్రజలను చీల్చి ఒకరిని ఎక్కువ వారినిగను మఱియొకరిని తక్కువ వారినిగను జేసి వారి యందరి పైనను తాను ఎక్కి కూర్చుండి అందఱును పరిపాలింప దలంచుట. ఈ

విషయములో సందేహము ఎవరికేని యున్నచో ఈ రాష్ట్రములో బ్రాహ్మణులనుండి ఈ సమస్యల విషయములో పోలు అనగా సమ్మతి తీసికొందు మేని నిజము బయటఁబడును.

(99) మఱి యిట్లు సేయుదు (1) తాను భూములను దున్నజాల నని (2) పశువులను పోషింపఁ జాలనని (3) శాకములను పండ్లను పండింపజాల నని (4) నూతులు, నీటి కుళ్లాయిలు, చెఱువులు నిర్మింపఁజాలనని (5) నివసించుటకు ఇండ్లు నిర్మింపఁజాలనని వాని నన్నిటిని క్షత్రియ, వైశ్య, శూద్రులు తనకు ధర్మముగా ఈయ వలయునని (నిజముగా బ్రాహ్మణేతరులు, నామకరణ, వివాహ మహోత్సవ, గృహప్రవేశాదులలో నోములు మొ॥ వానిలో శ్రాద్ధాదులలో స్వల్ప దక్షిణలు మొదలుకొని గోదాన, భూదాన, గృహదానాదులవఱకు ఇచ్చు ధర్మములు సం॥ము మొత్తమువిూద కోట్ల సంఖ్యలో ఉండును.) కాని బ్రాహ్మణునికి శూద్రులను వారికి, పంచములను వారికి ధర్మము చేయ రాదను నియమము కలదు. (6) దేవాలయము నిర్మించి ఆయనను అర్చకునిగా ఉంచుట (7) సత్రమును గట్టి బ్రాహ్మణులకు భోజనము పెట్టుటకు (సాధారణముగా బ్రాహ్మణేతరులకు భోజనము పెట్టరు.) అన్నదాతనుగా జేయుట (8) ఆ సత్రములలో వారికి ఉత్తమస్థానములనిచ్చి (9) బ్రాహ్మణేతరులు వసారాలలోనో పనికి మాలిన స్థానములలోనో ఉండుట (10) బట్టలుదుకుట

క్షౌరము చేయుట (పరిచర్యాత్మకం కర్మ భగవద్గీత) మొ॥ నీచసేవలు చేయుట (11) వీని కన్నిటికి ఫలితము ఉన్నదో లేనిదో ఋజువు చేయబడని, చేయబడజాలని "ఉత్తర జన్మలో పొందుదువు అను బ్యాంకు చెక్కు" అనదగిన "రాఁబోవు ఉత్తమజన్మ".

(100) ఈ లోపల శూద్రులనువారు రాష్ట్రీయ కోశములకు, కేంద్రప్రభుత్వకోశమునకు అయిదారు వందల కోట్ల రూప్యముల శిస్తులు చెల్లింప వలయును. (2) నూటికి ఐదు ఆరు వందల వంతు వా॥ రాష్ట్రీయ కేంద్ర ప్రభుత్వము లలో మంత్రిత్వములు ఈయవలయును (3) అంతకు తగ్గ కుండ శాసన సభ్యత్వములు, పార్లమెంటరీ సెక్రటరీ షిప్పులు మొ॥ కేంద్ర స్థానిక ప్రభుత్వములలోను (4) హైకోర్టు జడ్జీ పదవులలోను (5) తక్కిన అన్ని ప్రభుత్వ స్థానములలోను ఉన్నతములు (ఐ. సి. యస్. మొ॥) మధ్యమములు (గజెటెడు ఉద్యోగములు) సాధారణములగు గుమస్తా స్థానములలోను ఈయవలయును. (6) అట్లే అంతము లేకుండ హిందూ దేశము లోని ప్రైవేటు సంస్థలలో, కంపెనీలలో, అర్ధప్రభుత్వ శాఖ లగు మ్యునిసిపాలిటీలు జిల్లాబోర్డులు, కో-ఆపరేటివు సంస్థల లోను బ్యాంకులు వగైరాలలోను ఈయవలయును.

101. ఇది యిట్లుండుగాక! బ్రాహ్మణ జాతి నీతితత్వము మాటేమి? (1) బ్రాహ్మణత్వము వ్యక్తి సంపాదించుకొను స్వార్జితము. కాని, జన్మతో

వచ్చి, జన్మాంతము వఱకు ఉండు జన్మ పూర్వలబ్ధ వస్తువు కాదు. ( విన్నపములో 12–14 పుటలు చూ. ) మఱి యది కొన్ని నిత్యానుష్ఠానములు చేసిననే యుండును. (ఇందే 13–14 పుటలు చూ.) సత్యమిది యైనను (i) నేటి బ్రాహ్మణులు షట్కర్మలు చేయ నక్కఱలేదు (ii) ప్రాత స్సంధ్యానుష్ఠానములు చేయ నక్కఱ లేదు. (iii) లోకములోని సర్వ జనులను తనకు ( "అతిథి దేవో భవ" హాగుంస............అతిథిర్దురోణసత్" ఇత్యాది ఈశ్వరవాక్కులు బ్రాహ్మణులను వారినే అతిథులుగా పూజింపవలయునని చెప్పుచున్నను) అతిథులు కారని (తమకు ఉద్యోగములిచ్చి వేతనములిచ్చి తమను పోషించువారి నైనను) ఇండ్లవెలుపల వసారాలలో భోజనములు పెట్టుచు (4) తాను తన కులపు వ్యభిచారిణులతోను, దేశ ద్రోహుల తోను హంతకులతోను (5) మఱియు తాను శూద్రులను వారి కంటె ముందుగా భుజించుచు (6) హోటళ్ల (అన్న విక్రయ స్థానములు అగుటచే బహిష్కార యోగ్యములై నను)లో తన మిత్రులతో సమావేశమై (7) ఒక జందెమును మఱియు (8) వేయి పట్టు పురుగుల చావు ఫలితమగు ఒక పట్టు బట్టను ధరించి (9) మంత్రములను ఉచ్చరించుచునో ఉచ్చరించు చుండకయో (10) ముఖమునంతటిని (కొన్ని సమయములలో సర్వ శరీరమును) కప్పివేయు బొట్లు పెట్టుకొని (11) ఈ భూమిమీదగల సర్వ జనములను తక్కువ వారలనుగను అంటరానివారినిగను చూడరాని

వారలనుగను ఆ అష్టాదశ మహాపాపుల హోటలు పంక్తి భోజనములలో సహపంక్తి భోజనానర్హులనుగను చేయుచు గర్వించి యుండుట. ఇవి నేటికి నిలిచిన బ్రాహ్మణత్వ ధర్మములు !.

(102) కావున, మతమనగా నేమి? అది దైవ విరుద్ధములును, రాక్షసికములు, జాతీయ భావ విరుద్ధములు నగు, దుష్ట కార్యముల నన్నిటిని కప్పిపుచ్చు తెఱ మఱుగా ? "ఇది మత విషయమండి" అన్నంత మాత్రముతో సత్యమును, సాంఘిక నీతిని, అహింసా తత్వమును, ధర్మ పథమును, రాజకీయ హక్కులను, సాంఘిక హక్కులను పాలింపవలసిన బాధ్యత తప్పునా ?

(103) కానిచో, ధర్మరతులగు కోట్ల కొలది పంచము లనబడు ద్రావిడ జనులను దుష్ట పదమగు పంచమ నామముతోను, ఘోరమగు చండాల నామము తోను సంబోధింపనేల ? వారు చేసిన పాపమేమి ? బ్రాహ్మణ కన్యకలకు శూద్ర భర్తల వలన జన్మించుట వారి పాపమా? (2) 20 కోట్ల గౌరవార్హులగు ప్రజలను—బ్రహ్మదేవుని బిడ్డ లగుటచే బ్రాహ్మణులు అయియుండగా—శూద్రులని పిలువ నేల? పాప యోనులని, పరిచర్య (నీచ సేవ) వారి ధర్మమని అగౌరవింపనేల ? (3) బ్రాహ్మణత్వ, క్షత్రియత్వ, వైశ్యత్వ నిషేధములు వ్యక్తి స్వాతంత్ర్యమును జంపునవి, మఱియు అట్లాంటికు ఛార్టరునకు విరుద్ధములు కావా ? (4)

మతము అను పేరుతో రాబోవు ఫెడరేషను హోటళ్లలో పంచములనువారు అంటరానివారుగను, చూడరానివారుగను ఉండవలయునా? (5) అర్చకత్వ నిషేధము అట్లాంటికు ఛార్టరులోని "ప్రార్థన స్వాతంత్ర్య" సూత్రమునకు విరుద్ధము కాదా? (6) భగవద్గీతకు వేదాదులకు ధర్మానుగుణముగా సత్య వ్యాఖ్యలు వ్రాసికొని తమ మతమును నిర్ణయించుకొనరాదా? (7) మహాత్ముడైనను "పంచములనువారి, శూద్రులనువారి వర్ణవృత్తులనునవి జన్మ పూర్వకర్మ నిర్ధారితములు" అని ధర్మ వ్యతిరేకముగా, ఆత్మ స్వాతంత్ర్య వ్యతిరేకముగా, అట్లాంటికు ఛార్టరుకు విరుద్ధముగా నిరంకుశ నిర్ణయము చేయవచ్చునా?

(104) బ్రాహ్మణుడు రాజకీయ సన్యాసము చేయుటకు అంగీకరింపడేని —అతని దుష్టనీతి బారినుండి తప్పించుకొని అతని 18 నిషేధములను తొలగించుకొని, రాజకీయ, మతవిషయిక సర్వ స్వాతంత్ర్యమును పొంది, యితర రాజకీయ పక్షములతో కూడి, రాజ్యాంగ నిర్మాణదక్షతను నేర్చుకొని, అతనితో సమాన స్థితికి వచ్చుటకు, అతని మోసపు ఉరిత్రాళ్ళనుండి తప్పించుకొనుటకు—ప్రత్యేక నియోజక వర్గముల కంటె వేఱుగు దారి ఏమి కలదు?

(105) మఱియు శూద్రుల మనబడు మాకు వాక్ స్వాతంత్ర్య మనునది కలదా? ద్విజుల "జాతీయత లేని

జాతీయవాదము " నేడు సర్వ భారతమును ఆక్రమించినది. అష్టాదశ మహాపాపుల బాఱినుండి తప్పించు ఈ లోకోత్తర పవిత్ర సిద్ధాంతమును వ్యాపింప జేయుటకు మాకు సభా వేదిక గాని, మంచి వ్యాప్తిగల పత్రికలుగాని లేవు.

(106) ఉదాహరణము కొఱకు దిగంత కీర్తి వహించిన బ్రాహ్మణ పత్రిక " హిందూ " (మద్రాసులోని ఆంగ్ల దినపత్రిక) విషయము చూడుడు. అది మన స్తత్వ ములో సనాతన పత్రిక. కాని, బ్రాహ్మణేతరుల ప్రయోజ నములకు వ్యతిరేకములగు సర్వ విషయములను ప్రక టించును. మఱి చిత్రమేమనగా ఆహ్లాదకరములైనచో (i) వ్యభిచారపు రిపోర్టులు (ii) విద్యార్జన చేయు సహోధ్యాయినుల విచిత్రములు (iii) వివాహ బంధము లేని వివాహములు (iv) బాలికల పెండ్లిండ్లను గుఱించిన ప్రకటనలు (v) అసభ్యములగు మందుల ప్రకటనలు (vi) ఇంచుమించుగా అవస్త్రులగు స్త్రీ పురుషుల చిత్రములు (vii) వీని నన్నిటిని అతిక్రమించిన నిన్న మొన్నటి చిత్రము " పెండ్లి చేసికొన్నను ఆనందముగా ఉండుటెట్లు ? (హిందూ 9-9-45 చూ.) ప్రకటించుటలో ఏ సందేహమును లేదు. అట్లే సనాతనుల (i) ' శూద్ర ' సిద్ధాంతము (ii) 'చండాల' నామము (iii) ' అంత్యాః పాపిష్ఠః ' అను చండాల వాదము (iv) స్త్రియో వైశ్యాస్తథా శూద్రాః యేపిస్యుః పాప యోనయః ; అనగా " శూద్రులు, స్త్రీ లు, వైశ్యులు పాపాత్ములు" అను గీతలోనిదనబడు వాదము (ముఖ్యముగా

ఈ తుది నాల్గు సిద్ధాంతములు కోట్లకొలంది జనులను జన్మ జన్మలకును తీరని పాపులనుగా (జేసి తరముతర్వాత తరముగా వారి జన్మలనే నాశము చేయుచున్నను) ప్రకటించుటకేయభ్యంతరమును లేదు. కాని, అష్టాదశ మహాపాపియగు బ్రాహ్మణుని మతములోని సర్వ పాపములను దొలగించు నట్టి, ప్రపంచములో నెల్ల పవిత్రమగు, సద్బ్రాహ్మణ మతమును గుఱించిన ప్రకటనను — ద్రవ్యమును ముందుగనే చెల్లించినను — వ్రాతపూర్వకముగా ప్రకటింతుమని వాగ్దానము చేసియు (1934) నాల్గు ఖండములలో ఆ పత్రికకు గల మహోన్నత స్థానమునకు మేము సంతోషించు వారమైనను ప్రకటించదాయెను.

(107) ఇవి చాల ఆందోళనకరములగు రోజులు. ముస్లిముల హక్కులకై జిన్నాగారు చాల పోరాటము చేయుచున్నారు. వానిని బహుశః ఇచ్చుచున్నారు. లేదా అధికముగా ఇచ్చుచున్నారు. కాని, "హైందవ భారతము"లో ద్విజులు దివ్య తేజస్సుతో కనులు మిరు మిట్లు గొలువు మహోన్నత ప్రభుత్వ స్థానమునకు వచ్చిరి. మఱి బ్రాహ్మణ రాజ్యమో 5000 వత్సరములనుండియు శూద్రులనువారికి పంచములనువారికి ఎన్నడు కసి విని యెఱుగని — ఘోర నరకము.

(108) సెంట్రలు అసెంబ్లీ ఎన్నికలు సమీపించినవి. రాష్ట్రముల ఎన్నికలు వేగముతో సమీపించుచున్నవి.

రెండు మూడు మాసములలో "కాన్‌స్టిట్యుయంటు అసెంబ్లీ" ఏర్పడనున్నది. తగిన రక్షణములను ఏర్పాటు చేసికొననిచో అది పంచములనువారియు, శూద్రులనువారియు ప్రయోజనములను సర్వ నాశము చేయుననుట నిర్వివాదాంశము. హిందూ సంఘములోని (i) ద్విజులకు (ii) శూద్రులనువారికి (iii) పంచములనువారికి వారివారి జన సంఖ్యలనుబట్టి ఎవరికిని "అధిక ప్రదానము" లేకుండ వంతులవారిగా వచ్చు స్థానములను మాత్రము కాన్‌స్టిట్యు అసెంబ్లీతోగూడ సర్వ హిందూదేశములోని కేంద్ర, రాష్ట్రీయ శాసన సభలన్నిటి లోను మంత్రివర్గములోను ఒసంగుదురని కోరుచున్నాము. మఱియు ఈ విషయమును ఈ 1945–వ సం॥ము దీపావళిలోగానే పరిష్కరింతురనియు భావించుచున్నాము.

(109) కాని, బ్రాహ్మణత్వము క్షత్రియులనువారిని "రాజా సర్వస్యేష్టే బ్రాహ్మణ వర్జం; అనగా తక్కిన వారికి తప్ప బ్రాహ్మణులకు రాజు లేడు" అను సూత్రము ప్రకారము చాల ఘోరమగు దుష్ట వస్తువు. క్షత్రియులను మాటుపెట్టుకొని భారత భూమిని నాశము చేయుచున్న కోటి ముఖముల ఘోర సర్పము. అర్చకులుగా, పురోహితులుగా, శ్రోత్రియులు మొ॥ పెక్కు పేర్లతో పదులక్షల గ్రామములలోను దాని ముఖము వ్యాపించి; వార, దిన పత్రికలు సర్వ రాజకీయ సంస్థలు తన యధీనములో

నుంచుకొని హిందూదేశ రాజకీయ జీవనమును మఱియు (21–వ రోజులో నామకరణము 8–వ నెలలో అన్న ప్రాశనము తర్వాత పెక్కు అంతరములలో అక్షరాభ్యాస, వివాహ, గృహప్రవేశాదికములగు లెక్కలేని శుభకార్యములు, మఱి మరణకాలములో శ్రాద్ధము ఈ మొదలగు అనంత కర్మలతో) ముప్పది కోట్ల హిందువుల వ్యక్తి జీవితములను బంధించివైచిన కాలకూట విష సర్పము. బుద్ధదేవుడు దానితో పోరాడలేక పోయెను. రామానుజుడోడెను. ఆర్య సమాజ బ్రహ్మ సమాజములు జయమొందలేదు. ఆ విష సర్ప బలమును మేము స్వల్పముగా చూచుటలేదు. రాజాజీలు, పట్టాభిజీలు, శాస్త్రియారులు, పంతుల్లు, అయ్యంగార్లు, చటర్జీలు, బెనర్జీలు, పంటులు, పండితులు మొదలగు వారు ఆ సేతు హిమాచలపర్యంతము పెట్టని కోటలై దానిని కాపాడుచున్నారు. కాని, తరము తర్వాత తరముగా కోట్ల కొలది బ్రాహ్మణేతరులను బ్రాహ్మణత్వము పొందకుండ నిషేధించినట్టి ఆ ఘోర సర్పముయొక్క అంగ నిర్మాణములోని ఘోర విషమగు అవినీతి తుదకు దానినే నాశముచేసి తీరును.

(110) మఱియు మన మధ్య మహాత్మాజీ కలడు. ఆయన సత్యము, అహింస, నీతులను నిలువబెట్టువాడు. కాని, ఆయన నేటి మత భావములు విషాద కరములు

అయినను, త్వరలో సద్బ్రాహ్మణుఁడు కాక తప్పదు. మఱియు ధర్మ సంస్థాపన చేయక తప్పదు. ఏల అనగా "నత్వహం కామయే రాజ్యం, నస్వర్గం నాపునర్భవం। కామయే దుఃఖతప్తానాం ప్రాణినాం ఆర్తి నాశనం; అనగా రాజ్య మక్కఱ లేదు. స్వర్గమును, మోక్షమును అక్కఱలేదు. దుఃఖముచే నాశమగుచున్న ఆర్తుల బాధను తొలగించుటే నాకు కావలసినది". అనుట ఆయన జీవితలక్ష్యము. అందుచే ఆయన ఈ కాలకూట విష సర్పముతో పోరి తీరును.

ఇట్లు
తమ అత్యంత విశ్వసనీయులు
డి. రాఘవచంద్రయ్య సచ్ఛాస్త్రి
కార్యదర్శి

ది రియల్ ఇండియన్ నేషనల్
కాంగ్రెసు పక్షము
బెజవాడ - 6-7-1945



# ది రియల్ ఇండియన్ నేషనల్ కాంగ్రెసు పార్టీ

(1931-లో స్థాపితము.)

# విన్నపము.

ప్రియమైన మహాత్మాజీకి, ఇండియన్ నేషనల్ కాంగ్రెసు అధ్యక్షునకు, కాంగ్రెసు వర్కింగు కమిటీ వారికి.

•••••○•••••

ఆర్యులారా !

1. హిందూ దేశమునందు అత్యున్నత రాజకీయ సంస్థయగు తమ సమక్షమునందు ఈ విషయములను—చాల సంకోచముతో ఉంచుచున్నాము. అది ఈ చెప్పఁబోవు అంశముల సమగ్రసత్యస్థితిని గుఱించిన సందేహముచే కాదు—మఱి ఏల అనగా ఈ పవిత్ర సంస్థలో సభ్యులగు ఉత్తమ పురుషులలోఁ గొందఱకు ఈ భావ పరంపరలు దేశములో రూఢములైన సాంఘిక, మత విశ్వాసములకు భిన్నములుగా నుండుటం జేసి రుచింపవనియే. అయినను మా యీ విన్నపములు సత్యములని విన్నవించుకొనుచున్నాము.

2. మఱియు, ఈ విన్నపములు మాకు ప్రాణావసరములై—చావు బ్రతుకులకు సంబంధించిన గాఢసమస్యలు. వానిని స్వల్ప సమస్యలుగా పరిగణింప వీలు లేదు—ఏల అనగా అవి క్రమాంతరముల ద్వారా బ్రాహ్మణేతర సంఘ

మును నశింపఁ జేయుటయే గాక తుదియంతరములో భరత మాత యవయవద్వయ మనఁదగిన హరిజను లనబడు వారి తోను, బ్రాహ్మణులతోను నిండిన సర్వ హిందూమూర్తిని నాశము చేయును.

3. హిందూ సంఘములో నుండి దానిని నశింప జేయునది యయ్యు పవిత్రముగా గణింపఁబడు సంఘమేది ? ఎట్లు అట్టి గొప్ప మోసమును చేయుట ఆ సంఘమునకు వీలగుచున్నది ? ఈ సందర్భములో ఈ ప్రశ్నలు కలుగుట సహజము. అది బ్రాహ్మణత్వము. అది ఘోర హింసాకరమును, మఱియు అవి నీతికర శక్తియు. గతమునం దొకసారి అది మన స్వరాజ్యమును నాశము చేసినది. మఱి యా రాక్షసత్వము నుండి తప్పించుకొనుటకు తగిన రక్షణలు చేసికొనమేని రాఁబోవు స్వరాజ్యమును నాశము చేసితీరును ; —ఏలయనగా అది ప్రత్యక్ష రాక్షసత్వమయ్యు దురదృష్ట వశాత్తు కోట్లకొలఁది జనులచే ప్రపంచములో నెల్ల పవిత్ర మతముగా ఈ దురదృష్ట భారత భూమిలో నేటి వఱకును భావింపఁ బడుచున్నది.

4. అది యెట్లు సంభవమైనది ? నేటి బ్రాహ్మణులిచే పుణ్యములుగా స్వీకరింప బడిన 18 మహా పాపములచే అపవిత్రము కాని, వేదములయు, ఉపనిషత్తులయు, గీత యొక్కయు సద్బ్రాహ్మణ మతము నిజముగా మనుజుని సర్వోన్నతియు మఱి పవిత్ర సిద్ధియు. అది

ఈ భూగోళములోని అయిదారు ఖండములలో వసించు చున్న సర్వ మానవులయొక్క సమిష్టి ధనమును.

౫. కాని, ఆ సద్బ్రాహ్మణ మతము నేటి అష్టాదశ మహాపాపులగు బ్రాహ్మణుల యొక్క "నేను శూద్రుడనై జనియించియు ఉపనయనముచే బ్రాహ్మణత్వమును పొందెదను, కాని. నీవు అట్లు బ్రాహ్మణత్వము పొందరాదు" ఈ మొదలగు 18 మహా పాపములచే లీనమై, విషముతో గూడిన పాలవలె సర్వమును విషమై హిందూ సంఘము యొక్క అంతర్నిర్మాణమును నాశము చేసి మన స్వరాజ్యమును నేలపాలు చేసినది. ఎట్లనగా మనుష్య జీవితము నందే గాక సర్వ జంతు కోటియందును అవినాభావ సంబంధముతో ఉండు క్షత్రియత్వమును (ఆత్మరక్షణకు సాధువులగు వృషభములు పులిని కొమ్ములతో ప్రతిఘటించి పోరి గెల్చును) మనుజుల నుండి చీల్చి కొందఱను క్షత్రియేతరులనుగా చలిపి; క్షత్రియు లనువారిని ఉత్తములుగాను శూద్రులనబడు వారి లోని భూపాలకులను తక్కువవారిని గను జేసి; ఉభయులను ఎవరు హెచ్చు ఎవరుతక్కువ అను చిన్న సమస్యమీద ఒకరితో ఒకరు పోరాడువారి నొనర్చి "తమలో తాము పోరు ఇల్లు నశించును" అను యేసుక్రీస్తు పవిత్ర వాక్యము నకుపాల్పడు నట్లు హైందవ జాతిని పరస్పరము పోరాడు వేలకొలఁది కులములుగాఁ జీల్చి నాశము చేసినది.

6. బ్రాహ్మణత్వము ప్రపంచములోని అన్ని ఖండ ములోని అందఱి సొత్తు అనుట యెట్లు ? " తత్ త్వమసి " అనగా " ఓ మనుజుఁడా నీవు ఆ పరబ్రహ్మ స్వరూపమవు " అని యుపనిషత్తులు ఘోషించుచున్నవి. అనగా మనుజుఁడు జాతి మతకుల విచక్షణ లేక యీశ్వరుని యవతార మని యర్థము. మఱియు బ్రాహ్మణత్వము నందుటకు అర్హుడును. ఏల అనగా " i తస్య యజురేవశిరః ii ఋగ్ దక్షిణః పక్షః iii సామోత్తరః పక్షః iv అధర్వాంగిరసః పుచ్ఛం ప్రతిష్ఠ. అనగా i ఆ మనుష్యునికి శిరస్సు యజుర్వేదమే ii ఋగ్వేదమే కుడి చేయి iii సామవేదమే ఎడమ చేయి iv అధర్వ వేదమే నాభికి దిగువ భాగము " అని తైత్తిరీయోపనిషత్తు ఘోషించుచున్నది.

7. ఇట్లు మానవుఁడు చతుర్వేద స్వరూపి. అనగా ఆ వేదముల తోడనే మనుష్యుని శరీరము నిర్మింపబడినదని భావము. అట్లు వేదము ఘోషించు చుండగా ఏ మనుష్యునకుగాని వేదపఠనమును నిషేధింపఁ దగునా ? అట్లే వేదముమీాద ఆధారపడిన i యజన (యజ్ఞములు చేయుట) ii యాజన (యజ్ఞములు చేయించుట) iii దాన (ఇతరులకు ధర్మము చేయుట) iv ప్రతిగ్రహణ (ఇతరులిచ్చిన ధర్మమును స్వీకరించుట) v స్వాధ్యాయ (వేదము చదువుట vi ప్రవచన (వేదమును ఇతరులకు నేర్పుట) అను షట్కర్మలను, వేద స్వరూపియై వానితో సమానముగా పవిత్రు డగుటచే

ఏ మనుజుని విషయములోను నిషేధింపఁ జాలము. అనఁగా ప్రతి మనుజుడును అవ్యక్త దశలో ఉన్న బ్రాహ్మణుఁడే.

8. హిందూ మతముయొక్క ఈ ప్రాథమిక సూత్రమును అనగా ప్రతి మనుష్యుడును "అవ్యక్త బ్రాహ్మణుడే" అను ధర్మమును తొలుతటి "సద్బ్రాహ్మణ మతము" నుండి అష్టాదశ మహా పాపములతో (అనుబంధము viii చూడు) నిండిన నేటి యీ బ్రాహ్మణ మతమును ఆచరణలోనికి తెచ్చిన పిదప శూద్రులనుబడు వారు, పంచము లనబడువారు తమ 18 జన్మ హక్కులను (చూ॥ అనుబంధము ix) గోలుపోయిరి. కాని, దురదృష్ట వశాత్తు వేదములు, ఉపనిషత్తులు, గీత, మఱి భాష్యములని చెప్పబడు దుర్భాష్యములు అనగా (దుష్టములగు అర్థములు) స్మృతులనబడు దుష్టస్మృతులు (దుష్టములగు ధర్మశాస్త్రములు) అన్నియు జన సామాన్యమునకు తెలియని సంస్కృత భాషలో వ్రాయఁబడుటచే శూద్రు లనువారు, పంచములనువారు వానిని తెలిసికొని ప్రతిఘటించి పోరాడఁ జాలరైరి.

9. ఆ రోజులలో "శూద్ర మక్షర సంయుక్తం దూరతః పరి వర్జ యేత్, అనగా అక్షరములు వ్రాయ నెఱిగిన శూద్రుని దూర మందే విసర్జింప వలయును" అను సూత్రము ద్విజులలో సర్వాంగీకృతి నందిన సిద్ధాంతమై

నది. శూద్రులకు గురువులు ద్విజులే కదా? అందుచే శూద్రులనబడు వారిలో స్వభాషలో అక్షర పరిచయమే గగన కుసుమమైనది.

10. కొలఁదిగా ఎట్లో స్వభాషలో అక్షర పరిచయము కల యదృష్టవంతులగు శూద్రు లనఁబడువారు భారతము, పురాణములు చదువ వలసినవారైరి. ఈ గ్రంథములలో ప్రతి రెండవ పుటలోను "బ్రాహ్మణుడు భూదేవుఁడు ఆయనకు బట్ట లుదుకుట మొదలగు పరిచర్యలు చేసి పూజించుటయే శూద్రు లనబడు వారికి మోక్ష హేతువు" అనియు "అట్లు సేవచేయమి నరక హేతువు" అనియు నిరంతర బోధనము ప్రత్యక్షమై వారిలో "ద్విజదాసత్వము ధర్మము" అను భావమును గట్టిగాఁ బురికొల్పి వారికి జన్మ వ్రతము కాపించినది.

11. ఈ దుష్ట పురాణ, దుష్టభారతములను పంచములనబడువారు శూద్రు లనబడువారును నమ్మిరి. ఏల అనగా: అవి వేదములు, ఉపనిషత్తులు, గీతలలోని యీశ్వర వాక్యముల సారములని నమ్మించుటం జేసియే. మఱియు నిరంతరము తమకు గురువులు, పురోహితులు, అర్చకులునై బోధించు బ్రాహ్మణుల దుర్బోధలు కూడ ఆ బోధలను బలపరచుచుండ గత్యంతరము లేక అంగీకరింపవలసినవారైరి. మఱియు ఆ రోజులలో మూఢ విశ్వాసము తప్ప స్వతంత్రాలోచనకు తావు లేదు. మఱి యిట్లు వారు

విశ్వసించుటలో విచిత్రమును లేదు. ఏల అనగా పరస్పర విరుద్ధము లగు సర్వ సిద్ధాంతములను చర్చించి "హేతు వాదము" సత్య నిర్ధారణము చేయుచున్న యీ రోజులలో మహా పవిత్రుడును, సత్య, అహింసా సిద్ధాంతముల ప్రథమా మాచార్యుడును అగు గాంధి మహాత్ముడు మహా ఘోరరాక్షస సిద్ధాంతమగు "వర్ణ సిద్ధాంతము" ను పునర్నిర్మాణము చేయుటలో నవ్యకాలమునకు అనుగుణముగాఁ గొంత మార్చియు అందలి i అంతరాత్మ కనుగుణముగా ధర్మ రక్షణ కొఱకేని వర్ణ వృత్తిని మార్చుకొన రాదనియు ii మఱియు స్వవర్ణ వృత్తి యనబడునది అవినీతికరమయినను ఉల్లంఘింప రాదనియు చెప్పు అష్టాదశ మహా పాపుల యధర్మ వర్ణ సిద్ధాంతములో అంతరాత్మ స్వాతంత్ర్యమును జంపు రాక్షసత్వమును ఉంచి అవినీతి, అంతరాత్మల కారణములచే నేని వర్ణ ధర్మముల నుల్లంఘింప రాదని శాసించె నన్నచో కేవల మూఢ విశ్వాసము రాజ్యము చేయుచున్న ఆ రోజులలో శూద్రు లనఁబడు వారు, పంచము లనబడు వారు ఆ అష్టాదశ మహా పాపుల సిద్ధాంతములను నమ్ముటలో ఆశ్చర్యము లేదు కదా ?.

12. ఆ యష్టాదశ మహాపాపుల దుష్ట సిద్ధాంతములను, దుర్వ్యాఖ్యలను దుర్భాష్యములను, బహుశః ప్రక్షిప్తములను మహాత్ముడు విశ్వసించె ననుటకంటె మహాత్మునిమీద ఏమి నేరమును ఆరోపింపఁగలము ? కాని యాతడు తన "గాంధివర్ణ" సిద్ధాంతములో "వర్ణ" మనగా "జన్మపూర్వ

నిర్ధారితమైన వృత్తిని జీవనోపాధి కొఱకు మనుజుఁడు స్వీకరించుట" అని నిర్వచించి యీ రాక్షస ధర్మమునకు దాసుడాయెను. (24-11-1927 వ తేదీ గల ఎంగు ఇండియా పత్రికలో మహాదేవ దేశాయిజీ ప్రశ్నోత్తర మాలిక చూ.).

13. ఆయన తననవ్య "గాంధి వర్ణ"సిద్ధాంతములో i ఒకరు హెచ్చు, ఒకరు తక్కువ అను భావమును తొలగించెను ii అస్పృశ్యతను iii దృష్టిదోషమును iv అంతర్వర్ణ వివాహ నిషేధములను v అంతర్వర్ణ భోజన నిషేధములను (విధిగా అంతెర్వర్ణ భోజనములు జరిగి తీరవలయు నని చెప్పకున్నను కులభేద దృష్టితో సహపంక్తికి అంగీకరింపని వారి విందులను బహిష్కరించుటకు అంగీకరించెను) తొలగించెను. vi తండ్రిలేక వర్ణ వృత్తి జీవనోపాధ కొఱకు చేయు పద్ధతి మీఁద vii సేవా ధర్మము కొఱకు అన్యవర్ణ వృత్తిని లేదా వృత్తులను స్వీకరించుటను అంగీకరించెను viii మఱియు తన "గాంధి వర్ణ" ము "సంతోష సౌభాగ్య హేతు"వనియు "నిజమగు జన్మ సిద్ధికి దారి" యనియు చెప్పెను. ix మఱి యిది పోటీ లేకుండఁజేయునది యనఁగా ఒక లాయరు కేసులో 15 వేలు చార్జి చేయువలయునని తలంచుట లోను * హకీము సాహెబు దినమునకు వైద్య వృత్తికి వేయి రూపాయలు ఛార్జి చేయుటలోనువలె ఇతరుల ధనమును అపహరించుటకు ప్రోత్సహించు పోటీని తొలగించు

* హకీము అజ్మల్ ఖాను పూర్వము ఢిల్లీలో ప్రాక్టీసు చేయు చుండిన గొప్ప డాక్టరు, మహాత్మునికి మిత్రుఁడు.

టచే పవిత్ర మైనదనియు x బ్రాహ్మణత్వ, క్షత్రియత్వ, వైశ్యత్వములు శూద్రులను వారికి రాబోవు జన్మలో పొందఁదగిన వస్తువు లనియు xi ఈ జన్మలో బ్రాహ్మణత్వమును లేదా క్షత్రియత్వమును పొందఁ గోరు శూద్రుఁ డను వాఁడు తనకు దైవ మీయని వర్ణమును స్వీకరించు గర్వి యనియు xii అట్లు బలాత్కారముగా అన్యవర్ణము నభిలషింపమి "విధేయత" యనియు xiii వర్ణ మనగా గాంధిజీకి ప్రేమ పాత్రమగు మొదటి అర్థము ప్రకారము "జన్మకు పూర్వమే నిర్ధారిత మగు మనుజుని జీవన వృత్తి" అనియు xiv రెండవ యర్థము ప్రకారము "కులము" అనియు నిర్ధారణ చేసి మొదటిది అనగా "జన్మ పూర్వ నిర్ధారిత వృత్తి" యను నర్థములో నది శాశ్వతముగా ఉండఁదగినదనియు "కులము" అను అర్థములో నది జీవచ్ఛవమనియు భారత దేశము జీవించి వృద్ధి పొంద వలయు నన్నచో కులము నశింప వలయుననియు (కుల తత్వము జీవచ్ఛవము అను గాంధిజీ వార్త హిందూ 18-వ ఏప్రిలు చూ.) xv "వర్ణము" జన్మతో వచ్చి మరణముతో అంత మగు అవినాభావ సంబంధ వస్తు వనియు xvi అది ప్రపంచములో సర్వత్ర కల పకృతి ధర్మ మనియు xvii న్యూటను "గురుత్వాకర్షణ" సూత్రమును గ్రహించి నట్లు మన ప్రాచీన ఋషులు కనిపెట్టిన సృష్టిసూత్ర మనియు xviii మనుజుల వృత్తులు (1) బోధనము (2) రక్షణము (3) అర్థసృష్టి (4) కాయకష్ట జీవనము అను కఠిన విభాగములు

లేని చాల వైరళ్యము కల నాల్గు ప్రధాన విభాగములు కల వనియు xix ఈ వర్ణ విభాగము చిరకాల పరిశోధనలతోను తపస్సు చేతను మహర్షులు కనుగొన్న పవిత్రమగు చతుర్విధ జీవన మార్గ మనియు xx మనుజుడు తన కేర్పరుపం బడిన ప్రత్యేక వర్ణ వృత్తిని స్వీకరింపమి పతితత్వ మనియు గాంధిజీ తన " గాంధి వర్ణ సిద్ధాంతములో " బోధించెను.

14. మహాత్ముని ఈ చాల సున్నితముగా నిర్మింపం బడిన వర్ణ సిద్ధాంతములోని అన్ని యంశములను గుఱించి విమర్శించుట యిక్కడ సాధ్య పడని విషయము. మఱి యది యిచ్చట తలపెట్టిన విషయమునుకాదు. ఆ విషయమై మహాత్మునకు వేఱొక సమగ్రమగు విన్నపము కావింపం బడును. నిజమునకు మేము కొన్ని ప్రశ్నలను మహాత్మునికి పంపి దానిని సప్రూకమిటీకి మేము సమర్పించిన నివేదికకు అనుబంధముగాం జేర్చితిమి. ఆనాటికి మహాత్ముండు " వర్ణము " అను పదమునకు (1) కులము అనియు (2) " మనుజుని జనన పూర్వ నిర్ణీత జీవన వృత్తి " యనియు రెండు నిర్వచనములు చేయుటను గూడ గుర్తింప లేదు. ఈ విషయమును " కుల సిద్ధాంతము జీవచ్ఛవము " అను 18-వ ఏప్రిలు 1945-వ తేదీ గల మహాత్ముని అసోసియేటెడ్ ప్రెస్ వార్తను చదివిన పిమ్మటనే గుర్తించితిని. దానిని చూచుట ఫలిత ముగా మహాత్ముని పూర్వపు వ్రాతలు చూచితిని. అందు మహాత్ముని " వర్ణ " సిద్ధాంతమునకు గల ద్విముఖమును

గుర్తించితిని. (24–11–1927 వ తేదీ గల యెంగు ఇండియాలో మహాదేవ దేశాయి గారి ప్రశ్నోత్తర మాలిక చూ).

15. అందు దక్షిణహిందూదేశ బ్రాహ్మణేతర మిత్రుల కిచ్చిన సమాధానముంబట్టి కులము అను భావములో వర్ణము నశింప వలయును గాని " జనన పూర్వ నిర్ధారితమగు నరుని జీవనవృత్తి " అను రెండవ అర్థములో (1) సనాతనులు అనువారు లేదా పక్షపాతము గల యితరులు అపార్థము చేయుదురుగాక (2) నేడు వర్ణ సిద్ధాంతము భ్రష్ట స్థితిలో నుండునుగాక (3) నిజముగా కుళ్ళి కంపు కొట్టుచున్న ఘట్టము లుండునుగాక నేడు మనము చూచుచున్న రీతిగా భారతభూమిలో బ్రాహ్మణ మతమును లేదా హిందూమతమును నిల్పిన వర్ణ సిద్ధాంతములో చాల గొప్ప యుత్తమ గుణము కలదనియు అందుచే అది యుండదగిన దనియు మహాత్ముని సిద్ధాంతము.

16. కావున "కులము జీవచ్ఛవము అది నశించి తీరవలయును" అను మహాత్ముని సిద్ధాంతముతో ఏకీభవించుచు "మనుజుని జన్మ పూర్వ నిర్ధారిత జీవనవృత్తి" అను నర్థము గల "గాంధి వర్ణ" సిద్ధాంతమును మన కత్యంత సన్నిహిత సంబంధముకల రెండు మూడు దృక్పథముల నుండి విమర్శింతము.

17. శాస్త్రములని చెప్పబడిన సనాతను లనబడు వారి దుష్ట శాస్త్రములం బట్టి చూచినను " జన్మ పూర్వ

నిర్ధారిత. మగు మానవుని జీవన వృత్తి" అను "గాంధి వర్ణ సిద్ధాంతము" తప్పు సిద్ధాంత మనియు అవి నాల్గు వర్ణములు "మనుజుని నాల్గు భిన్న జన్మ గుణములు" అను తప్పు సూత్రముపైని ఆధారపడి యున్నవనియు మహాత్మునకు అత్యంత విధేయతతో విన్నవించుకొను చున్నాము.

18. "వర్ణము జన్మతో వచ్చును" అని మహాత్ముఁడు చెప్పుచున్నాడు. అది తప్పు. బ్రాహ్మణత్వముకాని, క్షత్రియత్వముకాని, వైశ్యత్వముకాని జన్మతో రావు. ఈ మూడును ద్విజత్వములు. ద్విజుఁ డనగా రెండుసారులు జనించినవాడు అని అర్థము. ప్రతి ద్విజునికి మొదటి జన్మ శూద్రత్వము. శూద్రత్వము ఏక జన్మ మాత్రము కలది. "శూద్రః చతుర్థో వర్ణః ఏక జాతిః'' అనఁగా శూద్రుడు నాల్గవ వర్ణమువాడు. మఱియు ఒకటే జన్మకలవాడు" గౌతమ ధర్మ సూత్రములు 2–వ ప్రశ్న 1–వ అధ్యా. 5–వ సూ.) ఏక జన్మ కల మఱి యొక వర్ణము లేదు. రెండు జన్మలు కలది ద్విజత్వము "అవర్ణత్వము" అనగా పంచమత్వము లేక చండాలత్వము తప్ప శూద్రత్వము కంటె వేఱగు ద్విజత్వ పూర్వవర్ణము లేదు. అవర్ణత్వము అనగా చండాలత్వము ద్విజుల ప్రథమ జన్మ యనుట ఘోరము.

19. "తత్ ద్వితీయం జన్మ" అది అనగా ఉపనయనసంస్కారము రెండవజన్మ. అనగా బ్రాహ్మణత్వ, క్షత్రి

యత్వ, వైశ్యత్వములను ఇచ్చు ఉపనయన సంస్కారము ద్విజుని రెండవ జన్మము. సావిత్రీదేవి అనగా యజ్ఞోపవీత దేవత తల్లి. ఆ సంస్కారమిచ్చు గురువు తండ్రి. ఆ ఉప నయన సంస్కారమునకు పూర్వమే ఆ సంస్కారమందు బ్రాహ్మణ బాలుడు లేదా క్షత్రియబాలుడు లేదా వైశ్య బాలుడు బ్రాహ్మణుడో, క్షత్రియుడో, వైశ్యుడో అయి ఉండినచో ఉపనయన సంస్కారముచే మఱియొక జన్మ వచ్చి త్రిజుడు అగును. బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు త్రిజులు అన్నచో చాల గొప్ప తప్పు ; మఱి ప్రస్తుత ద్విజ లోకమును అవమానించుటయును.

20. కావున బ్రాహ్మణుల దుష్ట ధర్మ శాస్త్రముల ప్రకారమే "బ్రాహ్మణత్వము జన్మతో వచ్చి జన్మతో పోవు మనుజుని యవయవయములం బోలె అవినాభావ సంబంధము కల సంఘ ద్రవ్యముకాని, పితృ ద్రవ్యముకాని కాదు!." మఱి అవి ఉపనయనము పొందు ఆ బాలుని స్వార్జితము (ii) ఉపనయనముచే కొన్ని షరతులకు లోబడి అనగా పదునాఱవ యేడు దాటిన తర్వాత బ్రాహ్మణ బాలుడు ఉపనయనము చేసికొనరాదు. "ఆషోడశాద్ బ్రాహ్మణస్య అపతితా గాయత్రీ" అనగా పదునాఱవ సంవత్సరాంతము వఱకే బ్రాహ్మణ బాలునకు బ్రాహ్మ ణత్వము పొందు అధికారము కలదు.' అనగా 17-వ సం॥ము ఆరంభములో అతనికి బ్రాహ్మణత్వము పొందు అధికారము

లేదు. అనగా శూద్రుడుగనే యుండును. (చూ. గౌతమ ధర్మ సూత్రములు 1–1–3).

21. మఱి పదునాఱవ సంవత్సరాంతము లోనే బ్రాహ్మణ బాలుఁడు ఉపనయన సంస్కారము నంది బ్రాహ్మణత్వము పొందినను రెండు పూటలు సంధ్యానుష్ఠానము చేయఁడేని అది పోవును. "ఏకాహామపి సంధ్యాం అనుపాస్య చేత్ పతితో భవతి" ఒక్క రోజు బ్రాహ్మణుఁడు సంధ్యార్చన చేయ డేని బ్రాహ్మణత్వము పోవును. (గౌతమ ధర్మ సూత్రములు, పరిశిష్టము, క్రియా కాండము.)

22. మన దురదృష్ట వశమున ఇట్లు మహాత్ముడు సనాతను లనబడు వారి దుష్ట ధర్మ శాస్త్రములే బ్రాహ్మణత్వము ఒక దీక్ష అనగా "కొన్ని పవిత్ర కర్మలు చేయుచు కావించుకొను ఆత్మ పవిత్రీకరణ కర్మ" అను చుండగా వారి సిద్ధాంతములను కూడ అతిక్రమించి జన్మచే తనంత దాను వచ్చి మరణముచే పోవు అవినాభావసంబంధ వస్తువునుగా ఆ "గాంధి వర్ణ" సిద్ధాంతములో చెప్పుటలో గొప్ప తప్పును మహాత్ముఁడు కావించెను.

23. వాద సౌకర్యము కొఱకు "వర్ణ" మనగా జన్మ సంభవ వస్తువనియు, ఆచరింప వలసిన నిత్య నైమిత్తిక కర్మలతో సంబంధము లేని జన్మచే వచ్చి మృత్యువుతో పోవు కను బొమ్మలమీాది వెంట్రుకలం బోలిన

అవినాభావసంబంధ వస్తువు అనియు, యంగీకరింతము అయిననూ అట్టి "గాంధి వర్ణ" సిద్ధాంతము అనగా "నాల్గు భిన్న జన్మ వృత్తులు" అను సూత్రము భగద్గీత కంటెను ప్రామాణికమగు పురుష సూక్త "దైవ వర్ణ సిద్ధాంతము"లో "బ్రాహ్మణోఽస్య ముఖమాసీత్ బాహూ రాజన్యః కృతః ఊరూయదస్య తద్వైశ్యః పద్భ్యాం శూద్రో అజాయత" "బ్రాహ్మణుఁడు నా ముఖము, క్షత్రియుడు నా బాహువులు, వైశ్యుడు నా తొడలు, శూద్రుడు నా పాదములు" అను భగవద్వాక్యమునకు విరుద్ధము. భగవంతుడు పరస్పర విరుద్ధములయి, ఈ జన్మలో మారని, గోడలో పేర్చిన రాళ్ల వలె నున్న నాల్గు భిన్న వస్తువులా? ఏక పురుషుడా? భిన్న వస్తు లందు మేని నాల్గుగా ఖండింతుమేని శరీరము నాల్గు మొండెములుగా అనగా బ్రాహ్మణ ముఖముగా, శూద్ర పాదములు వగైరాలుగా జీవింపజాలఁడు కదా? ఎట్లా నాల్గు వర్ణములు ఈశ్వరునందు లీనమయి ఏకముగా ఉన్నవో అట్లే "తత్వమసి" అను ఉప ,నిషద్వాక్యము ప్రకారము ఆ ఈశ్వర స్వరూపమైన మనుజునందును ఏకముగా లీనమై యుండును. ఏల అనఁగా మనుజుడు సరాసరి సృష్టి మొదలు నేటి వఱకు తరము తర్వాత తరముగా ఆ ఈశ్వరునికి జన్మించుచున్న బిడ్డయేకదా?

24. "జన్మసిద్ధి" యే బ్రాహ్మణత్వ, క్షత్రియత్వ, వైశ్యత్వ, శూద్రత్వములు నాల్గింటికిని సహజ స్థితి అని

వాదము కొఱకు అంగీకరింతము. అట్లయినను మన జన్మలు క్రమాంతరముల ద్వారా తొలుతటి సృష్టికర్త యగు భగవంతు నుండి సరాసరి వచ్చినవి కావా? మన నాల్గు వర్ణములకు (నాల్గు భిన్న వర్ణములని అంగీకరించినను) ప్రథమ మాతృక ఆయన కాదా? బ్రాహ్మణుడు ఆ నాల్గు వర్ణములను బ్రహ్మదేవు నుండి పొంద లేదా? బ్రాహ్మణుడు తన సర్వ శరీరమును అనగా పాదములు, ముఖమును ఈశ్వరుని ముఖము నుండియే జనించిన దని తలంచుచో ఈశ్వర ద్రోహి కాడా? తన పాదములు ఈశ్వరుని పాదముల నుండి జనించిన వని యొప్పుకొనుట తనకు హీనత యని తిరస్కరించుచో తన పాదములు ఈశ్వరుని పాదముల కంటె పవిత్ర తరములు అనుటయు ఈశ్వరుని ముఖముమీద తన పాదము లుంచుటయుజరుగవా? అది ఘోర పాపము కాదా? మఱియు అది "విశ్వతశ్చక్షురుతవిశ్వతోముఖో విశ్వతో హస్తఉత విశ్వతస్పాత్" 'విశ్వములో సర్వత్ర నాకు కండ్లు, ముఖములు హస్తములు, పాదములు కలవు అను తైత్తిరీయోపనిషద్వాక్యమునకు భిన్నము కాదా? భగవంతునకు ముఖమేడ, హస్తమేడ అంతటను అతని సమగ్రమును అవిభాజ్యమును అగు స్వరూపమే కలదు. అనగా దేవుడు ఒకదాని మీద ఒకటి పేర్చిన, ఒక దానితో నొకటికి సంబంధము లేని నాల్గు భిన్న వస్తువుల ప్రోవుకాదు ఆయన అవిభాజ్యుడైన అఖండ విశ్వవ్యాప్తి గల ఏక పురుషుడు. ఆ విరాట్ స్వరూపము

నందు బ్రాహ్మణత్వ, క్షత్రియత్వ, వైశ్యత్వ, శూద్ర త్వములు మూర్తీభవించి యున్నవి.

25. అవిభాజ్యమై, సారూప్యమై ఐక్యమైన ఆ పవిత్ర మూర్తియే సృష్టి ఆరంభము నుండి ఒక తరము తర్వాత మఱి యొక తరముగా నేటి 1946–వ సంవత్సరము వరకు మనుజునకు సంక్రమించు చున్నది. ఆ జన్మ పరంపరా ప్రవాహమును మనుష్యులు మధ్యలో ఒకానొక నిర్దిష్టకాల మునుండి నిరోధించి తమ బ్రాహ్మణత్వ, క్షత్రియత్వ, వైశ్యత్వ, శూద్రత్వము లనబడు పరస్పర భిన్నము లును, జన్మతో అవినాభావ సంబంధములును, ఈ జన్మలో ఒకటి వే ఱొకటిగా మారనివియు అగు భిన్న వర్ణములను " అనఁగా భిన్న భిన్న శూద్రత్వ, వైశ్యత్వ, క్షత్రియత్వ, బ్రాహ్మణత్వములను " ఎవరికి వారు వేఱు వేఱుగా సంక్ర మింపఁజేయుచున్నారని చెప్పుటకు వీలుపడదు.

26. ఏల అనఁగా అప్పుడు వారు అవిభాజ్యమై, ఐక్యమై, ఏక రూపమైన ఈశ్వరుని వర్ణమును తొలగించి తమ నాల్గు రూపములతో నున్న పరస్పర భిన్న వర్ణములను సృష్టించి ఈశ్వర వర్ణమునకు వ్యతిరేకముగా నిర్వహింప గలవా రగుచున్నారు. అనగా ఆ మొదటి ఏకముఖ బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు దేవుని (1) శాశ్వతమును (2) అల్పుడగు మానవుని కతీత

మును అగు చతుస్స్వరూప గర్భితమగు దైవ వర్ణమును మార్పగలిగినవారై దేవులే అగుచున్నారు.

27. ఇది చాల పరిహాసాస్పద విషయము. ఏల అనగా "యోహ మస్మి, బ్రహ్మోహ మస్మి" "నేను పైని చెప్పినట్లు అధ్యాత్మిక, భౌతిక స్వరూపినై, నాలుగు వేదముల మూర్తి అగు బ్రహ్మను" అని మనుజుని గూర్చి వేదములు చెప్పుచున్నవి. కావున జన్మలబ్ధమైన వర్ణము బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్ర త్వములను చతుర్ముఖములు కల ఏక వర్ణమే. అదియే అవిభాజ్యమై, ఏకమై చతుర్వర్ణాత్మక మగు అంతరాత్మ. అంతే కాని, (1) పరస్పర విజాతీయములును (2) పరస్పర విరుద్ధములను (3) ఈ జన్మలో మారనివై (4) జన్మతో వచ్చి (5) జన్మాంతము అనగా మరణాంతము ఉండు (6) ఏక వర్ణ మాత్రములగు, ప్రపంచ ములో ఎచ్చటను అనగా మనుజకోటిలో గాని, జంతు కోటిలో గాని కానరాని అష్టాదశ మహాపాపులగు సనాతను లనువారి పొట్టకూటికి నాల్గుగా ఖండింపఁబడిన యేకముఖము లగు వర్ణములు కావు.

28. "సింహము అంట్రోకిలుసు" అను ఒక జగ ద్విఖ్యాత కథ చతుర్గుణాత్మకమై కేవలము మనుజుల సొత్తు మాత్రమే గాక తదితర జంతుకోటి సొత్తుకూడ అయిన "దైవ వర్ణ" సిద్ధాంత సత్యస్వరూపమును ప్రదర్శించును.

బోనులో సింహము ఆకలితో బాధపడుచున్నది. బానిస వాడగు ఆండ్రోకిలుసు సందు త్రోసిరి. గడగడ లాడు చున్న ఆ బానిస వానిని చంపి ఆకలిబాధను తీర్చు కొనుటకు మారుగా ఆ సింహము కృతజ్ఞతతో అతని పాద ములు నాకెను. ఎంతటి విధేయత !. అది శూద్రుని సేవా ధర్మము కాదా ? ఆ సింహము అంతకు పూర్వమె జంతు వులకు రాజు. అందుచే క్షత్రియత్వము కలదు. ఆ కృతజ్ఞత చాల గొప్ప వివేకము అగుటచే సద్ బ్రాహ్మణత్వమే. అం దుచే ఏక కాలమందే అది బ్రాహ్మణత్వ, క్షత్రియత్వ శూద్రత్వముల (విభజింప వీలు లేని) యాత్మ స్వరూపము. ఆ సింహము మేలుచేసిన ఆ ఆండ్రోకిలుసును—భస్మాసురుడు వరమిచ్చిన యీశ్వరునిం బోలె—నాశము చేయ యత్నించి యుండవచ్చును. బహుశః ఆండ్రోకిలుసు చచ్చియుండ వచ్చును. అతి తీవ్రమగు క్షుద్బాధ కోర్చి ' క్షమాశక్తా " అనగా శక్తియుండియు సైరణ సల్పిన ఆ సింహము సద్బ్రా హ్మణ వర్ణమునకు నిజమైన తార్కాణ-పూర్వమునం దా బానిస కొండగుహ దగ్గఱ గాయమును మాన్పి బాధ తీర్చి చేసిన మహోపకృతిని స్మరించి దుస్సహ మగు ఆకలి బాధను సహించి తన ఋణమును తీర్చుకొన్న సద్బ్రాహ్మణమూర్తి.

29\. మనము దేవుని ప్రత్యక్ష వారసులము. ఆయన మూర్తిం బోలిన ఆ దైవత్వ సిద్ధిని ఈ జన్మలో పొందుట కొఱకు దైవ మిచ్చినదై మన భౌతిక మానసిక వాంఛాను

రూపమును అనగా (i) బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులకు, సర్వ మతముల వారికి సమధర్మమై మాధ్యతా రూపమైన శూద్రత్వముతోను (ii) స్వాభావిక స్త్రీ పురుష సుఖ వాంఛాను రూపమును జీవనోపాధి దాయకమై ఈశ్వరత్వ సాధోన్ముఖప్రయాణములో రెండవ మెట్టనదగిన కుటుంబసేవతో గూడిన వైశ్యవృత్తితోను (iii) అంత కంటె ఉన్నతమై స్వార్థ రహితమై దేశసేవా రూపక మగు క్షత్రియత్వము తోను iv సంపూర్ణ ఆత్మ త్యాగము కల్గి స్వకుటుంబ స్వసంఘాది ప్రాస్వదృష్టుల కతీతమగు పరమేశ్వరార్పణము కావించుకొనుటతోఁ గూడిన బ్రాహ్మణత్వము తోను గూడిన దైవ వర్ణ ధర్మము మనుజున్ని కిహలోకమందే ఈ జన్మలోనే ఈశ్వరత్వము నిచ్చు పవిత్ర వస్తువు.

30. కావున "చాతుర్వర్ణ్యము" మాధ్య స్థితి నుండి ఈశ్వరత్వమునకు మనలను గొంపోవు ఆత్మ పవిత్రీకరణముతోఁ గూడి అవిభాజ్యమైన ఆధ్యాత్మికాకృతి కల ఆత్మవికాసము.

31. ఇట్టి ఈ ఆధ్యాత్మిక క్రమోన్నతిని అష్టాదశ మహాపాపి యగు బ్రాహ్మణుఁడు దొంగిలించి సర్వజనములు కాంక్షించు జీవనోపాధి వృత్తితో మోసముగా కప్పివేసి ఆధ్యాత్మిక స్వరూపమును భౌతిక స్వరూపములగు జీవనోపాధివృత్తులుగామార్చి ద్వితీయజన్మయను పేరుగల ఉపనయన పరపవిత్రదశను మరణానంతర జీవితముగా మార్చి తనకు

ద్వితీయ జన్మ అనగా ఉపనయన పరదశగాను శూద్రులను వారికి ద్వితీయజన్మ అనగా ఉన్నదో లేనిదో ఋజువు పరచ బడని, ఋజువు పరచుటకు వీలులేని మరణానంతరము పొంద దగిన ద్విజత్వముగాను చేసి తన పొట్టకొఱకై సర్వ నాశము చేసెను.

32. అందు తాను కూడ "జన్మచేత శూద్రుడే" అను సత్యమును మఱుగు పరచి శూద్రులయు, పంచము లయు బ్రాహ్మణ ధర్మానుష్ఠాన అర్హతను హరించెను.

33. అయినను నేడు బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రత్వము నందు జన్మించి ఈ జన్మలో మార రానిదని చెప్పబడు బ్రాహ్మణత్వములోనికి, క్షత్రియత్వము లోనికి, వైశ్యత్వములోనికి దుమికి ఈ జన్మలో పొందరాని దనబడు ద్విజత్వమును పొందుచున్నారు.

34. కావున వర్ణములు నాల్గు పరస్పర విరుద్ధములు, ఒకదాని కంటె నొకటి వేఱయి జన్మతో వచ్చి జన్మాంతము వరకు ఉండు, అవినాభావ వస్తువులు అను వాదము అష్టాదశ మహాపాపి యగు బ్రాహ్మణుని దుర్వాదము. మఱియు తన పొట్ట కూటికై తరము తర్వాత తరముగా సృష్టి అంతము వఱకు చేయు ద్విజేతరుల ఆధ్యాత్మిక హత్యయు. ప్రయో జనమేమి అనగా తనకు ద్విజేతరులను బానిసలనుగా జేసి కొని తరువాత నీచసేవకులనుగా నుంచుకొని తాను

దేవుఁడనని ఉత్తర జన్మలో ప్రతిఫలము వచ్చునని నమ్మించి, వారి వలన సేవలు చేయించుకొనుట, వారిలో కలవారినుండి గోదాన, భూదాన, గృహదానాదికము పొంది శరీర శ్రమ లేకయే సౌఖ్య మనుభవించి మఱి వారికి రాజత్వము లేకుండఁ జేసి హింసించుచు ఏలుట. వారి యైశ్వర్యము కొల్లగొట్టుట. మఱి క్షత్రియ, వైశ్యులు, బ్రాహ్మణేతరు లనుట పొరబాటు. ఏల అనగా " యేన అంగేన అవరో వర్ణో బ్రాహ్మణేభ్యో అపరాధ్నుయాత్, తస్య తదంగం ఛ్ఛేత్తవ్యం " అనగా శూద్రుడనబడువాఁడు ఏ యవయవముచే బ్రాహ్మణులకు (ఇక్కడ బ్రహ్మ, క్షత్రియ, వైశ్యులకు అను నర్థములో వాడబడినది) అపరాధము చేయునో అతని ఆ యంగమును కోయవలెను " అని సృష్టికి మొదటి ధర్మశాస్త్రవేత్త యగు మనువు చెప్పెను. అంత కంటె ప్రామాణికుఁడు లేడు గదా ? కావున బ్రహ్మ, క్షత్రియ, వైశ్యులను భేదములు తమలో తాము సాకర్యము కొఱకు చేసికొన్న ఈ " జందెపు మోసగాండ్ర " దొంగ ఏర్పాట్లు.

35. కావున " గాంధి వర్ణ " సిద్ధాంతమును ప్రతిపాదించుటలో మహాత్ముఁడు " బ్రాహ్మణత్వము (i) పదునాఱవ వత్సరము లోగా (ii) శూద్రత్వములో ఉన్న బాలుఁడు (iii) ఉపనయనమును ఐదవయేటికి పైని పొంది (iv) అంతే కాక నిరంతరము ప్రాత స్సంధ్యానుష్ఠానమును ఒక్క రోజు కూడ విడిచిపెట్టక చేయుచు అనుష్ఠించు ఆత్మ

పవిత్రీకరణదీక్ష ” అను సనాతనులను వారి సిద్ధాంతమును కూడ అతిక్రమించెను. ఏల అనగా ఆ బ్రాహ్మణత్వము పదునాఱవ వత్సరములోగా పొందనిచో ఆ శూద్ర బాలునకు ఆ జన్మలో శూద్రత్వము తప్ప బ్రాహ్మణత్వము లేదు కదా ?

36. కాని, యితర విషయములలో అనఁగా తక్కువ ఎక్కువ భావములను తొలగించుటలోను, అనులోమ విలోమ వివాహ నిర్బంధములు తొలగించుటలోను, అంతర్వర్ణ భోజనముల నిషేధములోను, అస్పృశ్యత్వ, అదర్శనీయత్వ రాక్షసత్వములను లేకుండఁ జేయుటలోను, మహాత్మాజీ చాల అభివృద్ధి చేసెను. అందు కాయనకు నమస్కృతు లర్పింపవలసి యున్నది.

37. కాని, సనాతనులను వారి “ వర్ణ సిద్ధాంతము ” లోని మఱియొక తప్పును, దాని నిజస్వరూపమును పరిణామములను గమనింపక మహాత్ముఁడు అంగీకరించెను. ఆయన ఏమి చెప్పెననఁగా:—“ హిందువుల విశ్వాసము ప్రకారము ఏకులములో ఎవఁడు జన్మించెనో అది యాతని వర్ణము. ఆ వర్ణ వృత్తిని స్వీకరింపనివాడు ఆత్మ హింసకు పాల్పడి పతితుఁడగును ”.

38. ఇందొక దోషము గర్భితమై యున్నది. అదేది అనగా వర్ణ వృత్తి యనఁబడు దానిని అనుష్ఠింపమి నైతిక

ధర్మ విరుద్ధముఅను హేత్వాభాస. అంతరాత్మకు విరుద్ధము లగు మద్య విక్రయ జీవనము, పడుపు వృత్తి మొదలగు వృత్తులు కలవు. మఱియు అవినీతి కరములుకాని వృత్తు లలోకూడ అంతరాత్మ ప్రబోధముచే వర్ణ వృత్తియను దానిని విధిగా విడిచిపెట్టి అన్యులు చేయజాలని లోకోత్తర సేవ చేయదగిన సమయములు, ఘట్టములు, వ్యక్తులు కలరు. కుమ్మరియగు శాలివాహనుఁడు చక్రవర్తిఆయెను. కోమటియగు గాంధిజీ బ్రాహ్మణులగు మాలవ్యాజీ, మోతీలాల్, జవాహ ర్లాలునెహ్రూలు క్షాత్ర వృత్తి నంతరాత్మ ప్రబోధముచే నవలంబించిరి. వీరు జగత్పూజ్యులు కాని, గురు భార్యను పొందుట, సురాపానము చేయుట మొదలగు పాపములు చేసిన వారితో సములగు "పతితులు" కారు.

39. మఱియు పది లక్షలమందిలో ఒక్కఁడుకూడ వర్ణ వృత్తియనబడు దానిని ఉల్లంఘింప వలయునను కోరిక మాకు లేదు. పది లక్షల మందియు వర్ణ వృత్తిని స్వీకరించుట సంతోషము. కాని యంతరాత్మ ప్రబోధముచే "వర్ణ ధర్మము" అనుదానిని స్వీకరింపఁజాలని ఆ పదిలక్షలమందిలోని ఒక్కని గురించియే మా పోరాటము. మద్య ముమ్మ "గాండ్ల" వారిలో జన్మించినయొకఁడు అంతరాత్మ ప్రబో ధముచేనేని ఆ వృత్తిని మానరాదా? బోగము కులములో జన్మించినవాఁడు అంతరాత్మ ప్రబోధముచేనేని బోగమువృత్తి మానరాదా? కల్లు సారాయిలమ్ము కులమువాడవి ప్రపంచము

హాని కల్గించునని ఆ వృత్తి మానుట పతితత్వమా అనగా గురు భార్యతో సంచరించుటతో సమానమా? లాభకరమగు ఈ వృత్తిని మానుట నిజముగా గొప్ప స్వార్థత్యాగము, పుణ్యకార్యమును.

40. ఏల అతనిని పతితుడు అని పిలువవలయును? ఎవరి దృష్టిలో అతడు పతితుడు? వర్ణ ధర్మమను దానిని విడుచుటచే నష్ట పడిన వారెవరు? (1) దేవునికి నష్టము లేదు. ఏల అనగా అది పవిత్ర కార్యము. ఆ కార్యముచే ఈశ్వరుని ప్రజలలో ఎవనికిని హానిలేక పోవుటయేగాక మేలు కలిగినది. (2) ప్రభుత్వమువారు ఆదాయము తగ్గినదని విచారింపవచ్చును. కాని ప్రజలకు కల్లు సారాయిలు త్రాగుటచే కల్గు అపారమగు నష్టములను గణింపని ప్రభుత్వము రాక్షస ప్రభుత్వము.

41. కుటుంబమువారు ఆదాయము తగ్గి (కల్లు సారాయి అమ్మకములో వచ్చునంత ఆదాయము ఇతర వృత్తులలో రాక పోవుటచే) బాధ చెందవచ్చును. కాని, అది న్యాయమైన బాధ కాదు (4) అతని కులమువారు, అతనికి వచ్చిన నష్టమునకు గాకపోయినను వర్ణ వృత్తి యనబడు దానిని త్యజించెనని బాధ చెందవచ్చును. అయినను అది న్యాయమైన బాధ కాదు. అందుచే పతితుడని అతనిని నిర్ణయించుటకు వారికి అధికారము లేదు. (5) అతడు తనకు తాను పతితుఁడు కాడు, మఱి కాజాలఁడు. ఏల అనగా వర్ణ వృత్తి

యనబడునది పాప వృత్తి యని మంచి పెద్దలు చర్చించి యతడు దానిని త్యజించెను కదా? మహాత్ముడు చెప్పి నట్లు అతఁడు తనకు తాను కావించుకొన్న "హింస" ఏమి?

42. మన నైతిక జీవితములోని ప్రాథమిక సూత్ర మగు వ్యక్తి స్వాతంత్ర్యమును ఆ వర్ణ ధర్మమను నది చంపుచున్నది. ఏది ఒక వ్యక్తి యొక్క స్వాతంత్ర్యమును నాశము చేయుచున్నదో అది జాతియొక్క స్వాతంత్ర్యమును కూడ చంపుచున్నది. జాతి లేక రాజ్యము వ్యక్తుల సమూహామేకదా? అది "అట్లాంటికు చార్టరు" లోని మత స్వాతంత్ర్య సిద్ధాంతమునకు విరుద్ధము. ఎట్లనగా అది అర్చకత్వము వహింపరాదని కొన్ని కులములను నిషేధించు చున్నది. లోకోత్తర పవిత్రత కల శూద్రు డనబడువాడు కూడ కాశీ విశ్వనాథ ఆలయములో తిరుపతి దేవాలయ ములో అర్చకుడు కారాదు. భార్యను బుద్ధిపూర్వకముగా అరువిచ్చు అష్టాదశ మహా పాపియగు బ్రాహ్మణునకు ఆ హక్కు కలదు· (హిందూ దేశములోని పవిత్ర దేవాలయ ములోని బ్రాహ్మణార్చకులలో కొందఱి కథలు వినరానివి) మఱియు వర్ణవృత్తి యనబడునది మేధా సంపత్తి యొక్క సహజ ధోరణిని ప్రతిఘటించు విషవృక్షము. వాల్మీకి రామాయణము వ్రాయుటయును, వసిష్ఠుడు బ్రాహ్మ ణత్వము నందుటను కూడ నది అంగీకరింపదు. వాల్మీకి బోయవాడు కదా? దేశబంధుదాసు యొక్క క్షత్రియ

త్వము కూడ సనాతనుల ప్రకారము ధర్మ భిన్నమే !. అట్లే బ్రాహ్మణులగు నెహ్రూలయు, మాళవ్యాజీయు, రాజకీయ వృత్తి, వారి ప్రకారము అధర్మమే. సనాతనులనువారి దుష్ట సిద్ధాంతము ప్రకారము శాలివాహనుడు, చక్రవర్తియు, మహాత్మాజీ భారత స్వాంతత్ర్య యుద్ధ కర్తయు కారాదు. అనగా 40 కోట్ల ప్రజల మోక్షకర్త పతితుఁడే !.

43. ఆ సనాతన ధర్మమనునది యిట్లు మేధా సంపద యొక్క సహజ ధోరణిని చంపుచున్నది స్వేచ్ఛానుగుణమగు పోకడయే జాతిని ముందునకు గొంపోవును. నేడు రెండవ ప్రపంచ యుద్ధములో 30 లక్షల మంది భారతీయులు యుద్ధ భటులుగాఁ జేరిరి. క్షత్రియత్వము క్షత్రియులనబడువారి సహజ ధర్మమనునో 30 లక్షల మందియు వారేయై యుండవలయును. కాని, ఆరా తీయుచో నూటికి పదిమంది కూడ జన్మచే క్షత్రియులమని చెప్పుకొను వారందు చేరలేదు. అనగా క్షత్రియేతరు లనబడు హిందువులు క్షత్రియులైరని భావమే కదా ?

44. మఱియు వారు ఇటలీలో, మధ్య ప్రాచ్య భూములలో, బర్మాలో, చీనాలో విజయ పరంపరలు పొందిరి. అట్టివారు క్షత్రియులు కారందురా ? అందు క్షత్రియులు నూటికి పదిమంది యుందురనుటకూడ ఊహయే. నిజము విచారించినచో తక్కువే ఉందురు. కావున క్షత్రి

యత్వము ఒక సంఘమువారి ప్రత్యేకపు సొత్తు అనుట దుష్ట సిద్ధాంతము గాదా ?

45. "విద్య"ను సర్వ జాతులవారి లోను నేడు ప్రభుత్వమువారు అభివృద్ధి చేసిరి. పూర్వకాలములో "శూద్ర మక్షర సంయుక్తం దూరతః పరివర్జయేత్" "అక్షర మెఱిగిన శూద్రుని దూరముగా తోలండి" అను అష్టాదశ మహా పాపుల ధర్మము వాడుకలో ఉండుటచే వారిలో చదువు లేదు. ఆ యష్టాదశ పాపులగు బ్రాహ్మణులు కం॥ కాపు కవిత్వపు కూతలు । బాపన కవివరుల కెందు ప్రమదంబిడునే? అను సూత్రమును వారి మత ధర్మముగా స్వీకరించిరి. విద్యనొసగు గురువులు వారే గదా ? నాటి దేశమునకు వారు పెట్టినది భిక్ష. వారి ఆజ్ఞ ప్రకారము వేద వాక్కులను శూద్రుడనువాడు వినరాదు. విన్నచో వారి చెవిలో మండు సీసము పోయవలసినదే. ఈ రోజున గూడ అనేకవేల గ్రామములలో శూద్రులకు విద్య ఏల యని అష్టా దశ మహా పాపులు ఘోషించుచున్నారు.

46. నేడు బ్రాహ్మణులలో బ్రాహ్మణత్వము అనగా తదితరులలో కంటె హెచ్చుగా సత్యబుద్ధి, ధర్మాను ష్ఠానము, అహింసాబుద్ధికలవా ? నేటి బ్రాహ్మణ సంఘ ముతో రెడ్డి, కమ్మ సంఘములను పోల్చి చూడుడు (1) ఏ సంఘములో ఎంత మంది పరాన్న భుక్కులై యితరుల మీద ఆధారపడక స్వతంత్రులై జీవించుచున్నారో (2) ఏ

సంఘములో ఎంత మంది లంచ గొండులు (3) దొట్లు (4) తమ లాభముల కొఱకు గ్రామములలో తగాదాలు పెట్టువారు (5) భిక్షు వృత్తి లేక యాచన వృత్తిలో లేక పరాధీన వృత్తిలో ఉండుచు తమకు సాయముచేయు వారిని సంతర్పణలు వగయిరాలలో సహపంక్తి భోజనాదుల కన ర్హులని (తమకులపురంకుటాంద్రతో, హతకులతో భుజిం చుటకు జంకక) బహిష్కరించు అవినీతిపరులు కలరో విచారింపుడు. సరి యగు లెక్కలు వేసిచూచినచో నేడు పై రెండు సంఘములలో దేనిలోనో ఒక దానిలో ఒక వంకను బ్రాహ్మణ సంఘములో రెండవ వంకను జూచి నచో బ్రాహ్మణులలోనే హెచ్చు మంది యవినీతిపరులు పరాన్నభుక్కులు కలరనియు బ్రాహ్మణులలో అహింసాసత్య నిరతులు లేవనియు, పై హెచ్చు వారు ఎవరివలన మేలు పొందు చున్నారో అట్టివారిని అంటరానివారినిగను,చూడరాని వారిని గనుగణించి, వారి సొమ్ము తిని వారికి హాని చేయుచున్నా రనియు తేలును. అందుచే బ్రాహ్మణత్వము మహాత్మాజీ చెప్పినట్లు (1927–వ సం॥రపు 24–వ నవంబరు తేదీ యంగు యిండియా పత్రిక చూ.) జన్మచే వచ్చు వస్తువు కాదు.

47. పక్షాంతరమున బ్రాహ్మణత్వము గీతలోని "గుణ కర్మ విభాగశః" అను శ్లోకమునకు జేసిన తప్పుడు వ్యాఖ్య ప్రకారము జన్మచే బ్రాహ్మణత్వము బ్రాహ్మ ణులు అను వారికి వచ్చెనని భావింతము. ఒక రాష్ట్ర

ములో గల బ్రాహ్మణుల నెల్లరను బరీక్షించినప్పు డేని సత్యము తేలవలదా ? మామిళ్ళు, చింతలు, నారింజలు తమ తమ ప్రత్యేకతను నిల్పుకొనుట లేదా ? ఏల బ్రాహ్మ ణత్వము తన ప్రత్యేకతను నిల్పుకొన కుండవలయును? గీతకు వ్రాసిన తప్పుడు వ్యాఖ్య ప్రకారము బ్రాహ్మణ త్వము జన్మచే వచ్చునదియైనచో ఆ శ్లోకము "జన్మకర్మ విభాగశః" అని వ్రాయబడి యుండునది వర్ణముల గుణములు జన్మలోనే వచ్చుచున్నవనుట కెంత హక్కు కలదో జన్మతో రావని వాదించువారికిని అంత హక్కుకలదు. బ్రాహ్మణ గుణము అన్ని కులములవారికిని ఈశ్వరు నుండి వచ్చుచునే యున్నది. అంతేకాదు అధ్యారోపము చేసికొనుట యొకరికేకల జన్మ హక్కు కాదు.

48. బహుశః ఈ సందర్భములో మహాత్ముడు చెప్పిన "జన్మగాథలు" అను ప్రశ్న వచ్చును కాబోలు. దక్షిణ హిందూదేశ బ్రాహ్మణేతర సోదరుల ప్రశ్నలకు సమాధానము చెప్పుచు తండ్రుల వృత్తులను పుత్రులు పెక్కురు స్వీకరింప కుండుటకు హేతువుగా "వారి జన్మ గాథలు తెలియవు" అని చెప్పెను. (యంగు యిండియా 24-11-27) అది గొప్ప తప్పు

49. మొదటిమాట (1) జంతువుల జీవితములో గాని (ఏనుగు సింహమును కనదు, సింహము ఏనుగును కనదు) (ii) వృక్ష సంప్రదాయములో (మామిళ్ళు చింత

కాయల నుత్పత్తిచేయవు, చింతచెట్టునకు మామిడికాయలు పుట్టవు) కాని (iii) ఇతరమనుష్య ప్రపంచములో కాని (ఇతర జాతులలో ఒక సంఘము ఈశ్వర ముఖమునందు జనించితిమి కావున గొప్పవారము అగుటచే మాకు ఇతరులతో అంతర్వివాహములు చెల్లవు. అను నిట్టి దుష్టవాదములు లేవు) లేని యీ వాద మెట్లు వచ్చెను?

50. "వర్ణము" దైవనిర్మితము అందురు. దైవ నిర్మిత జంతుకోటిలో ఆ ప్రత్యేకత స్పష్టము. పిల్లులు, సింహములు, ఏనుగులు మొదలగు జంతువులలో ఒక జాతి స్త్రీ జంతువు వేఱొక జాతి పురుష జంతువుతో సంపర్కము కోరదు. ఆరుకోట్ల పంచములు శూద్రులను వారి వలన తమ కుమారితెలకు కలిగిన సంతాన మని బ్రాహ్మణులు చెప్పుచున్నారు. తమ సహజ సంఖ్య కంటె ఇన్ని రెట్లు హెచ్చు సంఖ్యగా పంచములనువారు ఉండుట బ్రాహ్మణ కన్యకలు శూద్ర సంయోగము నభిలషింతురని ఋజువు చేయదా? వర్ణములు ఈ జన్మలో మారని పరస్పర విరుద్ధ జీవకోటియైనచో ఈ సంపర్కమును, సంతానోత్పత్తియు జరుగవు.

51. మఱియు బ్రాహ్మణుని ఉపనయన పూర్వదశ శూద్రత్వమే కదా? అనగా ఉపనయనముకాని బ్రాహ్మణ బాలుడు శూద్రుడే కదా? ఏల బ్రాహ్మణ దంపతులకు శూద్ర బాలురు జన్మించుచున్నారు? వేప చెట్లకు నారింజ

పండ్లు, నారింజ చెట్లకు వేపపండ్లు కలుగుచున్నవా ? కావున దైవనిర్మిత జాతులు తమ ప్రత్యేకతను నిల్పుకొనుచున్నవి కదా ?

52. మఱియు పక్షాంతరములో ఎట్లో రెండు భిన్నజాతుల మధ్య సంసర్గము కలిగె ననుకొనుడు. సర్వ పవిత్రమగు బ్రాహ్మణత్వము ( దానిని చేదు వేపాకు తిని ఆవు తియ్యని పాలిచ్చినట్లు) పవిత్రీకరింపవలదా ? (నిజము నకు ఆ పవిత్రీకరణము నేడు జరుగుచునే యున్నది. భర్తల మాటున ఇతరులకు జన్మించి గుసగుసల మాటున బ్రాహ్మణులగుచున్నవారు కలరు. మఱియు బ్రాహ్మణుని పుత్రిక శూద్ర. అయినను బ్రాహ్మణుని పెండ్లాడి బ్రాహ్మణ బాలుని, శూద్రబాలికను కనుచున్నది )

53. ఈ ప్రశ్నలకు సమాధానము చాల సూక్ష్మము. బ్రాహ్మణుని నాల్గు వర్ణముల సిద్ధాంతము తప్పుడు సిద్ధాంతము. దేవుని చతుర్ముఖమగు (అనగా శూద్రత్వ, క్షత్రియత్వ, వైశ్యత్వ, బ్రాహ్మణత్వములతో కూడి క్రమపరిణామముకల) ఏకవర్ణ సిద్ధాంతము సత్యము.

54. అట్లుకాక నాల్గు వర్ణములు ఈ జన్మలో ఒకటి వేఱొకటిగా మారరాని భిన్న ప్రకృతులు లేక మేక, పులివంటి జాతులు అన్నచో బ్రాహ్మణ బాలిక శూద్రుని పెండ్లాడుట బిడ్డలు కనుట పొసగవు.

55. కాని జరుగుచున్న విషయము ఇదివఱకే చెప్పినట్లు ఇందుకు భిన్నముగా నున్నది. ఆరు కోట్ల పంచములు బ్రాహ్మణ బాలికలకు శూద్ర భర్తల వలన జన్మించుట—సహజ జన్మచే అందు పదియవ వంతుగల బ్రాహ్మణ సంఘ స్థితి—బ్రాహ్మణ కన్యకలకు శూద్ర సంపర్కమునందు వాంఛ హెచ్చని స్పష్టము చేయుచున్నది.

56. ఈ ఆభాస ఏల వచ్చినదనగా ఆత్మ పవిత్రీకరణమగు బ్రాహ్మణత్వమును భౌతికమగు జీవనోపాధి మార్గముగా మార్చుట చేతనే. సనాతనుని వర్ణ సిద్ధాంతము ఇట్లు పొట్ట కూటి సిద్ధాంతముగా మార్పబడి తలక్రిందు సిద్ధాంతమైనది.

57. నిజమేమి అనగా "గుణ కర్మ విభాగశః" లోని "గుణ" మునకర్థము జన్మతో రహస్యముగా వచ్చినదనబడు గుణము కాదు. శూద్రత్వమే జన్మతో వచ్చు గుణము. బ్రాహ్మణత్వము ఆత్మ పవిత్రీకరణముచే వచ్చు సిద్ధి. "కర్మ" అనునది నిత్యము అనుష్ఠింప వలసిన పవిత్రీకరణ సాధిక. కర్మ స్వవిషయము. అనగా తన కొఱకు తాను చేసికొనునది. "పరుల కర్మ" కు వర్ణ సిద్ధాంతములో తావు లేదు. అందుచేతనే

బ్రాహ్మణ క్షత్రియ విశాం।
శూద్రాణాం చ పరంతప।

కర్మాణి ప్రవిభక్తాని ।
స్వభావ ప్రభవై ర్గుణైః ॥

అని భగవద్గీతలో "స్వభావ" ప్రభవ గుణముల ననుసరించి కర్మలు (వృత్తులు) నిర్ణయింపబడినవి. కాని, వర్ణములు "పర" భావజాత్రైర్గుణైః "అనగా ఇతర భావజాత గుణములను బట్టి నిర్ణయింప బడినవి" అని చెప్పలేదు. అనగా తన భావమును అనగా బ్రాహ్మణ, క్షత్రియ వైశ్య, శూద్రత్వములను అనుష్ఠించు వ్యక్తి అంతరాత్మ భావమును బట్టి వర్ణమును నిర్ణయించుకొనునని యర్థము. సనాతనుల వర్ణవృత్తియో తండ్రిది లేదా కులమువారిది. స్వీకరించు వ్యక్తి "స్వభావ" ముతో నిమిత్తము లేనిది. అనగా జడ్జి అనుమతిని దోషి అనబడు వానిని ఉరితీయు తలారివాని విధిపంటిది. దైవవర్ణములోని ఆత్మ పవిత్రీకరణము తండ్రి కొఱకు గాని, కులము కొఱకుగాని, చేయు అస్వతంత్ర వృత్తిలో లేదు.

58. బుద్ధుని తర్వాత గొప్ప యవతార మన దగిన మహాత్మాజీయే యిట్లు ఈ "బ్రాహ్మణత్వ" పిశాచముచే మోసగింపబడి నప్పుడు కోట్లకొలది పంచములు శూద్రులనబడువారు ఆయన వలెనే అష్టాదశ మహాపాపుల ఈ సిద్ధాంతముచే మోసగింపబడుటలో ఆశ్చర్యము లేదు. అందుచే వారు (i) బ్రాహ్మణుఁడీశ్వర తుల్యుఁడనియు (ii) బ్రాహ్మణుని దుష్ట వర్ణ ధర్మమును శిష్ట ధర్మముగా తాను స్వీకరించి తీరవలయుననియు (iii) భూములు, ఇండ్లు, ఆస్తి,

రాజ్యపాలనము, వాణిజ్యాదులు చేయుటయు కోర రాదనియు (iv) వేదము చదివి బ్రాహ్మణత్వము పొంద గోరరాదనియు (v) నీళ్లు తెచ్చుట. కూలిపని చేయుట, బట్టలుతుకుట యింటిపనిచేయుట మొదలగు నీచకార్యములచే బ్రాహ్మణుని సేవించుట చేతనే పాపము హరించి (vi) గత జన్మ పాపముచే వచ్చిన శూద్రత్వము పోవుననియు (vii) మఱియు ఉత్తమ జన్మ అనబడు ద్విజత్వము వచ్చుననియువారు నమ్మిరి.

59. శూద్రు లనబడువారిలో నేడు చాల మంది భూస్వాములు కలరు. కాని, యది సనాతనుడనబడు బ్రాహ్మణుని సమ్మతితో జరిగినదికాదు. బ్రిటిషు పూర్వ మధ్య యుగములో బ్రాహ్మణుల ద్విజ ప్రభుత్వములు నశింపగా తరువాత వచ్చిన ద్విజేతరులగు మహమ్మదీయ, బ్రిటీషు రాజుల పరిపాలనముచే వందల కొలది సంవత్సరములలో జరిగిన క్రమ పరిణామము.

60. అష్టాదశ మహా పాపియగు శంకరుని బ్రాహ్మణ మత పునరుద్ధారణ కాలమునకు పూర్వము 1300 సంవత్సరములు శూద్రులనబడువారు సౌఖ్యముతో నుండిరి. శంకరుడు శూద్రులనబడువారిని ఇతరులను అనేక వేలమందిని గానుగలలో ఆడించి (ఈ విషయము శంకర విజయ ధ్వజము అను గ్రంథములో స్పష్టముగా వ్రాయబడియున్నది) నాశముచేసి మరల బ్రాహ్మణ మత స్థాపనము

చేసి దేశమునకు విషము పోసెను. (ఈ భావమునే సుమారు 10 సం॥ ల క్రిందట హిందూదేశ సంచారము చేసిన చీనా దేశ బౌద్ధ సన్యాసికూడ వెల్లడించెను.)

61 బహుశః శంకరుని ఈ బ్రాహ్మణ మత పునరుజ్జీవన కాలము శూద్రులనువారికి పంచములనువారికి చాల ఘోరమగు కాలము. అతడు అయిదు భిన్న ప్రదేశములలో అయిదు అష్టాదశ మహా పాపుల పీఠములను స్థాపించి వర్ణ ధర్మములనువానిని అతిక్రమించిన వారికి ఘోర శిక్షలు విధించెను.

62. శంకరుని బ్రాహ్మణమత పునరుజ్జీవన కాలము నుండి మహమ్మదీయుల హిందూదేశ పరిపాలన ప్రారంభ కాలమువఱకు వ్యాపించిన మధ్యయుగములో శూద్రు లనువారు పంచములనువారు అనుభవించిన కష్ట పరంపరలకు మితి లేదు. ఆర్య సంప్రదాయమునకు చెందిన క్షత్రియరాజుల మధ్యను, ద్రావిడ సంప్రదాయమునకు చెందిన రెడ్డి, మొదల్యారు, వెల్లాల, పటేలు, కమ్మ మొదలగు ద్విజేతర రాజుల మధ్యను, ఎవరు హెచ్చు, ఎవరు తక్కువ అను స్వల్ప సమస్యపై ఘోర యుద్ధములు చాల జరిగెను.

63. భారతభూమిని శూద్రరాజులు ఏల వచ్చునా ? ఏలవలసినది క్షత్రియులు కాదా ? అను వ్యర్థ సమస్య చాల ప్రధాన సమస్య మైనది. "రాజా సర్వస్యేష్టే బ్రాహ్మణ

వర్జం” “రాజు బ్రాహ్మణులకు తప్ప తక్కిన వారికే రాజు” అను సూత్రము ప్రాధాన్యము వహించెను. అందుచే బ్రాహ్మణత్వము దేశములో ప్రధాన శక్తియై అడ్డులేని బలమాయెను. అందుచే వర్ణ ధర్మ మనబడు దుష్ట ధర్మము శాసనమై వర్ణ వృత్తులనబడు వానిని తప్పిన వారికి ఘోర శిక్షలు విధింపఁబడుచు వచ్చెను. మఱి బ్రాహ్మణులనబడువారు వారి వర్ణ ధర్మమును తప్పినను మఱి యేమి చేసినను తప్పు పట్ట సాహసించినవారు లేరు. శంకర బ్రాహ్మణ మత పునరుద్ధారణ కట్టుబాట్లచే బ్రాహ్మణ పీఠములలో భూదేవతలను భ్రాంతిచే వారికిచ్చు ధనరాసులచే బలిసిన బ్రాహ్మణ సమూహములు సర్వ హిందూ దేశమునందును బ్రాహ్మణ రాజ్య వ్యాప్తిని గావించిరి. మఱియు అది సర్వ హిందూ దేశ సంఘమై వారి దుష్ట సిద్ధాంతముల బోధల ఫలితముగా భూమికి దేవత లను భావము వ్యాపించెను. అందుచే అప్పటి కాలములో ఉన్న క్షత్రియేతరులగు రాజులు బ్రాహ్మణేతరులు పరస్పరము రాజీపడి శూద్రులనబడువారి రాజ్యములలో బ్రాహ్మణు లుండరాదను వాదమును బ్రాహ్మణులు, బ్రాహ్మణుల దుష్ట వర్ణాశ్రమ పద్ధతిని అనుసరింతుమని ద్విజేతర రాజులు రాజీపడిరి. ఇది శూద్రులనువారి 18 జన్మహక్కులు అనగా బ్రాహ్మణ ధర్మము అనుష్ఠించు హక్కు ii బ్రాహ్మణ కన్యను వివాహమాడు హక్కు మొదలగునవి (చూ. అనుబంధము 9) పోయి “భుక్తశేషము” అనగా బ్రాహ్మణులు తినగా మిగిలిన అన్నము తినుట మాత్రమే ప్రతిఫల

ముగా గలిగిన (చూ. ఉచ్ఛిష్టాశనం॥ గౌతమ ధర్మ సూత్ర ములు 2-1-61) బట్టలుతుకుట, పశువులను గాయుట, ఇంటి పనులు చేయుట మొదలగు నీచ సేవను (పరి చర్యా త్మకం కర్మ శూద్ర స్యాపి స్వభావజం భగవద్గీత చూ.) చేసి జీవింప వలసిన వారైరి.

64. తరువాత మహమ్మదీయ పరిపాలనము వచ్చి సనాతను లనబడువారి వర్ణ ధర్మముల వ్యాప్తి తగ్గెను. మహమ్మదీయులు అష్టాదశ మహాపాపులగు బ్రాహ్మణుల వర్ణ సిద్ధాంతములను అమలులో పెట్టలేదు. అందుచే ఈ కాలములోను తరువాత బ్రిటిషువారి పాలనములో 1757-వ సం॥రం మొదలు నేటి వఱకు షుమారు 190 సం॥ల కాల ములోను శూద్రు లనువారు సుఖ స్థితికి వచ్చి భూములు గృహములు, ధన, ధాన్యములు సంపాదించిరి.

65. ఈ నవీన బ్రిటిషు యుగములో శూద్రులను వారు తమ శరీర కష్టముచే భూములు సంపాదించి సొంతవ వ్యవసాయ పద్ధతులచే పాడి పంటలు కలవారై, సుఖస్థితిలో ఉండియు అష్టాదశ మహాపాపులగు బ్రాహ్మణుల వర్ణ ధర్మ సిద్ధాంతముల బారి నుండి తప్పించు కొనఁజాలరైరి. ఏల అనగా భారత భాగవత రామాయణాది గ్రంథములలో ప్రతి మూడవ పుటలో ఆదుష్ట వర్ణ ధర్మమే బోధింపఁబడినది. వారిలో చదువు కలవారు వానినే పఠింపవలయును గదా ? మఱియు బోధనవృత్తి (గతించిన నలువది ఏండ్లలో కొలది

మార్పు చెందినను) ఇప్పటికిని వారి చేతులలోనే యుండెను. మఱియు అర్చకులు, పురోహితులు, ఇతర శ్రోత్రియులు మఱియు ప్రభుత్వోద్యోగులు బ్రాహ్మణులై రోజునకు 24 గంటలు వర్ణ ధర్మ బోధలనే చేయుచుండిరి.

66. గ్రామ గ్రామములోను పురాణశ్రవణములో బ్రాహ్మణ కథకుడు వర్ణ ధర్మమునే బోధించును. గ్రామములో శ్రోత్రియుడు వేదములు చదివి అదియే యీశ్వర ధర్మమని చెప్పును. వర్ణ ధర్మము అష్టాదశ మహాపాపుల ధర్మమని చెప్పు సద్బ్రాహ్మణ సిద్ధాంతము చిరకాలము క్రిందటనే నశించినది. అందుచే ఆధ్యాత్మిక, రాజకీయ, మత విషయిక భావములలో శూద్రులనువారు అష్టాదశ మహాపాపి యగు శ్రీరాముని కాలమునాటి భావముతోనే ఉండి శాసన సభలలో మఱి యితర రాజ్యాంగ పరిపాలన విషయములలో తమకు ప్రమేయము లేదని ద్విజులకవి ప్రత్యేక కృత్యము లని నమ్మిరి.

67. అందుచే మన మిప్పుడు 1946–వ సం॥రంలో హిందూ సంఘము వంక దృష్టిని ప్రసరింపజేసి సింహావలోకనము చేయుదుమేని హైందవ జీవితాంత రిక్షమునందు మాళవ్యాలు, సప్రూలు, నెహ్రూలు, ముఖర్జీలు, చటర్జీలు, పంతుళ్ళు, అయ్యరులు, అయ్యంగార్లు, శాస్త్రులు, పంతులు సర్వ హిందూ దేశములోని మంత్రిత్వములు,

శాసన సభ్యత్వములు, [redacted]మెంటరీ కార్యదర్శిత్వములు, స్వదేశ సంస్థానాదుల దివాన్జీ పదవులు మఱి యనేక విధ ములగు దేశమును శాసించు కేంద్రి, రాష్ట్రీయ పదవులు అన్నియును (2) హిందూదేశములో అన్ని రాష్ట్ర ములలో వ్యష్టిగా జూచినను సర్వ హిందూదేశ దృష్టితో జూచినను సర్వ రాజకీయ పక్షములు అనగా కాంగ్రెసు, హిందూ మహాసభ, ఆల్ ఇండియా రేడికల్ డెమాక్రాటిక్ పార్టీ, కమ్యూనిస్టు పార్టీ, ఆల్ ఇండియా లిబరల్ పక్షము, సోషలిస్టు పార్టీ వగైరా అన్ని పక్షములు, మఱియు అసంఖ్యాకములగు కార్మిక సంస్థలు, సమాహారములు వగైరాలును (3) ప్రజాభిప్రాయమును రాష్ట్రములోను సర్వ హిందూ దేశములోను నడుపునట్టి "అమృతబజారు పత్రిక" "హిందూ" "హిందూస్థాన టైమ్సు" మొ॥ ఆంగ్ల స్వభాషా దిన పత్రికలు (4) బ్రాహ్మణులచే లేదా ద్విజులచే స్థాపింపబడి ఉచ్ఛ స్థితికి వచ్చిన యున్నతములగు బ్యాంకులు ఇన్‌ష్యూరెన్సు కంపెనీలు వగైరాలలో ఏబది రూపాయలకు లోబడిన ప్యూను వగైరా నీచ స్థానములు తప్ప తక్కిన అన్ని స్థానములును (5) సంవత్సరమునకు ఏబది వేలు లక్ష ఆదాయము కల్గిన (అందు నూటికి 95 పాళ్లు చొ॥ బ్రాహ్మణేతరుల నుండి వచ్చుచున్నను)గొప్ప కాఫీహోటల్సు, భోజన గృహములు, భోజన వసతి గృహములలో పాత్రలు కడుగు నీచ స్థానములు తప్ప తక్కిన ఫలహార భోజన దాతృ స్థానములు వగైరాలు అన్నియు (6) డిస్ట్రిక్టు

కో-ఆపరేటివు బ్యాంకులు రాష్ట్రీయ కో-ఆపరేటివు బ్యాంకులు, ఇతర సహకార సంస్థలు స్వాధీనము చేసికొని మేనేజర్లు, సెక్రటరీలు, వగైరా అన్ని ప్రముఖ స్థానములును (7) అర్ధ ప్రభుత్వ శాఖలగు జిల్లా బోర్డులు, మ్యునిసిపాలిటీలు, ఇంజనీరింగు డిపార్టుమెంటు వగైరాలలో అన్ని ప్రముఖ స్థానములును, గుమాస్తా స్థానములును (8) కాలేజీలలోను హైస్కూళ్ళలోను అన్ని అధ్యాపక స్థానములును, ఇతర ముఖ్య స్థానములును, బ్రాహ్మణుల చేతిలో నున్నవి. ఇట్లు సర్వ హింధూ దేశములోని సర్వ ప్రభుత్వాంగస్థానములు, ఇతర సంస్థల ఉద్యోగస్థానములు, గుమస్తా స్థానములు గౌరవార్థములగు పౌరోహిత్య, అర్చకత్వ స్థానములును చేతిలో నుంచుకొని సర్వ హిందూదేశ రాజకీయ, ఆధ్యాత్మిక మత విషయిక జీవనమును ప్రత్యక్షముగాను, పరోక్షముగాను కంట్రోలు చేయుటయే గాక వ్యక్తి జీవితములలో కూడ వేదోక్త పద్ధతిని నిషేధించి జన్మసిద్ధి కొఱకు ఆ పద్ధతితో బ్రహ్మపూజ, అతిధి పూజ ఇత్యాదులుకూడ బ్రాహ్మణేతరులు సల్పకుండునట్లు చేసి బ్రాహ్మణేతర సంఘమును సర్వతో ముఖ నాశము చేసినది.

68. చాల నాజూకుతో కార్య కలాపములు ముగించు బ్రాహ్మణ దిన పత్రికల కార్య నిర్వహణము మఱియు చమత్కారమైనది. కొన్ని ఆంగ్ల, స్వభాషా పత్రికల వార్షికాదాయము రెండు మూడు లక్షలకు మించి యుండును. వాని పత్రికల అమ్మకములయు ప్రకటనలయు

ఆదాయమును గణించినచో నూటికి తొంబదియయిదు పాళ్లు బ్రాహ్మణేతరులనుండియే వచ్చును. అయినను పత్రికాధిపత్యము, పత్రికల నమ్మకపు ఏజన్సీలు, ప్రపంచములో నాల్గు మూలల వ్యాపించిన ప్రతినిధి వర్గము, ఇట్లు వేలు వందలు లాభములు కల అన్ని గొప్ప పదవులు బ్రాహ్మణులకే సంక్రమించుచున్నవి. మఱి బ్రాహ్మణేతరుల కిచ్చు స్థానములు బ్రాహ్మణులు చేయజాలని కంపోజింగు, మెషీన్లు నడుపుట, ఉత్తరములు జారీచేయుట, గేటు, ఆఫీసుకాపలా కాయుట మొదలగు స్వల్ప వృత్తులు.

69. కాశీ, బృందావనము, రామేశ్వరము, తిరుపతి మొదలగు సర్వ పవిత్ర స్థలములందును హిందూ దేశములో ఏడు లక్షల గ్రామములలో కల ఇతర సాధారణ దేవాలయము లందును అర్చకులు మఱి వానికి సంబంధించిన పెక్కు గౌరవ పదవులు బ్రాహ్మణులవే.

70. సత్రముల మేనేజిమెంటు ప్రత్యేక చరిత్ర. వాని నిర్మాణములో నూటికి 95 పాళ్లు బ్రాహ్మణేతరులే భరింతురు. కాని, ప్రత్యేకపు గదులు మంచి వసతిగల భాగములు బ్రాహ్మణులకు. మఱి, బ్రాహ్మణేతరులకో వానిలో ప్రవేశార్హతకూడ ఉండదు. వసారాలలోను, ముఱికి భాగములలోను వసతి నొసంగుట గొప్ప ప్రసాదము. ఇంక బ్రాహ్మణుల సొంత సత్రములలో బ్రాహ్మణేతరులకు గడప త్రొక్కుటకుఁగూడ వీలుండదు.

71. చాల సౌకుమార్యముతో నడపు కాంగ్రెసు రాజకీయముల చాణక్యనీతి మఱియు చిత్రమైనది. రాష్ట్రీయ శాసన సభలను విలోకించితిమేని అసెంబ్లీలలోను, కౌన్సిళ్ళ లోను కలిసి నాల్గవ వంతు బ్రాహ్మణులు. దేశములో వారివంతు నూటికి అయిదుపాళ్లు. ఇట్లు కేంద్రశాసన సభ లును, రాష్ట్రశాసన సభలును, బ్రాహ్మణ రాజకీయ వేత్తలవియైపోయినవి. బ్రాహ్మణేతరులలో స్వతంత్రులను వానిలో చేరనీయరు. బ్రాహ్మణ సిద్ధాంత దాసులయి "మీరు చెప్పిన దానితో ఏకీభవించుచున్నాను" అను టకు నేర్చిన వారికి ప్రథమ తాంబూలము. వ్యవసాయదా రుల ఎన్నిక వర్గములకు వానితో ప్రత్యక్ష శత్రుత్వముకల మిల్లు ఓనర్లు, ధాన్యములు కొనువారు ఎన్నుకొనబడుదురు. బ్రాహ్మణాభ్యర్థుల ఎన్నికలో అవలంబించు సిద్ధాంతము వేఱు. బ్రాహ్మణేతర అభ్యర్థులఎన్నికలో అవలంబించు సిద్ధాం తము వేఱు. బ్రాహ్మణుల విషయములో (1) తక్కువ కాంగ్రెసు సర్వీసు (2) శాసన సభా కార్యనిర్వహణ దక్షత లేమి (3) వయసులో చిన్నతనము (4) ఎన్నిక వర్గమువారి ఆదరణ లేమి, (5) తక్కువ విద్యాసంపద (6) ధనాభావము యిత్యాదు లేవియు అడ్డురావు. బ్రా హ్మణేతరుల విషయములో ఈ అన్ని విషయములలోను ఆధిక్య మున్నను లాభము లేదు. మంత్రిత్వములలో కనీ సము మూడవ వంతు బ్రాహ్మణులు తీసుకొనవలసినదే. పార్ల మెంటరీ సెక్రటరీలలోను అంతకుఁదగ్గని భాగము వారివే.

దేశములో వారి వంతు నూరింట యిర్వదియవపాలు కూడ లేదు. బ్రాహ్మణేతరులలో ఈ గొప్ప పదవుల విషయములో గణింపబడు అర్హతలు (i) దుర్బలత్వము (ii) చెప్పిన మాట వినుట (iii) స్వతంత్రాలోచన లేమి (iv) చేయుమన్నపని చేయుట. ఇట్లు 55 లక్షల భూములకు చెందినదియై ఏబదియైదు లక్షల జనుల జీవనోపాధితో సంబంధించిన యినాముల విషయములో బ్రాహ్మణేతర రైతుల గొంతు కోయుటకు ధర్మభిన్నముగా, కాంగ్రెసు ధర్మమునకు విరుద్ధముగా ఇనాములు ఎస్టేట్లలో నుండి తొలగించు 1937–వ సం॥రపు ఎస్టేటు ల్యాండు ఆక్టు కమిటీ రిపోర్టులో బ్రాహ్మణేతర సభ్యులు సంతకములు పెట్టుట వీరి యర్హతల విషయములో బ్రాహ్మణ నాయకులు పరిశీలించు యోగ్యతల స్వరూపమును ప్రపంచమునకు చక్కగా వెల్లడించుచున్నది. మహాత్ముని పేర లోక ప్రసిద్ధముగు కాంగ్రెసు పేర ఇనాం రైతులకు కాంగ్రెసు బ్రాహ్మణులలో చేసిన ద్రోహమును ప్రజల యసమ్మతికి పాల్పడిన జస్టిసు పక్షము కాని, బ్రిటిషు ప్రభుత్వ ప్రతినిధి యగు మద్రాసు గవర్నరుకాని చేయ సాహసించ లేదు. బ్రాహ్మణేతర అభ్యర్థుల విషయములో (1) వారు చేసిన దీర్ఘ కాల సేవ (2) ఎన్నిక వర్గము వారి ప్రేమకు హెచ్చుగా పాత్రుఁడై యుండుట (3) హెచ్చు విద్యా సంపద (4) హెచ్చు వయస్సు (5) హెచ్చు పరిజ్ఞానము కల్గి యుండుట (6) హెచ్చుగు దేశసేవా నిరతి (7) హెచ్చుగు

ధర్మ సూక్ష్మజ్ఞత వీని నన్నిటిని త్రోసి వేసిరి. భారత దేశములోని బ్రిటిషు ప్రభుత్వమువారు అప్పు డప్పు డుల్లంఘించు "దీర్ఘ సేవార్హత" ను వేయి ప్లాటుఫారముల మీద తిరస్కరించిన కాంగ్రెసు యోధు లిట్టి ఘోరాన్యాయములను కాంగ్రెసు సేవకుల విషయములో చేయుట నిస్సమానమగు ఘోరము. బ్రాహ్మణ నాయకులు విజాతీయులు (చూ. బ్రాహ్మణుడు విజాతీయుడు కాదా?). మఱి బ్రాహ్మణేతరులో ఆర్య బ్రాహ్మణులురాక పూర్వము నుండియు గడ్డమీద నివసించుచున్నవారు. అట్టి వారి గొంతు కోసి (i) వయసులో (ii) కాంగ్రెసు సర్వీసులో (iii) విద్యా విషయములో (iv) ఎన్నిక వర్గమువారి యభి రుచి చూరగొనుటలో (v) వారి సేవచేయుట కెక్కువగా తగి యుండుటలో మఱి పెక్కు అర్హతలలో కొఱవడియున్న బ్రాహ్మణ బాలురను కేంద్ర, స్థానిక శాసన సభల సభ్యత్వార్హులని సర్వ విధముల తగిన బ్రాహ్మణేతరులన నర్హులం జేసిన ఘట్టములు సర్వ హిందూ దేశ దృక్పథము నుండి విమర్శింపవలసినవి. త్వరలో నవి ప్రచురింపబడును.

73. దేశములో సర్వోన్నతి నందిన రాష్ట్రీయ కాంగ్రెసు సభలయు, డిస్ట్రిక్టు కాంగ్రెసు సభలయు విషయము పరిశీలింతము. వీనిలో సర్వ ప్రధాన స్థానములు బ్రాహ్మణులకు లేదా బ్రాహ్మణత్వ పిశాచో పాసకులగు బ్రాహ్మణ దాసులకుబోవును. ఎప్పుడైనను రాష్ట్రీయాధ్యక్ష స్థానము బ్రాహ్మణేతరులకు పోవునేని అందుకు కారణము

ఉండును. కొందఱు బ్రాహ్మణాధ్యక్షులు రాష్ట్రీయ సభలయు జిల్లా సభలయు ఆదాయములు ఖర్చుపెట్టిన విధానమును పరిశీలించితిమేని వారి అక్కౌంటులేని మోటారుల ప్రయాణములు సాదరు ఖర్చులు వగైరాల క్రింద వ్రాయబడిన—విచిత్రములగు అక్కౌంట్లు వారి చిత్రరాజకీయ జీవనమును వెల్లడించును.

74. అందుచే గొప్ప సుగుణ సంపత్తికాని, గొప్ప అర్హతకాని బ్రాహ్మణుల శాసన సభ్యత్వ, సర్వహిందూ దేశ రాష్ట్రీయ మండల కాంగ్రెసు కార్య నిర్వాహకవర్గ సభ్యత్వాది అర్హతలకు హేతువులు కావని వెల్లడి యగును. ఆ యర్హతలు—(బ్రాహ్మణేతరుల విషయములో బ్రాహ్మణులు చెప్పిన దెల్ల అంతరాత్మను జంపుకొని చేయుట;— బ్రాహ్మణుల విషయములో తదితరులను బ్రాహ్మణసంఘ దాసులనుగా జేయుటలో గల నేర్పరి తనము.

75. ఆర్థికముగా స్వయంపోషకముగా ఉండియు ఏల శూద్రు లనబడువారు ఈ ఘోరస్థితిని 1750–వ సం॥ము నుండి నేటి వఱకు వర్ణాశ్రమ ధర్మపాలనము అంతగా అమలులో లేని ఈ బ్రిటిషు యుగములో కూడ ప్రతిఘటింపజాలరైరి ?

76. 1850 మొదలు 1920 వఱకు 70 సంవత్సరముల కాలము బ్రాహ్మణేతరులు శంకరుని పునర్బ్రాహ్మణ

మతస్థాపనము మొదలు వేయేండ్ల నుండి అనుశుత్రిణముగా రాజ్యపాలనము, ప్రభుత్వోద్యోగములు చేయుట మొదలగు రాజకీయ విషయములు "జందెపుపోగులవారివే"యని, వారు తమ్ము నాశము చేయువారయినను తమ పుత్రులని భావించి—యొక విధమగు రాజకీయమగు మత్తులో నిద్రించిరి.

77. ఈ కాలములో శూద్రులనువారికి భూము లుండరాదు, ఆస్థి యుండరాదు "అను నిట్టి యష్టాదశ పాపుల దుష్ట సిద్ధాంతములు ఆచరణలోనికి రాకుండుటచే భూములు ఆస్తులు సంపాదించుకొని బాగుపడిరి. కాని రాజకీయ జీవనములో వేయేండ్ల కాలములో అష్టాదశ మహాపాపులగు బ్రాహ్మణులు వారి మెదడులలోని రాజ కీయ, సాంఘిక, మత విషయిక పరిజ్ఞాన నిర్మాణము చేయు భాగములను చితుకగొట్టి ధ్వంసము చేయుట చేతను, అట్లు ఆ మస్తిష్క భాగములు చీల్చివేయబడి పెక్కు శతాబ్దముల నుండి శూన్యములుగాచేయబడినవను విషయమును—మనుజ కోటిలో నూటిలో 90 మందిలో "హుక్ వర" మను పురువు లుండి వారిని పీల్చి పిప్పిచేయు చున్నవను విషయమును నేటివఱకు తెలిసికొనజాలనిరీతిగనే—గ్రహింపరైరి. మఱియు శూద్రులనువారి భారత, రామాయణ పరిజ్ఞానము ప్రతి మూడవ పుటలోను బ్రాహ్మణులను బుద్ధి పూర్వకముగా ఈశ్వరులను వలె పూజించు చుండుడనియే వారికి బోధించు చుండెను.

78. వీనికితోడు కోటిసంఖ్యాకముఖమై కరణములుగను, పురోహితులుగను, అర్చకులుగను, ప్రభుత్వోద్యోగులుగను, శ్రోత్రియులుగను, సర్వహిందూదేశమునందును వ్యాపించిన ఆ బ్రాహ్మణ విష సర్పము "శూద్రుడా! పంచముడా! మీరు పాపముచే ఈ జన్మలనందితిరి. మీకు ఈశ్వర వర్ణ ధర్మ ప్రకారము రాజకీయ, సాంఘిక మత విషయిక హక్కులు లేవు. అవి బ్రాహ్మణుని (ద్విజుని) హక్కులు అని బోధింపసాగెను. మఱియు ఆకాలములో ఇంకను శాసన సభలు, తాలూకా, జిల్లా బోర్డులు మునిసిపాలిటీలు ప్రజా పరిపాలితములు కాలేదు. గవర్నమెంటువారి క్రిందనే యుండెను. అందుచే వానిలో తరిఫీదు నందుటకు అవకాశములు కూడ లేవు.

79. ఈ సందిగ్ధ స్థితులలో చాల ఆలస్యముగా జస్టిసు పక్షము పరిహాసకర సందర్భములలో జన్మించినది. ఏల అనగా "బ్రాహ్మణుడు అష్టాదశ మహాపాపియై యితరుల 18 జన్మ హక్కులను హరించినట్టి యీశ్వర మానవ ద్రోహము చేయు జందెపు దొంగ" అను భావము దేశములో లేక పోగా భూదేవుడను భావము ప్రబలి యుండెను. వారి పత్రికలే హిందూ దేశములోని సాంఘిక, రాజకీయ, మత విషయిక జీవితమును నిర్మించు మహాశక్తిగా ప్రబలెను. బ్రాహ్మణత్వ విష సర్పము శూద్రపంచములను వారిని పీల్చి పిప్పిచేయు క్రిమవిధ్వంసక మగు దుష్ట జంతువని ప్రజలు గుర్తింపరైరి.

పీనికితోడు జస్టిసు పక్షము స్వరాజ్య సిద్ధికొఱకు బ్రిటిషు ప్రభుత్వముతో పోరాడుటకు బదులుగా వారి పక్షమున చేరి ద్విగుణముగా పరిహాస పాత్రమైనది. అందుచే బ్రాహ్మణుడు తాను శూద్రుడై జన్మించియు, బ్రాహ్మణత్వము నందుచు తన కన్యను శూద్రులనువారు వివాహము చేసికొనరాదని, శూద్రులనువారి కన్యలను దాను పెండ్లాడఁదగుదు నని స్త్రీల గౌరవ విషయములో గూడ ఈ ద్విజేతర జాతుల నవమానించుచు వేద, తపోనిషేధాదులు, గర్భాలయ స్వయంపూజా నిషేధము ఇంతయేల దృష్టి దోషము స్పర్శదోషమును గూడ పాటించుచు గోవులు, గేదెలు మొదలగు జంతువుల కంటెను నీచముగా చూచి అగౌరవించుచు మఱియు తాను బోధించు జాతీయతకు భిన్నముగా అర్చకత్వమును నిషేధించుచున్న అష్టాదశ మహా పాపియని నిరూపించి ధర్మయుద్ధము చేయగల శక్తి జస్టిసు పక్షమునకు లేకపోయినది. అందుచే ఎవరికొఱకు అది పోరాడ నెంచెనో ఆ శూద్రులనువారు కూడ ఆపక్షమును నిందించిరి.

80. మఱియు ఆ జస్టిసు పక్షము సంస్కృత భాషలో ఉన్న వేదములయు, ఉపనిషత్తులయు, గీతలయు ప్రక్షిప్త రహితములగు సత్యమూలములకు దుర్వ్యాఖ్యలు వ్రాసి తాము శూద్రులయి జన్మించి ఉపనయన సంస్కారముచే బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులయి దేశమునకు మహా ద్రోహమును జేయు చున్న "జంధెపు పోగుల దొంగ" లగు ద్విజుల మోసమును రాజకీయ, ఆధ్యాత్మిక, సాంఘిక,

మత విషయిక భావములను తమ భౌతిక, మానసిక స్వరూపమగు మనోమయకోశమునందే—మనశ్శాస్త్రవేత్త తన పరిశోధనలో కప్ప మొదలగు చిన్న జంతువుల విషయములో చేయునట్లు—శస్త్రము చేసి, నాశము చేయుట చేతను సంస్కృతము బ్రాహ్మణ భాషయై ద్రావిడులగు తమకు బోధింప బడని దగుటచే ఆ గ్రంథముల మూలములలో ఉన్న విషయముల నెఱుగుటకు అవకాశము లేకయు బ్రాహ్మణ ధర్మ అనుష్ఠాన నిషేధాది 18 నిషేధములు అష్టాదశ మహాపాపులగు బ్రాహ్మణుల దుర్వ్యాఖ్యల ఫలితములని గ్రహించుటకు వీలు లేకపోయినది. ఏల అనగా ఆ 18 నిషేధములు (1) దేవుడు (2) వేదములు (3) వర్ణములు, ఆశ్రమములు ఇత్యాది మత సంస్థలు (4) ఆచారము (5) సనాతన ధర్మము (6) ధర్మ శాస్త్రము (7) సంస్కృతము అను అభేద్యములగు ఏడు తెరల మాటున దాచి పెట్టబడి యుండుటచే యూహించియైన ఎరుగరు. (అష్టాదశ మహా పాపియగు బ్రాహ్మణునితో సాహాయ్య నిరాకరణ మొనర్పుము. 1–9 పుటలు చూ.)

81. ఈ విషయ వివేచనకు తగినంత పాండిత్యము జస్టిసు పక్ష నాయకులకు లేదు. ఏల అనగా "భాష్యములు" అని చెప్పబడు దుర్భాష్యములకు సద్వ్యాఖ్యలు చేసి అష్టాదశ మహాపాపుల దుర్వ్యాఖ్యలు తొలగించి సద్బ్రాహ్మణత్వమును సర్వ లోకమునకు ప్రసాదించుటకు అపార

సంస్కృత జ్ఞానమును, దేశములో వ్యాప్తిలోఉన్న దుర్భావ ములను ప్రతిఘటించి పోరాడుదీక్షయు ఉండవలెను. అందుచే వారికా విషయము రుచింపలేదు. బహుశః తోచలేదేమో! శూద్రులనువారికి సామాన్య సంస్కృత జ్ఞానమును కూడ బ్రాహ్మణులు నేర్పరు. అందుచే చాల ప్రాథమికములగు రఘువంశ కుమార సంభవము లర్థము చేసికొను పాండిత్యమే వారిలో వ్రేళ్లమీద లెక్కించదగినంతమందిలోనే యుండును.

82. "బ్రాహ్మణ ధర్మ అనుష్ఠానము ఎప్పటి కిని ఎవరికిని హక్కు లేని తమ సంఘము యొక్క శాశ్వత ప్రత్యేక స్వత్వము" అను అష్టాదశ మహా పాపుల దుష్ట సిద్ధాంతమును ప్రతి ఘటించి అది "భూలోకములోని సర్వ జనులకు తనతో ఐక్యమై మోక్షమందుట కీశ్వరుడు ఒసంగిన ఆత్మ పవిత్రీకరణ ధర్మము" అను సత్య సిద్ధాంతము భారత భూమిలో ఎచ్చటను లేదు. అట్టి సిద్ధాంతము అమలులో ఉన్నచో బ్రాహ్మణేతరులను ఈశ్వరుని పేర, వేదముల పేర ధ్వంసము చేయుచున్న అష్టాదశ మహా పాపుల సిద్ధాంతమును అది ప్రతిఘటించి నాశము చేసి యుండును. "బ్రాహ్మణ మతము, అష్టాదశ మహాపాప భూయిష్ఠమును, అవినీతికరమును, దైవ విరుద్ధమును, అగు పాప మతము; మఱియు రాక్షస మతము" అను సిద్ధాంతము కన్ననూరు సెంట్రలు జైలులో 1930–వ సం॥ములో తొలుత ఈశ్వరుని ప్రబోధముచే జన్మించెను. అనగా (1) ఈమతకర్త 120 మంది నుండి చీల్చబడి ముప్పది నలువదిమంది కల యొక

సమూహములో కన్ననూరు జెయిలుకే వెళ్ళుట (2) ఈ సమూహము తోడనే వేదపాఠమును నేర్పిన డాక్టరు మల్లపరాజుగారు కూడ ఆ జెయిలుకే పంపబడుట. (3) వేద పఠనమును కోరి పట్టుదలతో అభ్యసించిన శ్రీ గొల్లపూడి సీతారామ శాస్త్రిగారు మద్రాసునకు పంపబడియు మరల ఈ కన్ననూరు జెయిలుకే ట్రాన్సుఫరు అగుట (4) ఆయన ఈ మతకర్తకు కల్గిన సహజ వాంఛకు ప్రోత్సాహము కలిగించుట (5) ఈ వేదపఠనముచే ఈ మతకర్తకు 18 బ్రాహ్మణుల నిషేధములు మూలపాఠములలో లేని అష్టాదశ మహాపాపుల దుర్వ్యాఖ్యలుగా చక్కగా బోధపడుట (6) ఆ మల్లపరాజుగారి పాఠమునే గాక చాందోగ్యోప నిషత్తులో ఒక శూద్రుడు బ్రాహ్మణుడుగా మార్చఁబడిన ఘట్టమును జదివి బ్రాహ్మణత్వము అందఱు శూద్రులకు గల జన్మ హక్కను సత్యమును తెలియుట (7) అన్నిటికంటెను చిత్ర విషయ మేమి అనగా 120 సత్యాగ్రహులను కోరాపుట్టు, తిరుచునాపల్లి, కడలూరు, కన్ననూరు మొదలగు జెయిళ్ళకు ట్రాన్సుఫరు చేయుగా ఏ కేరళ దేశమునుండి శంకరుడు బ్రాహ్మణ మతమును పునరుద్ధరించి బ్రాహ్మణేతరులను సర్వనాశము చేసెనో ఆ కేరళభూమిలోనే యీ సద్బ్రాహ్మణమత స్థాపనమునకు తగిన స్థితి గతులను భగవంతుడు ప్రసాదించుట (8) అను కారణములు కల్గి అందు ముఖ్యముగా ఈ కడపటి భావము సచ్ఛాస్త్రికి " శంకరుడు చేసిన అన్యాయమును తొలగింపుము " అని ప్రత్యక్ష బోధగా ఈశ్వరుడు

వెల్లడించినట్లు కండ్లకు కట్టినట్లునట్లు ప్రదర్శింప బడుటయు ఈశ్వర నిదర్శనములనుటలో సందేహము లేదు. (చూ. అష్టా దశ మహాపాపియగు బ్రాహ్మణునితో సాహాయ్య నిరాకరణ మొనర్పుము 1–9 పుటలు).

83. తరువాత ఈ సద్బ్రాహ్మణ సిద్ధాంతము 1931–వ సం॥ము ఫిబ్రవరి 15–వ తేదీని "రియల్ ఇండియన్ నేషనల్ కాంగ్రెసు పార్టీని" స్థాపించుటకు హేతువైనది. ఆ పక్షమే ఈవిన్నపమును తమ సమక్షము నందు నేడు ప్రదర్శించుటకు హేతువైనది.

84. ఈ విన్నపమును విచారించుటలో మీరు గమనింపవలసిన సర్వప్రధానమగు విషయ మేమి యనగా: ఇందు చెప్పబడిన బాధలను చెందుచున్న బ్రాహ్మణేతర సంఘము తమ బాధలను గుర్తించి యైక్య కంఠముతో ఈ భాధలను తొలగింపుడని యాందోళనము చేసినదా? అని కాదు. ఇందు చెప్పిన నిషేధములు, బాధలు ఆ సంఘమునకు కలవా? లేవా? ఉన్నచో అవి ఎట్లు పరిష్కరింపఁ బడవలయును? అను దృక్పధమునుండియే ఈ దృష్టితో జూచినచో యిందలి యనర్హతలు చాల శాస్త్రీయములును వెంటనే పరిష్కరింప దగినవి, వలసినవి యును.

85. లోగడ చెప్పినట్లు బ్రాహ్మణేతర హిందువులు బ్రాహ్మణుని ఘోర వినాశక పద్ధతుల వలన దారుణమగు

భౌతిక, మానసిక గాయములు పొందిరి. పరిశోధక మనశ్శాస్త్ర వేత్త ఒక జంతువును తీసికొని యొకసారి కుడిచేతిని, వేఱొక సారి ఎడమ చేతిని మూడవసారి కుడి కాలును నాల్గవసారి ఎడమ కాలును ఇట్లు మెదడులో ఉండి ఆ యా అంగము లను నడుపు ఆ యా మానసిక స్థానములను కోసి ఆ యంగ ముల చలనమును లేకుండ జేయును. అట్లే అష్టాదశ మహా పాపియగు బ్రాహ్మణుడు శంకర పునర్వ్యాఖ్యాన మత స్థాపన సమయము నందును అవసరము, అవకాశము కలిగినప్పు డెల్లను పిమ్మటి కాలములోను బ్రాహ్మణేతర హిందువుల మెదడులోని రాజకీయ, మత విషయిక, సాంఘిక భావ పరంపరలలో చైతన్యము కల్గించు స్థానము లను ధర్మ శాస్త్రముల పేర, మత గ్రంథముల పేర ఖడ్గ బలముతోను, ఘోర దండన పద్ధతులతోను వినశింపఁజేసి; మఱియు బ్రాహ్మణేతర హిందూ రాజులను విధ్వంసము చేసి ప్రజల సహజ వాంఛలను ఈ విషయములలో హరిం చెను. మఱియు పురాణముల మూలముగా గీతాదుల మీద వ్రాసిన దుర్వ్యాఖ్యల మూలముగాను మఱియు 750 వేల గ్రామములలోను తన జాతికి చెందిన పురోహితులు, అర్చ కులు, విద్యాబోధకులు వగైరాల దుష్ప్రచార మూలము గాను ద్విజసేవ చేయుటయే శూద్రు లనువారి జన్మ సాఫల్య కార్యక్రమ మని దాని కంటె వేఱుగా మోక్షమా ర్గము లేదని నమ్మునట్లు చేసెను.

86. దీని ఫలితము బ్రాహ్మణేతరులలో రాజకీయ స్పృహ నశించినది. తుదకు వారి కెట్టి గతికల్గిన దనగా తమ మీాద ఎంతశిస్తు భారము పడి తమ నెట్లు నాశము చేయుచున్నదో గుర్తింపరైరి. 1999 రూపాయల ఆదాయము గల యుద్యోగి ఇంకంటాక్సుతోసహా అన్నిశిస్తులను తప్పించుకొని సుఖజీవనము చేయుచుండగా అంత వార్షికాదాయముకల వ్యవసాయదారుడు నాలుగైదు వందల రూపాయల భూమి శిస్తును చెల్లింపవలసిన వాడగుచున్నాడు. (2) ఎప్పుడో తాతలకాలమునాటి భూమిశిస్తు విధానము—ఆనాటి స్థితి గతులు నేడు మారుటచే—మారవలసియున్నను మారక తన భూమిమీాద వచ్చు నికరాదాయములో దాదాపు నూటికి నలువది పాళ్లు, (యుద్ధ కాలములోని చాల హెచ్చు ధరల కాలమును 1931–వ సం॥పు చాల తక్కువ ధరలకాలమును విడిచినచో) హరించుచున్నది. (3) లోక రక్షకమగు వ్యవసాయముమీాద ఎట్టి పన్నులును ఉండ కుండుటకు తగిన కారణము లున్నను ఆ పవిత్ర వృత్తిని నాశముచేయు నంతటి పన్నులు తనను సర్వ నాశము చేయుచున్నను రైతుగుర్తింప డాయెను. (4) రైతులను సర్వనాశము చేసిన 1931–వ సం॥లో కూడ తగిన ఆందోళనమును రైతుచేసి మనుష్యుల జీవిత రక్షక మగు ఆహార సృష్టిచేయు తాను బస్తారు 2–4–0 కు ధాన్య మమ్ముటచే శిస్తులు చెల్లక నగలను భూములను అమ్ముకొని నాశమగుచుంటి ననియు అందుచే ధాన్యమును, బియ్యమును, నూకలను భారత భూమిలోనికి

ఇతరదేశముల నుండి రాకుండఁ జేయవలసిన దనియు, గవర్నమెంటునకు నచ్చఁజెప్పఁ జాలక పోయెను. (5) 1919–వ సం॥ములో కృష్ణా జిల్లాలో ఏర్పఱచిన ఘోరమగు కంట్రోలు (అది నేటి కంట్రోలు వలె తినువారికి లాభమును గలిగింపక కంట్రోలు ధర మీాద 3,4, రెట్ల లాభము పొందు నవకాశమును మిల్లు యజమానుల కిచ్చి రైతుల నోటిలోను, ధాన్యము తినువారి నోటిలోను మన్ను కొట్టినది. ఏల అనగా తినువారు నాల్గు రెట్ల ధరకే బియ్యమును కొని తినవలసిన వారైరి) వచ్చినను పునహో వ్యవసాయ కళాశాలా పండితుడు సర్ హారోల్డు స్టూయూర్టుమాన్ దానిని ఖండించి కంట్రోలును తీసివేయించు వఱకు ప్రభుత్వము వారితో చెప్పుకొనుటకు కూడ పూనరైరి. (6) 1936–వ సంవత్సరములో జస్టిసుపక్షము వారు ఈనాములు రైతులవి యని శాసనము చేసినప్పుడు అక్రమముగా అవి ఈనాందార్లవని టి. ఆర్. వెంకట్రామశాస్త్రి అధ్యక్షత క్రింద న్యాయమునకు విరుద్ధమగు వాదమును చేసి ధర్మమును అణగ ద్రొక్కుటకు ఈనాందార్లు ప్రయత్నము చేసి జయము పొందినను తమ ధర్మ వాదమును రాజ ప్రతినిధి యెదుటఁ బెట్టుటకు తగిన పంచాయితీని పంపుకొని పోరాడుటకేని యత్నింపరైరి. ఇట్లు బ్రాహ్మణేతర హిందువులు అష్టాదశ మహా పాపులగు బ్రాహ్మణుల దౌష్ట్య, హింసా క్రియల ఫలితముగా తమ రాజకీయ, సాంఘిక వాంఛలు నశింపగా ఇట్టి గొప్ప ఘట్ట

ములలో ఆత్మ రక్షణకు కూడ సరియగు ప్రయత్నములను జేయుటకు చాలని వారైరి.

87. బహుశః అష్టాదశ మహాపాపియగు బ్రాహ్మణునిచే ఒక వంకను, కమ్యూనిష్టు పక్షము, జష్టిసు పక్షము ఈ మొదలగు రాజకీయ పక్షములచే రెండవ వంకను తమ రాజకీయ చతురంగపు ఎత్తులలో ఒక పాచికగా స్వీకరింపబడి దినదినము నాశము పొందుచుండియు దానిని గుర్తింపజాలకుండుట కూడ ఈ సంఘము వారిని రక్షింపగల దక్షతగల వారి మనస్సును ఆకర్షింపదగిన విషయము. మహాత్మాజీ "జాతీయ జనకుని" స్థానమును వహించి బ్రిటిషు ప్రభుత్వముతోఁ బోరాడి (1) మహమ్మదీయులకు (2) క్రైస్తవులకు (3) సిక్కులు మొదలగు వారికి ఎవరికెంత స్థానము ఉండవలయునో అంతస్థానము నీయనెంచి స్వరాజ్యమును ఆర్జించెను. పైఁజెప్పిన జాతులవారు తమకు తమకు తగిన స్థానములను రాజ్యాంగ శాసనమునందు నిల్పుకొనుటకు తగిన పోరాటము చేయుచున్నారు. మఱియు వారి వారి స్థానములు సమిష్టి కుటుంబ సభ్యులలో ప్రతి వారికిని ఉండు హక్కులవలెనే లోకములో మనుష్యునకు మనుష్యునకు గల ధర్మశాస్త్ర సంబంధముల మూలముననే సహజముగనే; అవి. భిన్న భిన్న సంఘములగుచే నిర్వివాదముగా వచ్చును. మఱి పంచములు నేడు హిందూ సంఘములో ఆక్రమించుచున్న గౌరవ స్థానమంతయు మహాత్మాజీ తనంత తాను శ్రద్ధతీసికొని వారికి సర్వ

సమాన స్థితిని చేకూర్చుటకు చేసిన ప్రయత్న ఫలితమే కాని ఆ సంఘము (ముఖ్యముగా ఈ హరిజనోద్యమ ప్రారంభ దినములలో) తనంత తాను మేలుకొని యడిగిన కోరికల ఫలితము అనగా స్వప్రయత్న ఫలితము కాదు. మహాత్ముడు అంగీకృతిచే సర్వ హిందూదేశ జనకుడు. సమిష్టి కుటుంబము లోని జనకుడు నోరులేని 8 ఏండ్ల బాలుని వాంఛలను ఆ బాలుని యావదాస్తిని హరింపఁ జూచుచున్న పెద్ద కుమారుల హక్కులకంటె హెచ్చు శ్రద్ధతో రక్షింప బ్రయత్నించుట ఆయనకు తెలియనిది కాదు.

88. బ్రాహ్మణ బ్రాహ్మణేతర సమస్యను విచారింప వలసిన దృక్పథమిది. అష్టాదశ మహాపాపియగు బ్రాహ్మణుడు సర్వ హిందూదేశమును బలాత్కారముగా స్వాధీనము చేసి కొని శూద్రులనువారియు, పంచములనువారియు సర్వ రాజకీయ, ఆర్థిక, సాంఘిక మతవిషయి కౌన్నత్యములను నాశము చేసి తానే రాజ్యముచేయ కృతనిశ్చయుడాయెను.

89. అదృష్టవశమున ఎవరును కాదనరానంతటి దుస్థితిలో ఉండుటచే పంచములను వారి ప్రత్యేక స్వత్వము లను కాపాడు విషయము సర్వజనాంగీకృతినందినది. దానిని బ్రాహ్మణుడు కాదనఁజాలక యేదో ఒక విధముగా అంగీకరించెను.

90. "పాఱిపోయిన కుమారుడు" అను క్రీస్తు ప్రభువు కథను చూడుడు. తండ్రియొక్క విశ్వాసము నతడు

కోలుపోయెను. దూర దేశ మేగెను. అతడు పోయి తిరిగి వచ్చెను. కాని జస్టిసు పక్షము కాంగ్రెసులో చేరలేదు. (త్వరలో చేరుదురుగాక యని కోరుదము) ఆ పార్టీకి గల యావత్తు పలుకుబడికి తగినంత కాలము రాజ్యము చేసి పద భ్రష్టులైరి. వారి వర్తనములో నైతికమగు పునాది లేదు. ఏల అనగా త్యాగ రహితులు. మఱియు, స్వరాజ్యము నిచ్చుటకు సిద్ధపడని బ్రిటిషు ప్రభుత్వముతో చేరినవారు. కాని వారే దేశము కాదు. వారు ఎవరి కొఱకు పాటు బడు చుంటిమని భావించుచున్నారో ఆ ప్రజల కోరికలకు నైతిక మగు పునాది కలదు.

91. ఈ శూద్రులనఁబడు వారు 20 కోట్ల మంది కలరు. హిందూ సంఘములో నూటికి కనీసము 70 వంతు లుందురు. ఆస్తి దృష్టితో చూచినచో నూటికి 80 వంతులు వారిదే.

92. రైతుల సంఘములు వారికి కలవన్నమాట నిజమే. కాని, ఆ సంఘములు, వారు తమ సమస్యల సమగ్ర స్వరూపములను గుర్తింపరైరి. ఏల అనగా (1) కేంద్ర శాసన సభలలోను కేంద్ర ప్రభుత్వమునందును వారి కుండవలసిన స్థానములను (2) రాష్ట్రీయ శాసన సభల లోను, ప్రభుత్వములోను వారి ఉచిత స్థానమును (3) స్థానిక ములగు వ్యవసాయ దారుల సమస్యలను (4) అనగా ఇది వఱకే చాల హెచ్చు పన్నులచే బాధపడుచున్న తమపై

రోడ్డుపన్ను, విద్యపన్ను మొదలగు ఇతర శిస్తులు పడ దగునా ? (5) సర్వ హిందూదేశ దృష్టితో జూచినను అనగా భూమి శిస్తును ఏ సూత్రముల మీద వేయవలయును ? అనగా మహాకవి కాళిదాసుని కాలములో ' షష్ఠాంశముర్వ్యా ఇవరక్షితాయాః ' అనగా భూమిరాబడిలో 6-వ పాలుగాను, మొగలు చక్రవర్తుల కాలములో మూడవ వంతుగాను పరిణమించి బ్రిటీషు వారి కాలములో నేడు వరిభూముల మీద అయిదింట రెండు పాళ్లుగా ఉండుట న్యాయమా ? ప్రాచీన కాలపు శిస్తుల విధానము సంపూర్ణముగా తారు మారై యితర శిస్తు లనేకములు విధించుటకు అవకాశము కల్గిన ఈ తరుణములో ఇంత ఘోరమగు శిస్తు ఉండుట న్యాయమా ? (6) వ్యవసాయ వృత్తికి వ్యతిరేకులగు ధాన్య భోక్తలు, ధాన్య వర్తకులు మిల్లు యజమానులు వ్యవసాయదార్ల ఎన్నిక వర్గములకు ప్రతినిధులుగా ఎన్ను కొనబడుట కర్తవ్యాలా ? అను సమస్యలను చర్చించి తమ స్థానములను నిర్వహించుకొనుటకు పూనరైరి.

93. అట్లు గాక కులతత్వ దృష్టితో జూచినను శూద్రు లనఁబడు వీరు తమ పైని విధింపబడిన గర్భా లయ స్వయం పూజా నిషేధము, అర్చకత్వ నిషేధము ఇత్యాదులగు 18 నిషేధములను తొలగించుకొనుటకు యత్నమునే చేయరైరి.

94. కావున, బ్రాహ్మణేతర హిందువులు తమ రాజకీయ స్థానమును గుర్తింపమి తమకు కలుగుచున్న అనర్థ

పరంపరలను జక్కపెట్టుకొన నేరమి, తమ కవమానమును కల్గించుచున్న బ్రాహ్మణ విషసర్పముయొక్క 18 నిషేధము లను దొలగించుకొన జాలమి ఈ మొదలగు దుర్భర స్థితుల దృష్టితో జూచినను మహాత్మాజీ అధ్వర్యముక్రింద సర్వ హిందూ దేశములో అన్ని రాష్ట్రములందును బ్రాహ్మణేతర హిందువులు కాంగ్రెసునకు సత్యాగ్రహ యుద్ధములో తోడ్పడి విజయ వంతము చేసిరను దృష్టితో జూచినను వారి సమస్యలను పరిష్కరింపవలసి యుండును.

95. ఇంతేకాదు. వారి కాంగ్రెసు సేవ విషయ మటుండ దేశములోని వారి స్థానమే వారి కట్టి అర్హత నిచ్చును. ముస్లిము లీగు కాంగ్రెసుతో పోరాడు చున్నను వారి జన్మ స్వత్వములను గుర్తించి బహుశః అవసరము కంటె హెచ్చు స్థానమును ఒసంగుట లేదా? ఈ పద్ధతియే సరి. ఏల అనగా కాంగ్రెసు పిటీషను లేకుండ ఏ విషయమును విచారింపని కోర్టువంటిది కాదు. అది రాజకీయ సంస్థ అగుటచే స్వయం ప్రారంభముతో సర్వాంగములలోని లోపా లోపాలను బరిశీలించి చక్క బరపవలసిన బాధ్యత కలది. కావున అన్ని సంఘముల అర్హ స్థానములను కోరకయే రక్షింపవలయును.

96. బ్రాహ్మణేతర సంఘము మెజారిటీ సంఘము కావున రాజ్యాంగ శాసనములో రక్షణలు కోరరాదని వాదించుకారు కలరు. అది పొరబాటు వాదము. (1) చాల

సందర్భములలో మెజారిటీలు మైనారిటీలనుండి రక్షింపఁదగి యుండును. అమెరికా సాయము లేనిచో అధిక సంఖ్యా బలము కల చీనా మైనారిటీయగు జపాను చేతిలో నాశమై యుండెడిది. (2) 40 కోట్ల సంఖ్యగల భారతభూమి నాల్గు కోట్ల జనసంఖ్యగల బ్రిటనుచే ఓడింపబడి పరిపాలింపబడుట చరిత్రాంశము (3) ప్రకృతిలోకూడ అరణ్యములలో మేకలు గొఱ్ఱెలు, ఆవులు మొదలగు అధిక సంఖ్యా బలముకల జంతువులు, కొలది సంఖ్యకల సింహములచేతను, పులుల చేతను హింసింపఁ బడుచున్నవి. (సప్రూ కమిటీ వారికి పంపిన మా మెమోరాండము చూ.)

97. ఈ విన్నపములో సర్వత్ర మైనారిటీయగు బ్రాహ్మణులనుండి మెజారిటీయగు బ్రాహ్మణేతరులు రక్షణ పొందదగినవారను విషయమును (i) వీరి రాజకీయ (ii) సాంఘిక దైన్యస్థితి (iii) మతవిషయిక (iv) అధ్యాత్మిక పరాధీనత (v) మఱియు బ్రాహ్మణుల 18 నిషేధములచే నేటికిని హింసింపబడుట మొదలగు సత్యములను ప్రదర్శించి నిరూపించితిమి.

98. బ్రాహ్మణులు, బ్రాహ్మణేతరులు సహజ పరస్పర విరోధులు; (1) బ్రాహ్మణేతరులు దేవాలయము లలో అర్చకత్వమునకు తాము అర్హులమని భావించుచుండ బ్రాహ్మణులు వారికాయర్హత లేదందురు (2) బ్రాహ్మ ణులు తాము శూద్రులనువారి కన్యకలను పెండ్లి చేసి

కొనుట కర్హులమనిభావింపగా తమకు వారికన్యకల నీయనంత
వఱకు వారి కట్టి యర్హత లేదని శూద్రులనువా రందురు.
(3) బ్రాహ్మణత్వము తమ ప్రత్యేక జన్మ హక్కనియు,
ఇతరుల కట్టి హక్కు లేదనియు, బ్రాహ్మణులు భావింపగా
ఆ హక్కు తమకు గలదని శూద్రులనువారు వాదించుచు
న్నారు. ఈ విధముగా 18 ప్రధాన విషయములలో
అనగా బ్రాహ్మణుని 18 నిషేధముల విషయములోను ఈ
రెండు జాతులు పరస్పర విరోధులు.

99. ప్రపంచములో ఎచ్చటను ఒకదాని కొకటి పులి,
మేకలవలె పరస్పర విరోధులగు రెండుజాతుల నొకే వర్గముగా
జేర్చి యొకదాని కొకటి ప్రతినిధినిగా జేయుట సంభవింపదు.
అట్టి యపసవ్య వర్గములో బలిష్ఠమగునది బలహీనమగు
దానిని నాశము చేయును. ఈదృష్టితో చూచినచో
(i) బ్రాహ్మణుడు సర్వ హిందూ దేశజాతి (ii) మఱియు
అతడు పరాన్న భుక్కుఅయి వ్యవసాయ దారులగు బ్రాహ్మ
ణేతరుల సందలను పురోహితులుగా, బోధకులుగా,
అర్చకులుగా, ఉద్యోగులుగా అనుభవించుచు హిందూ
దేశములోని 750 వేల గ్రామములలోను జీవింప గోరువా
డగుటచే ఎట్లయినను వారిని త్రొక్కిపట్టి వారి సాధన
సంపత్తిని హరింపజూచువాడు (iii) అందుకొఱకు దేవుని పేర
వేదముల పేర వారిని అర్చకత్వాదుల కనర్హులని యాస్థాన
ములు (iv) పౌరోహిత్యాదులు తన ప్రత్యేక హక్కులని
ఆస్థానములను తానే గైకొని వారిని నాశము చేయు

చున్నాఁడు. (v) ప్రభుత్వోద్యోగులైన బ్రాహ్మణులు ఉద్యోగములలో లేని స్వతంత్రులు శ్రోత్రియుల మని చెప్పుకొనుచు బ్రాహ్మణుడు భూదేవుడని అతనికి సేవ చేయుటయే శూద్రులనువారికి మోక్షహేతువని సర్వహిందూ దేశమందును ఘోషించుచుందురు (4) మఱి హిందూ దేశములోని రాజకీయ భావములను బ్రాహ్మణ పత్రికలే నిర్మించుచు స్థానిక శాసన సభలకు, సర్వ హిందూ దేశ శాసన సభలకు బ్రాహ్మణాభ్యర్థులను మహాత్ములని దేవ భక్తులని, దుర్గా భక్తులని, కమలా భక్తులని, బ్రహ్మజ్ఞులని పొగడుచు తదితరులను అనర్హులని కులతత్వవాదులని నిర సించుచు అత్యుత్తమ కౌశల్యముచే సర్వ హిందూ దేశ రాజకీయ జీవితమును పోత పోయుచున్నవి. మఱి బ్రాహ్మ ణేతర సంఘములో (i) కాపులు, కమ్మలు, రెడ్లు, మొద ల్యారులు, పిళ్లెలు ఇత్యాది చిన్న సంఘములుగా చీలి ఏ సంఘమును ఒకటి రెండు జిల్లాల కంటె హెచ్చుగా వ్యాప్తిలేనివై సర్వ హిందూ దేశ రాజకీయ జీవితమును స్వాధీనములో నుంచగలిగిన హిందూ, హిందూస్థాన్ టైమ్సు, అమృతబజారు పత్రిక మొదలగు సుస్థిరపత్రికలు తమకు లేకపోవుటచేతను (iii) బ్రాహ్మణుని అష్టాదశ మహాపాపియై తమను నాశము చేయు, మేకలకు పులివంటి విరుద్ధవస్తు వునుగా భావింపక దైవము అని భావించు సంస్కారము కలిగి యుండుటచేతను (iv) పంచములని, రెడ్లని, కాపులని తమలో తాము అసంఖ్యాకములగు భేదములు కల్గియుండుట (v)

నవీన కాలోచిత నూతన నిర్మాణములు చేసి సర్వ హిందూ దేశములో తమ సంఘ పునర్నిర్మాణము చేసికొనుటను నేర్చుకొనమి (vi) పరాన్న భుక్కులగు బ్రాహ్మణులను ఏకీభవింప జేయునట్టి ఇతరులను హింసించి జీవింపవలయు నను సర్వ సామాన్య వాంఛ లేక (vii) అష్టాదశ మహా పాపియగు బ్రాహ్మణుడు తన మిత్రుడని (viii) అతని సేవయే జీవితము తరించుటకు మార్గమను సంస్కారము కల్గియుండుటచేతను నానాటికి క్షీణించుచుండ బ్రాహ్మణుడు ఈ చిన్న సంఘములలో రెడ్డిపైని కాపును, కాపుపైని కమ్మను ఎదుర్కొను నట్లు చేసి "శూద్రులు, క్షత్రియులు, వైశ్యులు" అను చిన్న సంఘములుగా చీల్చి అందఱిపైని నెక్కి రాజ్యము చేయుట జన్మ ప్రథమ సూత్రముగా గల్గి "జందెపు ప్రోగుల వారిని" ఇతరులను చీల్చి జయించి తాను రాజ్యము చేయుచున్నాడు.

100. బ్రాహ్మణేతరుల లోని అంత శ్శాఖలకు బ్రాహ్మణులకు సంస్కృతమువలె ఏక భాషగాని (ii) ఇత రుల అన్నమును భుజింపవలయునను వాంఛగాని లేకపోవుట (iii) సర్వ హిందూదేశ జీవితము లేకపోవుట వారి చీలికలకు చాల హేతువైనది. వానికి తోడు బ్రాహ్మణేతర హిందువు లకు బ్రాహ్మణుడు (i) భూదేవుడు (ii) దైవసన్నిధినుండు అర్చకుడు (iii) పూజింపదగిన గురువు (iv) అన్నిటి కంటెను నిరంతరము ఇంటికి వచ్చి శుభాశుభ తిథులు మొ॥ వానిని తెలియజేయు పురోహితుడు నగుటచే అతనితో నిత్యసంబం

ధముకలదు. జన్మించిన 21–వ నాడు నామకరణోత్స వము, 9–వ నెల అన్నప్రాశన మహోత్సవము, తరువాత యుక్తకాలములందు అక్షరాభ్యాస, గృహప్రవేశ, వివాహ మహోత్సవములు తుదకు మరణకాలములో శ్రాద్ధకర్మ ఇట్లు బ్రాహ్మణేతరుని జీవితమంతయు బ్రాహ్మణుని చేతిలో కలదు. అందుచే రెడ్డి, కాపు, కమ్మ, మొదల్యారు, వెళ్ళాల ఈ మొదలగు కులములవారు తమలో తాము ఎవరుహెచ్చు ఎవరు తక్కువ అను స్వల్ప సమస్యపైని కలహించుకొని అందఱును ఎవరికివారుగా తమ బాల్యమునుండి భూదేవులని దుష్ట శాస్త్రములలో చదివిన అష్టాదశ మహా పాపియగు బ్రాహ్మణుని గొప్ప వానినిగా నెంచి వానినే శాసన సభలకు ఇతర పదవులకు ఎన్నుకొనుచున్నారు.

101. బ్రాహ్మణేతర సంఘమును విభజించి యొకరిపై నొకరిని ప్రయోగించి బ్రాహ్మణుడు కేంద్ర, రాష్ట్రీయ శాసన సభలలోను మంత్రి వర్గములు వగైరాల లోను సంఖ్యా బలముచే తనకు రావలసిన స్థానముల కంటె 4, 5 రెట్లు హెచ్చు స్థానములను మోసముతో సంపాదించి ఆ బలమును శూద్రులగువారి నాశము కొఱకే "మదరాసు ఈనాముల" విషయములోవలె వినియోగించుచున్నాడు.

102. ఏ ప్రసిద్ధ రాజ్యాంగ నిర్మాతకాని "జాతీయత"ను "పరస్పర వినాశకరములగు శూద్రులు బ్రాహ్మ

ణులు అను నిట్టి పరస్పర విరుద్ధ భావములుగల రెండు సంఘముల సమ్మేళనము" అని నిర్వచింపడు. 1937-వ సం॥పు మద్రాసు బ్రాహ్మణ మంత్రి వర్గ పరిషత్తు వారి యీనాముల రిపోర్టు బ్రాహ్మణులు బ్రాహ్మణేతరుల విష యములో — మఱియు చిత్రము ఏమి అనగా ఎవరికి హాని చేసినదో ఆ సంఘ ప్రతినిధుల సంతకములు పొంది — వారికి హిమాలయోన్నత హానిని చేసినది. (సప్రూ కమిటీకి పంపిన మా నివేదికకు అనుబంధముగా రాజాజీకి వేసిన ప్రశ్న పరంపరలు చూ.) ఇట్లు మత విషయిక, రాజకీయ, ఆధ్యాత్మిక, నాశమును 5000 వత్సర ముల నుండి చేయుచున్న బ్రాహ్మణుడు నేడు ఈ ప్రత్య ర్థిక నాశమును నవీన పద్ధతితో చేయ మొదలిడెను. మఱియు ఈ ఉదాహరణమే బ్రాహ్మణేతర హిందువులు తమ సమస్యలను అర్థము చేసికొని పరిష్కరించుకొన గల స్థితిలో లేరనియు నిరూపించు చున్నది. (ఈ విన్నపములో 55-57 పుటలు చూ.)

103. బ్రాహ్మణుని ఈ "నాజూకు హత్యల" కు ప్రతి క్రియ కావించి తనను రక్షించుకొన జాలని స్థితిలో ఉన్నాడను విషయమును సిద్ధాంత రీత్యా మఱియు ఆచరణ రీత్యాకూడ లోగడనే రాజ్యాంగ వేత్త లంగీకరించి 1919-వ సం॥పు మాంటుఫర్డు సంస్కరణలలో బ్రాహ్మణేతర హిం దువులకు శాసనసభా స్థానములలో రిజర్వేషనులు చేయ బడినవి.

104. కావున, మేము కోరురక్షణ నూతన విష యము కాదు. మఱి లోగడ ఆచరణలో ఉన్న సిద్ధాంతమే. కాని, దాని నిప్పుడు సర్వ హిందూదేశమునకును చెందునట్లు చేయవలయును. ఏల అనగా "బ్రాహ్మణుడు" అనగనే సర్వ భారత భూమిలో శూద్రులను వారి (i) మత విష యిక (ii) రాజకీయ (iii) ఆధ్యాత్మిక అభివృద్ధి నిరోధకుడు. (i) శూద్రులనువారుతమతో సమానులు కారని (ii) వారు తన కుమార్తెలను పెండ్లాడ రాదని (iii) వారి పుత్రికలను దాను పెండ్లాడ దగదునని ఇట్లు ఘోరావమానము చేయుట ధర్మ మని (iv) బ్రాహ్మణత్వ మందు హక్కు శూద్రులకు లేదనియు (v) అట్లాంటిక్ ఛార్టరుకు విరుద్ధముగా వారికి అర్చకత్వముచేయు హక్కు లేదని (vi) గర్భాలయములలో స్వయంపూజ వారు చేసికొనరాదని (vii) తన వైదిక యజ్ఞ భోజనాదులలో సహ పంక్తి కనర్హుడని ఈ విధముగా 18 మహాపాపములను—లోకములో ఏ మహాపాపియు చేయని విధముగా—ధర్మములుగా స్వీకరించి శూద్రులను వారిని సర్వ హిందూ దేశములోను హింసించుచున్నాడు.

105. మఱియు ఇట్లు శూద్రులనువారిని హింసించు వాడయ్యు, వారియావద్రాజకీయోన్నతిని హరించి అనగా (1) ఐ. సి. యస్., ఐ. యి. యస్. ఐ. పి. మొదలగు అన్ని యున్నతోద్యోగ వర్గములలో (2) అన్ని రాష్ట్రముల లోని రాష్ట్రీయము లగు గజెటెడు ఆఫీసులలో (3) మఱియు హిందూ దేశములో సర్వత్ర ప్రభుత్వాంగముల లోని

అన్ని యితరోద్యోగ స్థానములలో (4) హిందూ దేశ ములో ప్రభుత్వేతరములగు సర్వ సంస్థలలోను అన్ని స్థాన ములను దానే హరించియు మఱి సర్వ రాజకీయ సంస్థలను తానే నిర్మించి కొనసాగించుచు (5) ఆ రాజకీయబలముతో కేంద్రశాసన సభలలోను (6) స్థానిక శాసనసభలలోను, జన సంఖ్య బలముచే తనకు రాదగిదానికంటె 6,7 రెట్లు హెచ్చు స్థానములను సంపాదించి (7) ఇతర జాతుల ప్రతినిధులనుగా తన కనుసన్నలలో మెలగు వారిని నియమించి ఇట్లు రాజ్యాంగమును స్వాధీనము చేసికొని (8) మంత్రిత్వములలో నూటికి నలువది పాళ్లు హరించి శూద్రు లనువారిని పంచము లనువారిని సర్వ నాశము చేయుచున్నాఁడు.

106. ఎంత కాలము బ్రాహ్మణుడు సర్వ హిందూ దేశ పరిషత్తుల మూలముగాను, రాష్ట్రీయ పరిషత్తుల మూలముగాను, దాను లోగడ శూద్రులు పంచములను వారి విషయములో చేసిన 18 నిషేధములను అనగా బ్రాహ్మణ కన్యకలను ఈ రెండు జాతులవారు పెండ్లాడు హక్కును నిషేధించుట,(5_వ అనుబంధముచూ.) ఈ మొదలగు నిషేధములను తొలగించి సమానత్వమును స్థాపింపడో అంత కాలము శూద్రు లనువారికి, పంచములనువారికి తమను సర్వనాశముచేయు బ్రాహ్మణునే శాసన సభలకు ఎన్ను కొనవలసిన నైతికబాధ్యత లేదు. మఱియు బ్రాహ్మణుడు అనుబంధము లోని రిజర్వేషనులను కూడ వదలు కొనవల యును. ఈ నిషేధములును, రిజర్వేనులును వారి నెన్నుకొని

సింహాసన మెక్కించుచున్న ఈ జాతులకు తీరని ఘోరావమానమును, నాశన కారణమును.

107. బ్రిటిషువారును, ముస్లిములును హిందూ దేశ రాజ్యాంగములో నేడు అధర్మముగా హెచ్చు హక్కులు కోరుచున్నను అవి వారు "మనుష్యభాష"లోనే అడుగుచున్నారు. ఇట్లు నేటి వేవెలు (రాజ ప్రతినిధి) ప్లానులో (1935) దేశ రక్షణ శాఖను, వీటో (అనగా ప్రజా ప్రతినిధుల తీర్మానమును రద్దుచేయుట)హక్కును బ్రిటిషువారు తమకుం గావలయునని కోరిరి. మన స్వరాజ్యమును నాశము చేయుట కివి రెండును చాలును.

108. అట్లే ముస్లిములు (1) తాము 8 కోట్లమంది మాత్ర ముండియు 20 కోట్ల మంది హరిజనేతర హిందువులతో సమ రాజ్య భాగమును కోరుచున్నారు. (2) మఱియు పాకిస్థానును తాము కోరుచు సిక్కులకు సిక్కిస్థానును నిషేధించున్నారు. (3) సర్వ హిందూ దేశము మీద మైనారిటీగా తాము ఎట్టి సమభాగమును కోరుచున్నారో అట్టి సమ భాగమును వారికిచ్చుట కిష్ట పడకున్నారు (4) ముస్లిము మెజారిటీ ప్రావిన్సులలో తమకు స్వయంనిర్ణయ సూత్రమును అన్వయింపం గోరుచు దానిని ముస్లిమేతరాల్పసంఖ్యాక జాతులకును సర్వ హిందూ దేశము మీద హిందూ మెజారిటీకిని నిషేధించుచున్నారు. కాని ఈ యధర్మ వాంఛలను పై బ్రిటీషు వారు గాని ఈ ముస్లిములు కాని

దేవునిపేర గాని, వేదములపేర గాని, గీతవంటి పవిత్ర గ్రంథములపేర గాని కోరుటలేదు.

109. వీనితో బ్రాహ్మణుని కోరికలను పోల్చి చూతము (1) విశ్వములో నెల్ల బ్రాహ్మణుడు సర్వ పవిత్రుడు (2) బ్రాహ్మణత్వ మనుష్ఠించు హక్కు అతనికే కలదు. (3) ఈ జన్మలోనే మోక్షమందుటకు ఏ యితర మనుష్యుడు కాని అర్హుడుకాడు (4) ఈ సిద్ధాంతములు వేదములలో కలవు (5) వాని సత్యమును గురించి ప్రశ్నించుట కెవనికిని హక్కు లేదు (6) శూద్రు లనబడువారు శాశ్వతముగా బ్రాహ్మణులకు గీతలోని "పరిచర్యాత్మకం కర్మ" అనగా బట్టలుతుకుట, క్షౌరము చేయుట మొదలగు నీచసేవలు చేయవలసిన వారు (7) ఇక పంచములను వారు అగ్రహార గ్రామములలో అడుగుకూడ బెట్టరాదు (8) శూద్రులను వారు, పంచములనువారు ఈ సిద్ధాంతమును ఈశ్వర వాక్కులుగా సమ్మవలెను. వీని ప్రామాణ్యమును శంకించుటకు గూడ వీలులేదు (8) ఆ దేవుని వాక్కులనే "వర్ణాశ్రమ ధర్మము" అందురు. (9) దానిని భగవంతుడు భగవద్గీతలో చెప్పెను (10) ఆ సిద్ధాంతము ప్రకారము కొందఱు బ్రాహ్మణులు. వారి మీద రాజత్వము చేయుట కెవరికిని అధికారము లేదు. రాజు బ్రాహ్మణేతరులకే రాజు (11) కొందఱు క్షత్రియులు (12) క్షత్రియులు రాజ్యము చేయుటకు, యుద్ధ భటులు, సేనా నాయకులు అగుటకు అర్హులు (13) వైశ్యులు భూరూప, ధనరూప, గోరూపాది

రూపములతో ఉన్న సర్వాస్తిక మఱియు వ్యవసాయ వాణిజ్యములకు అర్హులు (14) శూద్రులనువారు శక్తి కలిగియు ధనమునార్జింపరాదు. ద్విజుల భక్తశేషముతిని నీచ సేవ చేయుటయే వారి ధర్మము (15) బ్రాహ్మణ కన్యలను పెండ్లాడుటకు వారు కోరరాదు (16) శూద్రులను వారి కన్యకలను పెండ్లాడుటకు ద్విజులకు హక్కుకలదు (17) స్త్రీలకు బ్రాహ్మణ ధర్మమును అనుష్ఠించుటకు హక్కు లేదు. (18) శూద్రు లనువారుగాని, పంచము లనువారుకాని, సమానత్వముతో బ్రాహ్మణుని సంబోధించుటకు సంబోధింపబడుటకును అర్హులుకారు. (19) ఈ యిరువురు జాతులు దేవాలయములో స్వయంపూజ కావించుకొనుటకు అర్హులుకారు. (20) పంచము లనువారు బ్రాహ్మణ కన్యకలను పెండ్లాడుదమని మానసికముగా నేని తలంపరాదు. అది దైవ ద్రోహతుల్యము (21) శూద్రులనువారు జన్మ చేతనే పాపాత్ములు ("పాపయోనయః" భగవద్గీత) (22) పంచము లనువారు జన్మచేతనే చండాలురు (అంత్యఃపాపిష్ఠః "గౌతమ ధర్మ సూత్రములు 1-4-23) అనగా పంచములు (శూద్ర భర్తలవలన బ్రాహ్మణ స్త్రీలకు జనించిరి. వారు సృష్టి అంతమువఱకు మార్పు చెందని పాపాత్ములు) (23) వారు అర్చకులు కావలయునని (సర్వ శాస్త్రజ్ఞులు, సత్పురుషులు అయినను) కోరరాదు (24) ఒక సంఘములో జన్మించుటయే గౌరవింపఁ బడుటకు గాని, గౌరవింపఁ బడకుండుటకుగాని హేతువు (25) ద్విజుఁడే పూజ్యుఁడు శూద్రు డనువాడు

జితేంద్రియుఁడైనను అనగా కామ క్రోధలోభాదులు జయించిన ఈశ్వరతుల్యుఁడైనను పూజ్యుడుకాడు (దుశ్శీలో పిద్విజో పూజ్యోనతు శూద్రో జితేంద్రియః). (26) ద్విజ వర్ణజులు ముగ్గురు జన్మచే శూద్రులను మాట నిజమే (శూద్రః చతుర్థో వర్ణః ఏక జాతిః అనగా ఉపనయన సంస్కారముచే ద్విజుడగుటకు పూర్వ మా ద్విజ పుత్రుడు శూద్రుడే.) (27) ఉపనయనము అతనికి ద్విజత్వమును ఇచ్చును. (తత్ ద్వితీయం జన్మ అనగా ఉపనయనముచే ద్విజుడగును) (28) ఈ రెండవ జన్మకూడ కొన్ని షరతులకు లోబడినది అనగా 16 వ సం॥ ము తుదిరోజులలోగా ఉప నయన సంస్కారమును పొందని బ్రాహ్మణుని బిడ్డకు 17–వ సంవత్సరములో బ్రాహ్మణత్వము పొంద నర్హత లేదు (29) ఇట్లు సకాలములో ఉపనయనముచే బ్రాహ్మ ణత్వము పొందినను కొన్ని అనుష్ఠానములు సల్పిననే అది నిల్చును. అనగా అది యొక దీక్ష (30) ఇట్లు ఒక్క రోజు సంధ్య వార్పనిచో ఆ బ్రాహ్మ ణత్వము నశించును. (స్వస్థస్య ఏకాహ మపి అను పాస్య చేత్ పతితో భవతి. గౌ. ధ. సూ. పరిశిష్టము)' (31) కాని శూద్రుడను వాని కుమారుడు ఉపనయన సంస్కారముపొంది బ్రాహ్మ ణత్వము నందుటకు అనర్హుడు (32) కాని, యీ శూద్రుడు బ్రహ్మదేవుని పుత్రుడే (అందుచే బ్రాహ్మణుడు అని పిలువ బడుటకు అర్హుడు. ఏల అనగా బ్రాహ్మణస్య ప్రజాపతేర్వా అపత్యంపుమాన్ బ్రాహ్మణః అని గౌతముడు నిర్వ

చించెను కదా ?) (33) " పద్భ్యాం శూద్రో అజాయత " అని నిర్వచించి శూద్రులనువారు సరాసరి యీశ్వరుని బిడ్డలని " పురుష సూక్తము " లో పరమేశ్వరుడు నిర్ణయించుటచే వారు బ్రాహ్మణులనుట స్పష్టము అయినను (34) భూలోక దేవత్వమై అత్యుత్తమ సాంఘిక, రాజకీయ, మతవిషయిక స్థానమును ఇచ్చునది యగు బ్రాహ్మణత్వమును శూద్రులనువారు పొందరాదు (35) మఱి సృష్టి అంతము వఱకు శాశ్వత పాపాత్ములని చెప్పబడు పంచములను వారికి బ్రాహ్మణత్వానుష్ఠానపు హక్కు గగన కుసుమమనుట వేఱుగా చెప్పనక్కఱలేదు.

108. సనాతన బ్రాహ్మణుల మనుకొనువారు చేయు వాదమిది. ఈ వాద సోపానములో ఏ భాగమునందును ఈశ్వర ప్రతినిధియగు హేతువాదమనునది శూన్యము. వేదముల, ఉపనిషత్తుల, గీతల దుర్వ్యాఖ్యల మీదను, ప్రక్షిప్తముల మీదను అది నిర్మింపబడినది. సనాతన సిద్ధాంతమనబడు రాక్షస సిద్ధాంతమును ఆచరణలో నుండవలయు ననువారు నేడును పెక్కురు శ్రోత్రియుల మనుకొనువారు, మఱి సర్వ హిందూదేశ సంఘముగా ఏర్పడిన "సర్వభారత వర్ణాశ్రమ స్వరాజ్య సంఘము" వారు మొదలగువారు కలరు. మఱి ఈ సనాతన ధర్మమనునది దేవాలయాదులలోను, మత పరిషత్తులయు యజ్ఞాదికములయు భోజనములలోను వివాహాదులలోను నేటికిని వాడుకలో ఉన్నది.

109. ఈవిషయముల నింకను విషమింపఁజేయుటకు మహాత్మాజీ సంస్కరించిన "గాంధివర్ణ సిద్ధాంతము" దాపరించినది. దీనిని ఇందలి పూర్వపు పేరాలలో విమర్శించితిమి. చర్చిలు మహామంత్రి "నూతన సామ్రాజ్యవాదము" వలెఅది మెరుగు పెట్టబడిన వస్తువే. కాని, పాపాత్ముల వాదమగు సనాతన మతములోని దోషము లిందును కలవు. (1) ఈశ్వర ప్రతినిధియగు హేతువాదమున కిందు తావు లేదు (2) అష్టాదశ మహాపాపుల దుష్టశాస్త్రములే ఆ సనాతనులనువారి వాదమునకును, మహాత్ముని వాదమునకును పునాది యగుటచే వారు చెప్పెడి "వర్ణము"ను "భగవద్గీతలో చెప్పిన యీశ్వర వాక్యము" అన్నచో "చిత్తము అంతే" అనవలయును కాని, కాదనరాదు. (3) అంతే గాక శిరసావహించి హిందువుల మనుకొను వారందఱును అనుష్ఠింపవలయును (4) ప్రతిహిందువుడును తండ్రివృత్తిని స్వీకరించితీరవలయును, (5) వర్ణేతరవృత్తి యనబడుదానిని ధనార్జనము కొఱకుగాక సేవాధర్మము కొఱకు అనుష్ఠింపవచ్చును (6) సనాతనులనువారి వర్ణాశ్రమ ధర్మములోని ఉత్తమ వర్ణములు, నీచవర్ణములు అను భేదము మహాత్ముడు తొలగించెను (7) కాని, శూద్రులను వారికి కూలి పనులను, బ్రాహ్మణులకు వేదబోధ, పౌరోహిత్యము; వైశ్యులను వారికి సర్వ ఆర్జనాంగములు మహాత్ముడు నిర్ణయించెను. అందుచే ఆ ఉచ్చనీచతలు తమంత తామే వచ్చును. (8) మఱియు వర్ణ వృత్తియనునది మన జన్మకు

పూర్వమే నిర్ణయింపబడినది యనియు దానిని అనుష్ఠింపని వాఁడు పతితుఁడనియు మహాత్మాజీ వాదము.

110. మహాత్ముని ఈ నాజ్ఞాకు వర్ణ సిద్ధాంతముకూడ శూద్రు లనువారిని, పంచము లనువారిని జాతీయోన్నతికి రాకుండ అణఁగ ద్రొక్కుటకు చాలును. ఏల అనగా శూద్రులకు వర్ణ వృత్తి యనబడు కాయ కష్ట జీవనమును, పంచము లనువారికి తర తరముల నుండియు వచ్చు నైచ్య వృత్తులు నిచ్చుటచే అవి రాజకీయోన్నతికి తగిన ఐశ్వర్య మును, సాధన సంపత్తిని ఈయవు. వర్ణ వృత్తిని దప్పినచో పతితత్వము—అనగా "బ్రహ్మహా, సురాప, గురుతల్పగ మాతృ, పితృయోని సంబంధ గ, స్తేన, నాస్తిక, నిందిత కర్మాభ్యాసి, పతిత త్యాగ్య, పతిత త్యాగినః" గౌ. ధ. సూ. 3.3.1.అనఁగాహత్యలు చేసినవారు. దొంగలు, గురు భార్యా మాతృ సంయోగములాచరించినవారు మొ॥ వారు పతితులని యర్థము. ఇట్టి ఘోరదోషమును వర్ణ వృత్తు లాచరింపని వారికి విధించుటచే శూద్రులు, పంచములు, ఆ చంద్ర తారార్కము ఆ నీచ వృత్తులలోనే యుందురు. మహాత్ముఁడు చాల శ్రమపడి (i) వృత్తులలో నీచత ఉన్నతి లేవ నియు (ii) వర్ణ వృత్తిని ఆర్జన కొఱకు వినియోగించుచు ఇతర వర్ణ వృత్తియను దానిని లోకసేవ కొఱకు చేయవచ్చు నని యు చేసిన సంస్కారము, తండ్రి వృత్తి లేక వర్ణ వృత్తి నవలంబించి తీరవలయుననుటచే ఈ రెండు జాతుల వృత్తు లును దారిద్ర్యమును తొలగింపనివియు ప్రపంచములోని

200 కోట్ల ప్రజల దృష్టిలోను నీచ వృత్తులును అగుటచే సొంపగు మాటలతో మహాత్మాజీ ఈ జాతుల నధోగతిలో శాశ్వతముగా ఉంచు వృత్తులనే ఇచ్చెను. ఉదాహరణము "భంగీ వృత్తి" "అనగా పాకీ వృత్తి నీచ వృత్తి కాదని మహాత్ముడు చెప్పెను. ఆయన ఋషియగుటచే భేదమెంచడు. మఱి ధన దృష్టి లేమిచే అయనకు సర్వ వృత్తులు ధర్మానుష్ఠానము లే. కాని, మహాత్ముని పారబాటేమనఁగా ఇట్టి యుదార దృష్టి లోకములో కోటి కొక్కనికి కూడ లేదని గ్రహింపమి. ఆయన ఆశ్రమ వాసి యాయెను. ఆయన కుమారులకే అది రుచింపలేదు. కోటిలో ఆశ్రమ జీవిత మెంత మందికి రుచించును? "భంగీ" వృత్తిని తా నాచరించుచున్నాఁడు. కాని ఆయన సిద్ధాంతములను వేయి ప్లాట్ ఫారములమీద పొగడిన మహాత్ముని ప్రేమ పాత్రులు, సన్నిహితులు—మాళవ్యాలు, నెహ్రూలు, ఆచార్యులు, పండితులు, పంతుళ్లు, పంతులు మహాత్ముని సంతోషపరచుటకు గాక తమ జన్మ సిద్ధి కొఱకేని దినదినము పది యిండ్లలోనేని పాకీ పని చేయుచున్నారా? వర్ణేతర వృత్తి యనబడు దాని నుండి "ఆర్జన"ను తొలగించుటచే లక్షకొక్కఁడేని ఆర్జన లేని వృత్తిని స్వీకరింపఁడు. మఱి యట్టు లోక వృత్తిని అనుష్ఠించుటను దానితో వచ్చు సంపాదనమునుండి విడఁదీయ వీలును లేదు. "సత్యమే దేవుడు" అను గ్రామోఫోను రికార్డును లక్ష రూప్యములకు గాంధిజీ అమ్ముటు బ్రాహ్మణత్వమును (ఆర్జించిన ధనమును ధర్మము

కొఱకు వినియోగించితినను పతితత్వమును తప్పింపజాలదు) అమ్ముకొనుటయే కదా ?

111. కావున ఫ్రాన్సులో "డిగాలీ" చేతను ఇంగ్లండులో పూర్వ మహామంత్రి చర్చిలు చేతను బోధింప బడుచున్న "నవ్య సామ్రాజ్య వాదము" నకు తోబుట్టువు అగు మహాత్మాజీచే సంస్కరింపబడిన "గాంధి వర్ణ" వాదము, దాని ఏలెనే దుష్టవాదమై, గాంధిజీ చేసిన సంస్కార ములు బుద్బుద ప్రాయములగుట చేతను, రాక్షస వాద దక్షులగు అష్టాదశ మహాపాపులగు సనాతనుల దుష్టమగు వర్ణ ధర్మమునకు పూర్వమునుండియు కల రక్షణల చేతను అనగా (1) భాష్యములను పేరుచే పిలువబడు దుర్భా ష్యములు (2) ఆచారములనబడు దురాచారములు (3) పూర్వ జన్మ కర్మ అనగా పూర్వ జన్మలో నీవు చేసిన దుష్ట కర్మయే యీ నీ శూద్రత్వమునకు పంచమత్వమునకు కారణమైనదని ఋజువు పరచుటకు వీలుకాని దుష్ట వాదము (4) "ఉత్తర జన్మ" అనగా ఈ జన్మలో "ఓ శూద్రుడా నీవు బట్టలుతుకుట మొదలగు నీచ సేవను బ్రాహ్మణునికి చేసినచో నీకు ఉత్తర జన్మలో మోక్షమువచ్చును" అను ఋజువు చేయ బడని, చేయుటకు వీలులేని దుష్టవాదము (5) బ్రహ్మ ద్వేషము: బ్రాహ్మణుడు "భూదేవుడు కాడ"నుట బ్రహ్మ ద్వేషమను వాదము (6) "కలియుగము" ఇది కలియుగము అనగా బ్రాహ్మణుల పూజ చేయని పాపయుగము (7) "కృత యుగము" అనగా ఏ ప్రశ్నయు వేయకయే బ్రాహ్మణుని

ఈశ్వరుని వలె పూజించిరను పూర్వయుగము (8) "ధర్మ శాస్త్రము" అనగా పవిత్రమగు రాజ శాసనము (నిజమున కవి శూద్రు లనువారిని పంచము లనువారిని నాశము చేసి ప్రపంచ మెల్ల బ్రాహ్మణునికి కట్టిపెట్టు పాపాత్ముల శాసనములు) (8) "జన్మ" అనగా బ్రాహ్మణునికి లాభకరమగు మొదటి అర్థములో "ఉపనయన పరదశ" శూద్రులకో మరణానంతర జీవితము అను రెండవ అర్థము (9) "శూద్రుడు" అను పదమునకు తనకు లాభకరమగు అర్థములో ముందు బ్రాహ్మణత్వము పొందుటకు అర్హతకల ఉపనయన పూర్వదశ. శూద్రుల విషయములో ఈ జన్మలో బ్రాహ్మణుడుగా మారుటకు వీలు లేని జాతివాడను అర్థము (10) "బ్రాహ్మణుడు" బ్రాహ్మణుని పుత్రుడు అని తనకు అన్వయించు అర్థము. శూద్రుని విషయములో "బ్రహ్మ దేవుని బిడ్డ" అనగా "ప్రతి శూద్రుడనువాడు సరాసరి బ్రహ్మదేవుని బిడ్డయే యగుటచే బ్రాహ్మణుడు" అను పురుషసూక్తి అర్థమును మఱుగు పరచుట. (11) కర్మ అనగా మొదటి అర్థము తాను చేయు యజనయాజనాది షట్కర్మ లనియు రెండవ యర్థము ఎవరును చూడని, ఉన్నది లేనిది ఋజువు చేయఁజాలని బ్రాహ్మణు డున్నదని వాదించు పూర్వ జన్మము అను దానిలో చేసిన పాపములు (12) "గార్హపత్యము" అనగా తన విషయములో వేదోక్త కర్మలు చేసి బ్రహ్మత్వ సిద్ధితో తరింపఁ దగిన వేదోక్త పద్ధతి. శూద్రులను వారి విషయములో వ్యర్థమై నిరుపయోగ మగు

పురాణోక్త పద్ధతి (13) " ఆగమములు " ఏ దేవాల యార్చకత్వాదుల కెవ రర్హులు, ఏ కర్మ కాండల నెట్లు చేయవలయును ? అను నీ ధర్మములు చెప్పునవి అనబడు దుష్టాగమములు (14) " అనులోమ వివాహము " అనగా బ్రాహ్మణుడు భూలోక దేవుఁ డగుటచే ఉత్తము డని అతడు తక్కువవారనఁబడు మూఁడు వర్ణముల కన్యలను పెం డ్లాడఁదగునని (15) " విలోమ వివాహము " అనగా శూద్రుడు నాల్గు వర్ణములలో దక్కువ వాడు. అతఁడు బ్రాహ్మణ జాతి కన్యకను పెండ్లాడ రాదను వాదము. (16) బ్రహ్మహత్య అనగా ఎంత పాపాత్ముఁడైనను బ్రాహ్మ ణుని చంపుట మహాపాపము. (అట్లే " శూద్ర హత్య " అని గాని " పంచమ హత్య " అని గాని చెప్పబడలేదు) (17) ఆశ్రమములు అనగా బ్రహ్మచర్య, వానప్రస్థ గార్హ పత్య సన్యాస ఆశ్రమములు బ్రాహ్మణుని శాశ్వత స్వత్వములు. శూద్రులనబడువారు ఈ వేదోక్త ఆశ్రమముల ననుష్ఠింప రాదనుట (18) "మ్లేచ్ఛ" అష్టాదశ మహాపాపియగు బ్రాహ్మణుని యీ దుష్ట " వర్ణ సిద్ధాంతము" ను అనుస రింపని వారిని మ్లేచ్ఛులనుట (19) " అశుచ్యులు " అనగా హిందూ మతములో ద్విజుఁడై జన్మించి తమ వర్ణ ధర్మమును దానిని అనుష్ఠింపనివారు (20) "అధార్మికుడు" శూద్రుడై జన్మించి తన వర్ణ ధర్మమునుదానిని ఆచరింపనివాడు (21) " నాస్తిక " ఈ అష్టాదశ మహాపాపి వర్ణ ధర్మమునునది వేదములోనిదని నమ్మని వారికి పెట్టిన పేరు (22) " వేదో

ధర్మమూలం" అనగా గౌతమ ధర్మ సూత్రాదులలో చెప్పిన దుష్ట ధర్మములు వేదములలోనివను అసత్య సిద్ధాంతము (23) "వర్ణాశ్రమ ధర్మము" సృష్టి అంతము వఱకు శూద్రులను వారిని పంచములనువారిని నాశము చేసి వారి సర్వ ఆర్థిక రాజకీయ సాధన సంపత్తిని హరించుటకు పన్నిన మోస ధర్మమును ఈశ్వర ధర్మమని వేద ధర్మమని ఆచరింప వలయు ననుట (24) 'పతి తత్వము' అనగా ఆ వర్ణ ధర్మమనునది (i) సంస్కృతములో (ii) ఆర్యులచే (iii) ఆర్యులుకాని ద్రావిడులను నాశము చేయుటకు (iv) వారిని శాశ్వతముగా బానిసలనుగా జేయుటకు వ్రాయ బడినట్లు స్పష్టముగా గన్పట్టుచున్నను మఱియు (v) ఈ వర్ణ సిద్ధాంత మాతృక సంస్కృతముకాని ద్రావిడ భాషలలో (vi) "రెడ్ల ధర్మశాస్త్ర"మని కాని, "కాపుల ధర్మశాస్త్ర మని" కాని, "మొదల్యారుల ధర్మశాస్త్ర" మని కాని వ్రాయ బడక ఈ కులముల మాతృ భాషలలో లేనిదై (vii) వీరిని నాశము చేయు నట్టియు (viii) ఆర్యులను లోకోత్తర స్థితికి దెచ్చు నట్టియు చిహ్నములు సర్వత్ర కను పడుచు (ix) సర్వమగు ఆస్తిని ద్విజత్రయమునకిచ్చి శూద్రులను వారిని పంచములను వారిని నీచ సేవకులనుగా జేసిన దైనను ఇట్టి అష్టాదశ పాపులమతమును నమ్మి అనుభవింపనిచో పతితుడగునను నిట్టి వాద పరంపరలచే మరల అత్యంత ఘోర మగు పూర్వ స్థితికి రాక తప్పదు.

112. చరిత్ర, చర్విత చర్వణ మగుచుండును. శంకరుని బ్రాహ్మణ మత పునర్నిర్మాణ కాలములో ఈ సూత్రము సత్యమైనది. అది సర్వ సమత్వముమీద ఆధార పడిన బౌద్ధ మతమును అనేక వేలమంది శూద్రులను, బ్రాహ్మణ మతమును ప్రతిఘటించు ఇతరులను గానుగలలో ఆడించి నాశము చేసినది.

113. ఇండియన్ నేషనల్ కాంగ్రెసు వర్కింగు కమిటీ, (చాల పవిత్రు లగు బ్రాహ్మణేతరులును, హైందవేతరులును అందు కొందఱున్నను) స్వభావము నందును, నిర్మాణముచేతను, బ్రాహ్మణత్వముతో నున్నది. కాని, మహాత్మాజీ (మహాత్ముని వర్ణ సిద్ధాంతము యొక్క సమగ్ర స్వరూపమును ఆయన 17–4–1945 వ తేదీని ప్రకటించిన "కులతత్వము నశింపఁదగినది." అను పత్రికల వార్త ప్రకటించిన తర్వాతనే గ్రహించితిమి) సంస్కరించిన వర్ణ సిద్ధాంతమే శూద్రు లనువారికి, పంచము లనువారికి చాల హాని కరము. మఱి బ్రాహ్మణ మత సారమును తనివితీర గ్రోలి ప్రౌఢిమతో కార్య పరంపరలు నిర్వహింపగల దక్షిణ హిందూదేశ బ్రాహ్మణ రాజకీయ వేత్తలందు గలరు. అందుచే, ఈ విన్నపమును దాఖలుచేయుటలో మేము చాల వెనుకాడితిమి. కాని, మహాత్మాజీ ప్రస్తుతో ద్దేశము లెంత ధర్మ భిన్నముగా ఉన్నను, ఆయన నిరంతరాభివృద్ధికరమును, సత్యశోధకము నగు మన స్తత్వము కలిగి (అ) "స్వరాజ్య పక్షము" విషయములోవలెను(ఆ)సి.ఆర్. పాకిస్థాన్ ప్రణాళిక

విషయములోవలెను స్వార్థ రహితుడగుటచే మార్చుకొను నవకాశము కలుగుటచేతను (2) విమర్శ చేయకయే స్వీకరించి నట్టి గాని లేక భగవద్గీత పైని గల భక్తిచే ఒప్పుకొన్నట్టి గాని, మతాభిప్రాయములను సోమవార మౌన వ్రతము నందును, నిత్య తపస్సులోను మరల చర్చించి అంతరాత్మ ఘోకడల కనుగుణముగా అహింసా సిద్ధాంతము ననుసరించి దిద్దుకొను వాడగుటచేతను (3) మఱియు వర్కింగు కమిటీ సభ్యులు 25 సంవత్సరముల కాలము ప్రభుత్వము వారి హింసను, అసత్యములను తమ సత్యముచే ఎదు ర్కొని స్వరాజ్యయుద్ధము చేయుచు నేడు మూఁడు వర్షముల నుండి జెయిళ్ళలో తపస్సుచేసి వెలుపలకు వచ్చినవా రగుటచే అయిదు వేల సంవత్సరముల నుండి దేశమును నాశము చేయుచున్న బహుశః స్వరాజ్య పరిపాలనలో తాము పున రుద్ధరింపఁ బోవునట్టి— క్షత్రియత్వమును ఎల్ల క్షత్రియేత రులనువారి నుండి హరించుట మూలముగా స్వరాజ్యమునే ఘోగొట్టిన—ఈ బ్రాహ్మణ మత ఫలితచర్చలను ధర్మభిన్న ముగా విచారింపరను ధైర్యము తోడను ఈ విన్నపమును సమర్పించుకొను చున్నాము.

114. కావున, సంగ్రహముగా వచింతుమేని "బ్రాహ్మణ బ్రాహ్మణేతర సమస్య" బ్రాహ్మణులగు ఆర్య జాతి యొక్కయు; శూద్రులు, పంచములు అనబడు ఆర్యేతరులగు ద్రావిడులయు జాతి యుద్ధము. బ్రాహ్మణులు ఆర్యులనుట నిర్వివాదాంశము. ఏల అనగా "ఆర్య

అనార్యయోః వ్యతిక్షేపే సామ్యం సామ్యం" (గౌ. ధ. సూ. 2-1-49) అని గౌతముడు చెప్పెను. దానినే వ్యాఖ్యానము చేయుచు హిందూ ధర్మ శాస్త్రము విషయములో నేటికిని ప్రామాణికుడుగా గణింప బడు హారదత్తులు "ఆర్య స్త్రైవర్ణికః అనార్య శ్శూద్రః" అని వ్రాసిరి. అనగా ద్విజులు ముగ్గురు అనగా బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, ఆర్యులు. శూద్రులు, అనార్యులు" అని నిర్వచించిరి. ఇవి వేయి యేండ్ల క్రింద వ్రాయబడినవి. మఱియు కర్త లిరువురు, ప్రామాణికులు. కావున వాని ప్రామాణ్యమును శంకింప వీలు లేదు.

115. కావున ఈ సమస్య రెండు భిన్న జాతుల మధ్య జరుగు మహా యుద్ధము. భారత భూమిలో నేడు మూడు పాలక జాతులు కలవు (i) బ్రిటిషువారు (ii) ముస్లిములు (iii) బ్రాహ్మణులు అనగా ఆర్యులు. బ్రాహ్మణులే నిజమునకు క్షత్రియులును. ఏల అనగా "రాజాసర్వస్యేష్టే బ్రాహ్మణ వర్జం" అనగా "రాజు బ్రాహ్మణులకు తప్ప తక్కిన వారికే రాజు" అని గౌతమ ధర్మ సూత్రములలో స్పష్టముగా చెప్పబడినది. అందుచే బ్రాహ్మణుడే క్షత్రియుని మాటు వెట్టుకొని మహా మంత్రి, మంత్రి, మండాలాధీశ్వరుడు, న్యాయ మూర్తి అన్నియు తానేయై భారత భూమి నేలు చున్నాడు.

116. ఆధిక్యము కొఱకు బ్రిటిషు వారును, ముస్లిములును మనుష్య పరిభాషలో పోరాడుచుండ బ్రాహ్మణుడు

మతము ఈశ్వరుడు, ఈశ్వర వాక్కు అను దైవపరి భాషలో వంచించి పోరు చున్నాడు. ఇట్లు (1) దైవము అను తెరను (2) భగవద్గీత, ఉపనిషత్తులు, వేదములు అను తెరను (3) వర్ణధర్మమను, దాని నిర్మాణములయు నిబంధనలయు, తెరను (4) ఆచారమను ఉదారముగా గన్పట్టు తెరను (5) నిజమునకు రాక్షస ధర్మమగు సనాతన ధర్మమను తెరను (6) నిజమునకు దుష్ట ధర్మ శాస్త్రములగు ధర్మ శాస్త్రములను తెరను (7) సర్వసామాన్య భాషకానిదై జన సామాన్యమునకు తెలియని "సంస్కృతము" అను తెరను ఇట్లు ఏడు తెరలను—"సుస్థాపితమగు ధర్మ శాస్త్రము" అను తెరను — ఆ ధర్మశాస్త్ర మనునదియే పశుబలముచే ధర్మ విరుద్ధముగా స్థాపింపఁ బడిన అధర్మ శాస్త్రమే అయినను — మాటు పెట్టుకొని స్వరాజ్యము కొఱకు పోరు కాంగ్రెసు వారిని 25 వత్సరములనుండి ఇండియాలో బ్రిటిషు గవర్నమెంటు వారును, సిరియాలో ఫ్రెంచి గవర్నమెంటు వారును. ఆ దేశముల గడ్డమీద జన్మించిన బిడ్డలను అట్లాంటిక్ ఛార్టరులోని,"సర్వ సమత్వము స్వరాజ్య ప్రదానము" అను సూత్రములు ఈ సుస్థిర ధర్మ శాస్త్ర పాలిత భూములకు చెల్లవనుచు నాశము చేయుచున్నట్లు విజాతీయులగు ఆర్యులు ఈ దేశ వాసులగు ద్రావిడులను నాశము చేయుచున్నారు.

117. కావున, శూద్రులను వారియు పంచములను వారియు పోరాటము చాల కష్టమైనది. అయినను

పోరాటము ప్రారంభ మైనది. "ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః మామకాః పాండవాశ్చైవ" అనగా "కౌరవులును, పాండవులును, కురుక్షేత్ర భూమియందు యుద్ధ సన్నద్ధులైరి" అని భగవద్గీతలో చెప్పినట్లు బ్రాహ్మణ బ్రాహ్మణేతర యుద్ధము ప్రారంభమై శంఖారావములు చేయుచున్నారు. దక్షిణ హిందూ దేశ బ్రాహ్మణేతర నాయకుడగు ఇ. వి. రామస్వామి నాయకరు 'ద్రవిడ స్థానము' కావలయునని కోరెను. పూర్వము కాంగ్రెసు మంత్రిగా ఉన్న రామనాథను గారు ద్రవిడస్థాన వాదమును సమర్థించు చున్నాడు. కాని, ప్రత్యేక రక్షణలు లేని ద్రవిడ స్థానము కాని, పాకిస్థానము కాని మైనారిటీ, మెజారిటీ సమస్యలను పరిష్కరింప జాలవని వారు గుర్తింపరైరి. దక్షిణ హిందూ స్థానోపన్యాస పరంపరలలో (1944) డాక్టరు అంబేడ్కరు గారు బ్రాహ్మణ రాజ్యమును నాశము చేయవలయునని ఖండితముగా చెప్పెను.

118. బహుశః ఇట్లు రెండు పక్షములును యుద్ధ సన్నద్ధములు అగుచున్న రోజులలో శ్రీ రాజగోపాలచారి యరు (నేడు ఢిల్లీ తాత్కాలిక ప్రభుత్వ సభ్యులు) గారు బ్రాహ్మణేతరుల రోదనములను లక్ష్య పెట్ట నక్కఅ లేదని క్రైస్తవ యువజన సంఘము వారి 'బహిరంగోపన్యాస సంస్థ' వార్షికోత్సవ సందర్భమున "ద్రావిడ దేశ వాసులు కాని, తమిళ మండలములవారు కాని, అధిక సంఖ్యాకుల వోట్లతో ఏకగ్రీవముగా కోరుచు ప్రత్యేక రాష్ట్ర నిర్మాణము చేయ

గోరుచో అట్లు చేయించు కొనుటకు వారికి హక్కు కలదు. కాని, ఈ ప్రాంతములలో తమ తాత్కాలిక కార్య క్రమ మేమియైనను కొన్ని సంఘములను ఏదో ఒక విధముగా అణగ ద్రొక్కవలయుననియు ఏడ్పింపవలయుననియు, బాధించవలయుననియు కొందఱు చేయురోదనములతో దానిని అపార్థము చేసికొనరాదు" అని తాను చెప్పిన యుపన్యాసములో ఘోషించెను. బహుశః అది ఈ బ్రాహ్మణేతర యుద్ధమును నిరుప యోగమైన దేశ విభాగ సమస్యనుగా మార్చుటకు పన్నిన పన్నాగము కావచ్చును.

119. అందుచే మహా యోధుడగు రాజగోపాలాచారియరుగారు బ్రాహ్మణేత రోద్యమమునకు ఇచ్చిన యీ నిర్వచనమును అనగా "ఒక సంఘమును లేదా, కొన్నిసంఘములను అణచివేయుటకు, ఏడ్పించుటకు, హింసించుటకు చేయు రోదనములు" అనుట సత్యమా ? 5000 ఏండ్లనాఁడు శంబుకవధతో ప్రారంభమై 1937–వ సం॥ములో మద్రాసు కాంగ్రెసు రాజాజీ మంత్రి వర్గము ఈనాముల విషయములో హింసింప యత్నించిన తరుణము వఱకు బ్రాహ్మణేతరులను అణచి వేసినది, ఏడ్పించినది, హింసించినది, తాను తనతాత, ముత్తాతలు అనుట సత్యమా ? అని మఱికొన్ని ప్రశ్నలు వేసితిమి (మా స ప్రూ క మి టీ మెమోరాండము యొక్క అను బంధము చూ.)

120. బ్రాహ్మణ బ్రాహ్మణేతర సమస్య మిథ్యకాదు దేశములో కలదు. దానిని సరిగా అర్థము చేసికొన్నవారు

అరుదు అనుమాట నిజము. అయినను నెహ్రూకమిటీ దాని యునికిని గుర్తించినది. మహాత్మాజీ దానిని అర్థము చేసికొనుటకుఁ బ్రయత్నించెను. ఆయన ఏమి చెప్పెననగా "దక్షిణ హిందూస్థానములో మీరు హిందూమతమును రెండు భాగములుగా చేయుటయేగాక హిందూదేశమునే రెండు భాగములుగా అనగా 'బ్రాహ్మణులు' గను 'బ్రాహ్మణేతరులు' గను విభజించితిరి" (యంగు ఇండియా 24-11-1927 చూ.) బ్రాహ్మణరాజ్య నాశము కొఱకై 'జస్టిసు పక్షము' జన్మించినది. కాని శూద్రులనువారలయు పంచములను వారలయు మనోమయ కోశములనే విధ్వంసము చేసి హిందువుల నైతికాధ్యాత్మిక, రాజకీయ జీవితములను అపవిత్రములుగా బ్రాహ్మణ మతము చేసినదను విషయమును, తత్ఫలితముగా ఈ రెండు జాతులు ఈ విషయములలో జీవన్మృతులై యుండిరనియు అది ప్రపంచమునకు తెలుపఁజాలని దాయెను. మఱియు ఆ బ్రాహ్మణ హింసా ఫలితములకు తగిన ప్రతిక్రియలను చెప్పఁజాలనిదాయెను.

121. ఈ విషయమును మేము 1931 లోనే గుర్తించితిమి. అందుచే ఈ "రియల్ ఇండియన్ నేషనల్ కాంగ్రెసు పక్షము" ను 1931-వ సం॥ము మార్చి 24-వ తేదీనే మహాత్మాజీకి తెలియఁజేసి స్థాపించితిమి. ఆయనకు వ్రాసిన లేఖలో "ఇండియన్ నేషనల్ కాంగ్రెసులో భాగమై రియలిస్టిక్ పొలిటికల్ స్కూలు (అనగా యదార్థ రాజకీయ పక్షము) అనబడు మేము బ్రాహ్మణత్వ

విషమునుండి దేశమును కడిగి పవిత్రీకరింపవలసిన తరుణము ఆసన్నమైనదని భావించుచు మఱియు దేశమును సర్వతో ముఖముగా నాశము చేసిన బ్రాహ్మణ మతము యొక్క 18 నిషేధములచే (అనుబంధము (v) చూ.) శూద్రు లనువారికిని పంచము లనువారికిని తుదియంతర ములో సర్వ హిందూదేశమునకును చేయుచున్న మహానర్థ పరంపర విషయములో కండ్లు మూసికొనుట గొప్ప ప్రమాద మని విశ్వసించి ఆ బ్రాహ్మణత్వ విషవృక్షమును మూలచ్ఛే దముచేయుటకు బహిరంగ యుద్ధమును ప్రారంభించితిమి'' అని తెలియఁజేసితిమి (24-3-1931-వ తేదీ గల సచ్ఛాస్త్రి మహా త్మునికి వ్రాసిన లేఖను చూ.)

122. కావున ఇట్టి బహిరంగ యుద్ధములో ప్రతి బ్రాహ్మణుడును ఏవిధముగా మామీది కెదుర్కొనునో దానిని గుఱించి అపోహలు లేవు. మన ఆంధ్ర నాయకుడు డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు మాతో పోరాడును. ఆయన మాకు రాజకీయ గురువు. అందుకు మాకు గౌరవము కలదు. కాని, ఆయన మాతో ఈ విషయములలో పోరాడునని మాకు తెలియును. నిజమేమిఅనగా ఆయన ఈవఱకే మాతో పోరాడెను. ఏల అనగా 1937-వ సం॥ము సెంట్రలు అసెంబ్లీ కాంగ్రెసు అభ్య ర్థిత్వమునకు సచ్ఛాస్త్రి తిరుమలరావు, కె. సత్యనారాయణ గార్లు దాఖలు చేసిన దరఖాస్తుల విషయములో అన్యాయము జరిగినదని డాక్టరుగా రెఱుగుదురు. శ్రీ కాశేశ్వరరావుగారు

తప్ప తక్కిన బ్రాహ్మణులు అందఱు తిరుమలరావుగారికే ఓటు ఇచ్చిరి. నిజమునకు (i) ఆయన సచ్చాస్త్రి కంటెను వయస్సులో చిన్నవాడు. (ii) విద్యా విషయములోకూడ తక్కువ. ఏల అనగా సచ్చాస్త్రి పట్ట పరీక్షలో ఒక భాగములో తప్పి సాహాయ్య నిరాకరణమొనర్చెను. తిరుమల రావుగారు ఇంటర్మీడియేటులో ఒక భాగము తప్పిరి. (3) సంస్కృతాంధ్ర విద్యా సంపదలలో గూడ చాల వ్యత్యాసముకలదు. (4) ఈ ఎన్నిక వర్గములో సచ్చాస్త్రికి కల రక్త సంబంధ బంధుత్వము చేతను ఈ వర్గము వారి వలె వ్యవసాయ దారుడై తానుకూడ స్వయముగా వ్యవసాయము చేసినవాఁడు అగుటచే తను హెచ్చుగా ప్రజా సమ్మతికలదు. (5) మఱియు తిరుమలరావుగారి కంటె సచ్చాస్త్రికి 1920–వ సం॥ములోనే కాంగ్రెసులో చేరుటచే కనీసము పది వత్స రముల హెచ్చు కాంగ్రెసు సేవ కలదు (6) ఆంధ్రదేశ ములోని ప్రసిద్ధ నవలా రచయితలు పోటీ చేసిన బహి రంగము పోటీ పరీక్షలో సచ్చాస్త్రిగారి నవలకు 500 రూప్యముల బహుమతి వచ్చెను. (7) ఆ నవలను మద్రాసు విశ్వ విద్యాలయమువారు ఇంటర్మీడియేటు పరీక్షకు పఠనీయ గ్రంథముగా జేసిరి. అయినను డాక్టరు, పట్టాభి సీతారామయ్యగారు సచ్చాస్త్రి అభ్యర్థి త్వమునకు తోడ్పడలేదు. ఇఁక 1942 వ సంవత్సరములో సచ్చాస్త్రి మరల తిరుమలరావుగారి స్థానము ఖాళీ అగుటచే ఆ స్థానమునకు ప్రయత్నింపగా (1) ఈ స్థానము

నకు పోటీచేయ వలయునను సంకల్పము లేని అద్దేపల్లి సత్యనారాయణగారి యభ్యర్థిత్వమును (2) తాను బెజవాడ వచ్చి యొక మిత్రుని బళ్లారి జెయిలునకు బంపి (3) జెయిలు నిబంధనలకు వ్యతిరేకముగా (తరువాత ఈ విషయము తెలిసికొని గవర్నమెంటువారు జెయిళ్ళలో ఉన్నవారు ఎట్టి అభ్యర్థిత్వముల మీదను సంతకములు చేయరాదని ఆర్డరుచేసిరి) సంతకము చేయించి తెప్పించిరి. అది మహాత్మాజీ యొక్క "జెయిలునకు వెళ్ళిన సత్యాగ్రహి శాసన నిర్మాణాదికములగు పౌర హక్కులలో మృతతుల్యుఁడే" అను సూత్రమును పట్టాభిజీ యెఱింగియు (5) మఱియు సత్యనారాయణగారు మిల్లు యజమాని యనియు (6) మిల్లు యజమానుల ప్రయోజనములు సహజముగా వ్యవసాయ దారుల ప్రయోజనములకు వ్యతిరేకము లైనవనియు (7) కావున సత్యనారాయణ గారు ఈ నియోజకవర్గ వాంఛలకు ప్రత్యర్థి అని యెఱింగియు (8) మఱియు సత్యనారాయణగారు కాంగ్రెసు ఉచ్ఛస్థితికి వచ్చిన తర్వాత అనగా అప్పటికి సుమారు అయిదేండ్ల క్రిందనే వచ్చి (9) దాని ఫలముగా పాలకొల్లు మ్యునిసిపాలిటీ చైర్మను పదవిని పొందెనని యెఱింగియు (10) స్వార్థ త్యాగమును బహూకరింప వలయునని ఎల్లప్పుడు చాటుచు (11) నిజముగా చాలమంది బీదవారగు బ్రాహ్మణులకు శాసన సభాభ్యర్థిత్వములలో సాయము చేసియు (12) 'సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ'

అనగా 'సర్వమును త్యజించి నన్ను ఆశ్రయింపుము' అను గీతావాక్యాను సారముగా మహాత్మాజీ విద్యార్థులకు 'సర్వము విడిచి నాతో చేరుడని' చేసిన ఆహ్వానమును అనుసరించి కాలేజీలను విడిచిన వారికి సాయము చేయవలసిన బాధ్యత కలదని యెఱిగియు (13) మహాత్ముని ధర్మసూక్ష్మముల ప్రకారము (ఏల అనగా 1942-వ సంవత్సరము వర్కింగు కమిటీ స్థానములో మహాత్ముడు ఉండగా ఆయన ప్రతినిధిగా పట్టాభిజీ ఈ అభ్యర్థుల దరఖాస్తుల అర్హతలను విచారింప వలసినవాఁడాయెను). నిర్ణయము చేయవలసిన బాధ్యతను మీరి (14) మఱియు అభ్యర్థుల పరస్పర వివాదకరములగు హక్కులను విచారించి న్యాయము చేయుట కేర్పడిన ధర్మ నిర్ణేత యగు తాను క్రొత్త దరఖాస్తు దారులను తెప్పింపరాదను ధర్మము నుల్లంఘించియు (15) వయస్సులో పిన్నవాడైనను (16) విద్యలో తక్కువ వాఁడైనను (17) పాలకొల్లు మ్యునిసిపాలిటీకి అధ్యక్షతను పొంది యీ వఱకే కాంగ్రెసు సేవాఫలమును పొందెనని యెఱిఁగియు (18) సహచరుడగుటచే సచ్ఛాస్త్రి స్వయముగా దేశ సమస్యలను చర్చించుకొని పాటుపడ గలవాడని యెఱుఁగుటచే (19) ఆ కేంద్ర శాసన సభాసభ్యత కర్హుడని తెలిసియు శ్రీ డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు అద్దేపల్లి సత్యనారాయణ గారికే ఆ అభ్యర్థిత్వమును ఇచ్చిరి.

123. చాల బహిరంగముగా కన్పట్టుచున్న ఈ ఘోరమగు అన్యాయమును — స్కూలు ఫైనలు లేదా

షిప్తు ఘారము అభ్యర్థులకు, వారు బ్రాహ్మణులు అను హేతు వుచే — హానరబుల్ మెంబరుషిప్పు వఱకు శాసన సభా కార్యక్రమ పరంపరలలోను, గొప్ప ఉన్నతము లగు పట్టణా ధ్యక్షపదవులు మొదలగు వానిలోను—ఆర్థికముగా, పలుకు బడిలో, విద్యా విషయములో, త్యాగశీలతలో ఎందును హెచ్చు లేకున్నను, ఇచ్చుటతో పోల్చినచో వాని యంత రార్థమేమో సూక్ష్మ తరాంశ చర్చ చేయగలిగిన డాక్టరు పట్టాభిగారి కుశాగ్ర బుద్ధియే సమాధానము చేయుటకు చాలినది.

124. ఈ విషయము నిందేల చర్చించితి మనగా (i) ఇదే సూత్రముల మీాద సర్వ హిందూ దేశముమీాద పెక్కు బ్రాహ్మణేతరా భ్యర్థుల అర్హతల నిరాకరింపఁ బడుచున్నవి. (ii) మఱియు ఇది "సంఘ సభ్యత" లకు సంబంధిచిన హక్కులను గుఱించిన సారాంశములకు కూడ సంబంధించి యున్నది. (3) అనగా జాయింటు హిందూ కుటుంబములలో వలె సభ్యత్వముచే 'సంఘముల సభ్యు' లకు హక్కులు సంక్ర మించునా? (5) అనగా దీర్ఘ కాల సేవ (6) స్వల్పకాలసేవ (7) వయస్సులో పెద్దతనము (8) చిన్నతనము మొ॥ ధర్మసూ త్రములు వారికి అన్వయించునా? (9) మఱియు ఎన్నిక వర్గముల వాంఛలు గుర్తింపఁ దగినవా? అనగా వ్యవసాయ దార్ల వర్గమునకు ప్రత్యక్ష శత్రుత్వముకల మిల్లుదార్లను (10) రైతుల వర్గమునకు ప్రత్యక్ష విరోధము కల జమీాం దార్లను ఇట్లు పరస్పర విరుద్ధ ప్రయోజనములు కలవారిని

ఎన్నుకొనఁ దగునా? (11) జూనియరు అభ్యర్థుల యోగ క్షేమములను గురించి విచారించు భాగ్యము గల సీనియరు రాజకీయ వేత్తలు ఆయా అభ్యర్థుల అర్హతలను విచారించి ధర్మబద్ధముగా ఎన్నిక చేయవలయునా? (12) లేక తమ యింటి పెరటిలోని మామిడి చెట్ల పండ్లను వలె తమ యిచ్చ వచ్చినవారికి పంచి పెట్టవచ్చునా? (13) తమ జీవితములను దేశమాత పాదపద్మముల సన్నిధిని 27 సం॥ల నాడు అర్పించిన స్వార్థ త్యాగుల అర్హతలను 12, 13 వ సంవత్సరములకు పిమ్మట చేరినవారి యర్హతల కంటె కనిష్ఠములుగా చేయవచ్చునా? (14) మఱియు అట్టివారి యర్హతలను కాంగ్రెసు ఉచ్ఛస్థితిలోనికి వచ్చిన తరువాత పదవుల భ్రాంతితో వచ్చి ప్రయోజనములు పొందిన వారికంటె కనిష్ఠములు చేయఁ దగునా? (15) వేమవరపు రామదాసు పంతులుగారి వంటి "రాజకీయ వినోదు"ల కంటె కనిష్ఠులనుగా జూడవచ్చునా? (16) 'సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ' అను సూత్రాను సారము తమ సర్వ జీవితము నర్పింప కాంగ్రెసులో చేరి గౌరవ వేతనము నంది అదికూడ లేకయే కాంగ్రెసు సేవ చేయుచున్నవారి విషయములో కాంగ్రెసు నాయకుల కెట్టి బాధ్యతలును లేవా? (17) స్వార్థత్యాగులై లంచముల కాశపడక తమ జీవిత సమస్యలను పరిష్కరించు కొన్న కాంగ్రెసు సేవకుల యర్హతలను (18) లంచగొండ్ల కంటెను "అంకౌంట్లు లేని అకౌంట్ల నాయకు"ల యర్హతల కంటెను కనిష్ఠములుగా జూచుట న్యాయమా?

ప్రత్యక్ష పరోక్షములుగా ఈ సమస్యలు సచ్ఛాత్రి అభ్యర్థిత్వ నిరాకరణముతో సంబంధించి యుండుటచే ఇందు చర్చించి అట్టి అన్యాయములు భవిష్యత్తు నందును జరుగకుండుటకై ఈ విషయమును కాంగ్రెసు వర్కింగు కమిటీవారి దృష్టికి తెచ్చితిమి. అభ్యర్థిత్వముల తుది పరిష్కారములను చేయులోగా తమ తమ అర్హతల వివరములను ఆ యా అభ్యర్థులు వర్కింగు కమిటీ వారికి నివేదించు కొనుటకై ఇందు 7–వ అనుబంధమును చేర్చితిమి.

125. ఈ సందర్భములో ఒక విషయమును విన్నవించుకొన వలసి యున్నది, కేంద్ర ప్రభుత్వమునందుకాని రాష్ట్ర ప్రభుత్వములలో గాని రియల్ ఇండియన్ నేషనల్ కాంగ్రెసుపక్ష మెట్టి అధికారమును కోరుటలేదు. (2) ఈ పక్షము వారు అవలంబించిన కార్యక్రమ ఫలితము ప్రజల కొఱకే (3) నిజమునకు ఇదియొక రాజకీయ పక్షమునుకాదు (4) ఆంగ్ల భాషలో 'పార్టీ' అనుట కంటెను ఆంధ్ర భాషలో 'పక్షము' అనుట కంటెను మంచి పదము లేకుండుటచే ఈ పదమును వాడవలసి వచ్చినది (5) ఇది నిజమున కొక 'రాజకీయ సిద్ధాంతము'. మఱియు ఈ సిద్ధాంతము వారికి వర్కింగు కమిటీతో విదేశ రాజకీయములలో గాని, స్వదేశ రాజకీయములలో గాని, సంఘ సభ్యత్వ ప్రమాణ పత్రములో గాని కాంగ్రెసు తలపెట్టిన సాంఘిక మత విషయిక సంస్కారములలో గాని అనగా దేవాలయ ప్రవేశ శాసనము, గర్భాలయ స్వయం

పూజ ఇత్యాదులలో ఎట్టి భేదమును లేదు. ఒక్క ముక్కలో చెప్పుటకు వర్కింగు కమిటీవారి కార్యక్రమములో భేదాభిప్రాయము మాకు లేదు, (4) "పార్టీ" లేక "పక్షము" అను పదము మాకు అన్వయించునని వాదసౌకర్యము కొఱకు అంగీకరించినను ఈ పక్షమునకు బహుశః సంఘర్షణల కవకాశమిచ్చు (చీనాలో నేటి కమ్యూనిస్టు పక్షమునకు వలెనుబహుశః ఇండియాలో కమ్యూనిస్టు పక్షమునకు భవిష్యత్తునందునువలె) విదేశ లేక విజాతీయ సంస్థలతో సంబంధము మాకు లేదు. అందుచే "పార్టీ లేక పక్షము" అను పదము మిమ్ములను కలవర పెట్టనక్కఱ లేదు. (6) మఱియు మేము దేశములో ఉండి జాతిని పీడించు జాతీయ సంఘమును గాము. (7) మఱిమేము "ఇండియన్ నేషనల్ కాంగ్రెసు" వారము. ఈ పక్షము ఈ గడ్డమీాదఁ బుట్టినవస్తువే. (8) మఱియు మేము కోరు సంస్కరణములు అన్నియు కాంగ్రెసువారు కరాచీలో అంగీక రించిన ప్రాథమిక సూత్రముల తీర్మానములో కలవియే, సాంఘిక, మత విషయములలో ఆ తీర్మానములో గల సూత్రముల నతిక్రమింపని సంస్కరణములను మఱి కొంత వేగముతో చేసి నేడు హిందూ సంఘమును (i) బ్రాహ్మణులని (ii) శూద్రులని (iii) పంచములని విభజించు భేదమును వెంటనే తొలగింపవలయు ననియే మా సంకల్పము.

126. కాని, ఈ అత్యంత సందిగ్ధ సమయములో మేము ముఖ్యముగా కోరునదేమనగా కేంద్ర ప్రభుత్వములో

గాని, రాష్ట్ర ప్రభుత్వములో గాని ద్విజాధికసంఖ్య ఉండ రాదు — ఆ రాజ్యాధి కారము పంచములు, బ్రాహ్మణులు, శూద్రులు అను మువ్వురకు వారి వారి స్వసంఖ్యానుగుణముగా సమముగా ఉండవలయుననియే.

127. దురదృష్ట వశాత్తు స్వభావమునందును, నిర్మాణము నందును సాంఘిక, రాజకీయ, మత విషయములలో ఒకదాని కొకటి చాల భిన్నముగా ఉన్న ఈ సంఘముల ప్రత్యేకత్వమును ఆ వర్కింగుకమిటీ గుర్తింప నిచ్చగింపదు.

128. పంచములనువారు చాల ఘోరమగు దుస్థితిలో కాదన వీలులేసి పెక్కు అనర్హతలతో ఉండుటచే ప్రత్యేక రక్షణ వారికి ఉండవలయును అను సూత్రమును వారు అంగికరించిరి.

129. ఇక ప్రశ్నమేమి అనగా (i) బ్రాహ్మణులును (ii) శూద్రు లనబడు బ్రాహ్మణేతరులును సర్వ సమానత్వము మీద ఆధారపడిన—ఇందెవరికిగాని ఏ విధములగు ఎక్కువ హక్కులును లేని ఏక సంఘమేనా ?

130. ఈ దృష్టితో విచారించి చూచినచో వీరిరువురు పరస్పరము విరుద్ధమై (ii) మనస్తత్వములోనే భేదించు భిన్న జాతులు. బ్రాహ్మణులు శూద్రు లనువారి కర్బకత్వము చేయు నధికారము, బ్రాహ్మణ ధర్మమును అనుష్ఠించు

నధికారము లేదని తమ కన్యకలను వివాహమాడు నధికారము లేదని వాదింతురు. ఇక్లే 9-వ అనుబంధములో ఉదహరించిన హక్కులు వీరికి లేవందురు. శూద్రు లనువారు తాము శూద్రులము కామని ఆ హక్కు లన్నియు తమకు కలవని వాదింతురు.

131. దురదృష్ట వశమున తమ సంఘము యొక్క యావత్తు సాధన సంపత్తిని తిని—దేహములోఁ బ్రవేశించిన మలేరియా పురువు వలె—ఆశ్రయ మిచ్చిన వస్తువునే నాశము చేయు, తన జాతి మీాద నివసించు పరాన్న భుక్కు అగు బ్రాహ్మణుఁడు వ్యాఘ్రము, మేకల వలె పరస్పర విరుద్ధ వస్తువులు ; అయినను ఈ విషయమును మహాత్మాజీకి మేము వ్రాసిన లేఖలో చెప్పినట్లు "...........21-వ తేదీని నామకరణోత్సవమును, ౬-వ మాసములో అన్నప్రాశనము మఱి పెక్కు శుభాశుభ కర్మ కాండలను బ్రాహ్మణుడు చేయుచు యావజ్జీవ సంబంధము కల్గి భూదేవుఁడని విశ్వసింపబడుటచే" తనను నాశము చేయు విరుద్ధ వస్తువునుగా శూద్రు లనువారు భావించుట లేదు.

132. ఈ పరాన్న భోక్తృత్వమే, మహాత్ములను, రాష్ట్రీయ కాంగ్రెసు అధ్యక్షులు మొ॥ పెక్కురు రాష్ట్ర నాయకులను మా పక్షమును అణగఁ ద్రొక్కుటకు యత్నించునట్లును రాజగోపాలాచారియరు మొదలగు హిందూదేశ నాయకులచే, బ్రాహ్మణ బ్రాహ్మణేతర సమస్యను దుష్టమైన దానినిగా ప్రదర్శించు నట్లును చేయుచున్నది.

అందుచేతనే ఈ మహానాయకులు, రియల్ ఇండియన్ నేషనల్ కాంగ్రెసుతో పోరాడిరి. "కీర్తివాంఛ మహాపురుషుల హృదయ దౌర్బల్యము" అని మిల్టను మహాకవి చెప్పెను. "కీర్తివాంఛ" అనుచో "స్వకులవాంఛ" అని చదివినచో మన దేశస్థితి కది అన్వయించును. అందు చేతనే "బ్రాహ్మణులు "జాతీయత" అని శూద్రులనువారికి బోధించుచున్నారు. కాని, బ్రాహ్మణులు అనువారి మధ్యను శూద్రు లనువారి మధ్యను ఏమి జాతీయత కలదు ?

133. "ప్రపంచము నా మనోభావము" అని జర్మను తత్వవేత్త షోపన్హారు చెప్పెను. నిజమునకు "దేవుడును మన మనోభావమే" అనగా దేవుని ఎవఁడెట్లు అర్థము చేసికొను చున్నాడో అతని కా విధముగా ఉండును. మనము శరీరమును విడిచి దేవుని జేరి ఎట్లున్నాడో తెలిసికొని రాఁజాలము. ఆయన మాటలను విన జాలము. "వేదములు, ఉపనిషత్తులు, భగవద్గీత ఈశ్వరుని వాక్కులని నమ్ముడు" అని బ్రాహ్మణులు కోరుచున్నారు.

134. అవి నిజముగా ఈశ్వర వాక్కులో కావో ఋజువు చేయుటకు ఆ పవిత్ర గ్రంథములలో "ఈశ్వరుని పవిత్రత" అనగా ఈశ్వర స్వరూపమగు సత్యము కలదా లేదా యని పరిశీలించి తెల్సుకొనవలయును.

135. ఈ ప్రమాణమును బట్టి పరిశోధించుదుమేని "స్త్రీయోశూద్రా స్తథావైశ్యాః యేపిస్యుః పాపయో

నయః" స్త్రీలు, శూద్రులనువారు వైశ్యులు పాపాత్ములు అను గీతావాక్యము సత్యము కాదు. ఈ జాతులవారు సృష్టి అంతము వఱకు ఏ పాపమును చేయకయే పుట్టుక నుండియే పాపాత్ములు కాఁజాలరు. "వేదాను గుణ మగు ధర్మశాస్త్ర" మనబడు గౌతమ ధర్మ సూత్రములు చెప్పిన "అంత్యః పాపిష్ఠః" శూద్ర భర్త వలన బ్రాహ్మణ స్త్రీకి జన్మించినవా రనబడు పంచము లనువారు ఏ పాప మెఱుఁగకయే పుట్టుక నుండియు పాపాత్ములు కాఁజాలరు.

136. "వర్ణము" అనునది 'జన్మ పూర్వ నిర్ధారిత మగు మనుజుని జీవన వృత్తి' అను సూత్రము కూడ ఈ దృష్టితోఁ జూచినచో సత్యము కాదు. ఏల అనగా ఆ వర్ణ వృత్తి యనబడునది ఈశ్వరుని ప్రతినిధి యగు మన యంతరాత్మతో (i) కసాయివాని వృత్తి (ii) బోగము వృత్తి (iii) కల్లుతీసి యమ్ము గౌండ్ల వృత్తి మొదలగు వాని విషయములో వలె ప్రతిఘటించు చున్నది. మఱియు 'బ్రాహ్మణోస్యముఖ మాసీత్ బాహూ రాజన్యః కృతః' ఇత్యాది పురుష సూక్త దైవ సూక్తిని బట్టి వర్ణ వృత్తులనఁ బడునవి నాల్గును ఒక్క మనుజుని యందే యున్న చతుర్విధమై అవిభాజ్యమైన ఐక్యవస్తువు అని స్పష్టమగుటచే ఆ సూత్ర మునకును వ్యతిరేకముగా ఉన్నది.

137. "బ్రహ్మహమస్మి" అని తైత్తిరీయోపని షత్తులో భగవంతుడు ఘోషించెను. కనుక మనుజుడు ఈశ్వ

రుని గూపమే. భగవంతుడు చతుర్వర్ణాత్మకమగు ఏక వస్తువే. అట్లే మనుజుడును నాల్గు వర్ణములతో గూడిన ఏక వస్తువు. ఇది సనాతను లనబడు బ్రాహ్మణుడును శూద్రుడై జన్మించి యుపనయనముచే ద్విజత్వము నందుటలో అనుష్ఠించుచునే యున్నాడు. మఱియు 'బ్రాహ్మణ క్షత్రియ విశాం శూద్రాణాంచ పరంతప కర్మాణి ప్రవిభక్తాని స్వభావ ప్రభవైర్గుణైః' అని చెప్పుటలో స్వభావ మనగా "స్వస్య భావే" అనగా 'తన మనస్సులో జన్మించిన అభిప్రాయముల ననుసరించి' ప్రభవై 'జన్మించిన' అని చెప్పెను కాని, కులభావ భవైర్గుణైః, పితృభావభవైర్గుణైః' అని చెప్పలేదు. అనగా కులమువారి అభిప్రాయములను బట్టి, తండ్రి భావములచే జనించిన గుణములను బట్టి అని చెప్పలేదు. అందుచే "వర్ణ సిద్ధాంతమునకు ప్రాతిపదిక 'స్వభావమే' అనగా స్వీకరించువాని స్వయం నిర్ణయమే. మఱియు జన్మ పూర్వ నిర్ధారిత జీవన వృత్తి యనునది వ్యక్తి స్వాతంత్ర్యమును చంపుచున్నది. అది యంతరాత్మ ప్రబోధించిన వృత్తిని స్వీకరించుటకు అవకాశ మీయదు. ఒక వ్యక్తి స్వాతంత్ర్యము నేది చంపునో అది సంఘ స్వాతంత్ర్యమును చంపును. ఈ సంఘ స్వాతంత్ర్యమును చంపుటే—క్షత్రియ వృత్తిని ఒక కులమువారి దని కోట్లకొలది శూద్ర పంచమాదులను హింసించి ఆ క్షత్రియుల మనుకొను కొలది కుటుంబముల వారి కిచ్చినది. కాలక్రమమున క్షత్రియులుతమవృత్తినిమానగా దేశ రక్షణము ఎవరి వృత్తియు గాకయు ఆవృత్తిలో ఉన్న కొలది

క్షత్రియుల బలము చాలకయు స్వరాజ్యమే పోయినది. కావున వర్ణమనునది నాల్గు ఆత్మ పవిత్రీకరణ వర్ణ వృత్తులతో క్రమాభి వృద్ధినంది భూదేవత్వ సిద్ధిని పొందుట. మఱి యిట్లే శూద్రులై జన్మించియే సనాతను లనువారును బ్రాహ్మణు లగుచున్నారు.

138. అట్లే "పంచములు" అను వాదము అసత్యము. వారును జన్మచే శూద్రులై తక్కినవా రందఱి వలెనే ఈ జన్మలోనే బ్రాహ్మణత్వము పొందుటకు తగిన వారు.

139. ఈ విన్నపములో ఇంత హెచ్చుగా మతచర్చఏల అను ప్రశ్నవచ్చుటసహజము. వైశ్యత్వ,క్షత్రియత్వ, బ్రాహ్మణత్వ హక్కులను శూద్రు లనువారికి, పంచము లనువారికి రాఁబోవు స్వరాజ్యము నందు సిద్ధింపఁ జేయుట కనీసము హిందువుల విషయములో అనుల్లంఘనీయ మగు ప్రథమ విధి. నిజమునకు ఆ హక్కులను పునరుద్ధరింపనిచో అష్టాదశ మహాపాపులగు ఆర్య బ్రాహ్మణుల నేటి యీ హిందూమతములో ఈ జాతు లుండవలసిన యవసరము లేదు. నేటి ఈ బ్రాహ్మణమత మీ జాతులకు కనని, వినని సృష్టిలో సాటి లేని నరకము.

140. ఈ ఆర్య నిరంకుశ బ్రాహ్మణులు నిజముగా తమ మతమును పేర పిలువఁబడు పాప మతమును పవిత్ర గ్రంథములను పేర "వేదములు, భగవద్గీత" మొదలగు

పేరులతో పిలువఁబడు "పాపమత గ్రంథము" లను శూద్రులనువారి మీాద పంచములనువారి మీాద ప్రయోగింపఁజాలరు. మఱియు ఆ పాపమత గ్రంథములు శూద్రులను వారియు, పంచములను వారియు, (i) అధ్యాత్మిక (ii) సాంఘిక (iii) రాజకీయ (iv) మతవిషయిక జీవితములను, నాశము చేయుచున్నవి. అవి అష్టాదశ మహా పాపులగు ఆర్యులు శూద్రు లనువారిని, పంచము లనువారిని నాశము చేయుటకు పన్నిన యురిత్రాళ్లు. వాని మాతృకలు ద్రావిడ భాషలో లేవు. అవి ద్రావిడుల పవిత్ర మత గ్రంథములును కావు. ద్రావిడులకా మత గ్రంథములను అంగీకరింపవలసిన బాధ్యతయు లేదు. అవి వారి భాషలలో వ్రాయఁబడ లేదు. వారి కందలి విషయములు తెలియవు. అందుచే వారా మత గ్రంథము లనువానిని బట్టియే తమ సమస్యలను పరిష్కరించు కొనవలయునను నియమము లేదు. వానిని అంగీకరించుట అంగీకరింప కుండుట వారి యిష్టము. కాని, యవి దుష్టగ్రంథములు అగుటచే (i) వేదములు (ii) గీతలు, (iii) పురాణములు (iv) స్మృతులనబడు దుష్ట స్మృతులు (v) ధర్మ శాస్త్రములనబడు అధర్మ శాస్త్రములు (vi) ఆగమములనబడు దుష్ట ఆగమములు (vii) ఇతిహాసములు మఱియు యితర ఆర్యమత గ్రంథములు అన్నియు ద్రావిడ సంప్రదాయ సిద్ధములు కానివగుటచే బ్రాహ్మణేతరుల విషయములో అవి చెల్లవని ప్రకటింప బడవలయును.

141. ఈ అంత్యత క్లిష్ట జాతిసమస్యలో మేము బ్రాహ్మణులకిచ్చు సలహా ' బ్రాహ్మణుడా ! రాజకీయమును విడువుము ' అనియే. ఏల అనగా పరస్పర విరోధ భావములు లేని యైక్యతగల ఏక హిందూ సంఘ నిర్మాణము – అవసర మగుచో సర్వ ప్రపంచముతోడను పోరుట కొఱకు – బలిష్ఠ మగు భారత దేశ ప్రభుత్వ స్థాపనకు చాల అవసరము. మహాకవి భవభూతి " పాములవాడున్నచోట పాము ప్రతిభ యెట్లు శోభించును ? " అని చెప్పినట్లు దేశమును విభజించి పాలించుటయే జన్మ నీతి గాగల బ్రాహ్మణు డున్నచోట శూద్రు లనువారి, పంచము లనువారి ప్రతిభ శోభింపదు. 5000 సం॥ములనుండి నాశము చేయబడిన ఈ రెండు జాతులు నేడు చాల దుస్థితిలో చాల అంతర్భేదములతో చాల దుర్బల స్థితులలో ఉన్నారు. మలేరియా పురుగు శరీరములో ఉండియు తాత్కాలికముగా వ్యాధి తగ్గినట్లు కన్పట్టు రోగి బ్రదుక జాలనట్లు చీల్చి, భీభత్స చేసి పరిపాలించు బ్రాహ్మణుడు వీరిలో ఉండగా ఈ జాతుల ప్రతిభ శోభింపదు. అందుచే ఈ రెండు జాతులకు సంపూర్ణాభి వృద్ధి నందుటకు సంపూర్ణ స్వాతంత్ర్యము అవసరము.

142. బ్రాహ్మణుఁడు వీరి మధ్యనుండుటనగా ఈ రెండు జాతుల మీదికెక్కి రాజ్యము చేయుట. మఱి ఆ 18 నిషేధములను (ఘూాఅనుబంధము) అనగా అర్చకత్వ, బ్రాహ్మణ ధర్మానుష్ఠానార్హతా నిషేధము ఈ మొదలగు వానిని అమలులోనుంచి నాశము చేయుటయే, ఈ సమయ

ములో బ్రాహ్మణత్వ విషమును మన జాతీయ జీవితము నుండి కడిగివేయ వలసిన తరుణమువచ్చినది. బ్రాహ్మణ రాజకీయవేత్త యెంత పవిత్రుడైనను అతడు తనసంఘములోని భాగమే. మహాత్మాజీ 1917, 1918 సం॥ లలో తాను యుద్ధ భటులను ప్రథమ ప్రపంచ యుద్ధమునకు సేకరించు విషయమును గూర్చి "వ్యక్తులు యెంత అసమ్మతితోనున్నను తమకు విరుద్ధమైన కార్యములలోనికిలాగబడక తప్పదు" అనిచెప్పినట్లు వారును బ్రాహ్మణసంఘకార్యక్రమములోనికి దింపబడుదురు మఱి బ్రాహ్మణసంఘమో వారి యుద్దేశములను మార్చుకొన లేదుకదా ? బ్రాహ్మణ కన్యకలను పెండ్లి చేసికొనుటకు పంచము లను వారు అర్హులని, అర్చకత్వమునకు అర్హులని యే రాజకీయ వేత్తయు చెప్ప లేదు. మఱియు బ్రాహ్మణ కులమువారు శూద్రు లనువారి పైని అమలులోఉన్న 18 నిషేధములను తొలగించి తమ మత పరిషత్తులలో సర్వ హిందూ దేశ దృష్టితోను ప్రతి రాష్ట్రములోను అంగీకరించి తీర్మానములు చేయలేదు. మఱియు చెడు త్రోవలోనికి దింపుటలో బ్రాహ్మణ రాజకీయ వేత్తల శక్తి అపారము. ఈనాము రైతులను నాశముచేయు హిందూలయోన్నత సమస్యయగు "మద్రాసు ఈనాముల" విషయములో బ్రాహ్మణేతరుల చేత సంతకములు పెట్టించి రిపోర్టు వ్రాయగలుగుటయే అందుకు తార్కాణ. అందుచే ఈ సందిగ్ధ సమయములో బ్రాహ్మణ నాయకత్వము కౌరవులలోచేరి బుద్ధిపూర్వకముగా

వారి సామ్రాజ్యమును చక్రవర్తి యగు దుర్యోధనుని కుటుంబ సమేతముగా నాశము చేసిన శకుని నాయకత్వము వలె అంతర్ధ్వంసము చేయునది. అందుచే "బ్రాహ్మణుడా! రాజకీయము విడిచిపెట్టి మహాత్ముని వలె సలహా అడిగినప్పుడెల్ల ఇచ్చుచుండుము" అను నది యొక్కటే నేడు భారత రాజకీయములో తగిన ధర్మ సిద్ధాంతము. కాని, బ్రాహ్మణుడు ఈ సలహాను అంగీకరింపడు అని యెఱుఁగుదుము.

143. నేటి బ్రాహ్మణ (ద్విజ) రాజకీయ వేత్తల ఉదార రాజకీయ సూత్రములను విచారింతము (1) 'జాతీయత'ను బహుశః ఇంగ్లండునుండి అమెరికానుండియు సంగ్రహించెను (2) కాని బ్రాహ్మణుని మధ్యను శూద్రు లను వారి మధ్యను జాతీయత కలదా? (3) తాను తన కన్యకను వారు వివాహము చేసికొనరాదని, శూద్రులనువారి కన్యకలను పెండ్లిచేసికొన నర్హత కలవాడనని యవమానము చేయు విజాతీయుఁడు కాడా? (4) దృష్టి దోష స్పర్శ దోషాదులను యజ్ఞ సంతర్పణ, మత పరిషత్తులు మొ॥లో సర్వ హిందూ భూమిలో శూద్రులనువారి విషయములో పాటించుట లేదా? (5) బ్రాహ్మణత్వ, వేద, అర్చకత్వ నిషేధములను చేయుచు వారిని నీచులుగా చూచుట లేదా? ఈ నీచతలను శూద్రులనువారు సహించుట గత్యంతరములేక కాదా? బ్రాహ్మణత్వ నిషేధము వారికి ఆధ్యాత్మిక హత్య కాదా? దేవుని

పేర, వేదము పేర చేయు మోతుమునే నిషేధించు ఈ హత్య లకు మెడలు కోసి చేయు హత్యలు సాటియగునా ?

144. ప్రపంచముతో ఎందును తనను అవమాన పరచుచున్న వ్యక్తిని, సంఘమును గౌరవింప వలయునను "మనుజ ధర్మ శాసనము" కాని "దైవిక ధర్మ శాసనము" కాని లేదు. ఈ ధర్మ సూత్రము మీదనే నెహ్రూజీ గాంధీజీలు రెండవ ప్రపంచ యుద్ధములో హిట్లరు ఘోర యుద్ధము విషయములో ధర్మము కొఱకు పోరాడుచున్న బ్రిటనుకు తోడ్పడుట అర్హమని యొప్పుకొనియు సమానత్వ మున కంగీకరింపని చర్చిలు మహా మంత్రియొక్క సైన్య శిబిరములలో ఆయన సేనాధిపతులకు తోకగా ఉండజాలమని "క్రిప్సు ప్రణాళిక" సందర్భములో తిరస్కరించిరి, ఈ స్థితి గతులే బ్రాహ్మణులు శూద్రు లనువారి విషయములో అవలంబించుచున్న కార్యక్రమములోను కలవు. ఈ రెండు జాతుల మధ్యను బ్రదుకులో గాని చావులోగాని (పేల అనగా చచ్చి బ్రాహ్మణులు భయముచే విడిచిన బ్రాహ్మణ కలరా శవముల వంటి వానికిని దయతో దహన కర్మచేయు టకును బ్రాహ్మణులు అంగీకరింపరు.) జాతీయత లేదు. ఇరువురు రెండు జాతులు.

145. "అర్హత" 'గుణాధికత' అను సూత్రములను జెప్పి రాష్ట్రీయమంత్రి వర్గములలో, ఉన్నతములగు ఐ.సి.ఎస్. మొ॥ వానిలోను, మధ్యమములగు గజెటెడ్ ఆఫీసుల వంటి

వానిలోను, సామాన్యములగు గుమాస్తా స్థానములు వగై రాలలోను బ్రాహ్మణుడు హరించుచున్నాడు. నేడు కేంద్ర ప్రభుత్వపు 'ఎగ్జిక్యూటివ్'లో మెజారిటీస్థానములు హరింప నున్నాడు. బ్రాహ్మణుడు ఆర్యుడు అగుటచే విజాతీయుడు. మఱియు విజాతీయతను (i) శూద్రులను స్త్రీల నవమాన పరచుట (ii) బ్రాహ్మణత్వ నిషేధము, దృష్టి దోషము పాటించుట ఈ మొదలగు వానిలో నేడు కూడ అనుష్ఠించు చున్నాడు. విజాతీయతను నేడు కూడ అవలంబించుచున్న విజాతీయుని గుణాధికత (నిజముగా లేదు) అను నది ఫ్రెంచి వారి ఆధిక్యము, సిరియనులకును బ్రిటిషు ఐ. సి. యస్. వారి గుణాధికత అనంబడునది భారతీయులకును రుచింపనట్లు ద్రావిడ ప్రజలకు రుచింపఁజాలదు. అందుచే అది 'సహా జాకర్షణ'తో గూడ మిళితమై యుండినదే సూచించును. ఆ యోగ్యత తాను నీచులనుగాఁ జూచుచున్న శూద్ర పంచ ముల నుండి బ్రాహ్మణుడు బలాత్కారముగా పొందఁజాలడు. కావున పరస్పర మన్య జాతీయులగు ఈ యిరువుర మధ్య 'గుణాధికత' సూత్రము అన్వయింపదు.

146. మెజారిటీలకు రక్షణము అనవసరము అని కొందఱు రాజకీయ వేత్త లనుచున్నారు. ఇది అసత్య సిద్ధాంతము. అనేక సందర్భములలో మెజారిటీలే రక్షణమును కోరుచుండును. మైనారిటీయగు జపాను చేతిలోనుండి అమెరికా రక్షణము లేనిదే నేడు చీనా జీవింపఁజాలకపోయెడిది. మఱియు పెక్కు రెట్లు చిన్నది యగు బ్రిటిషు దేశము

హిందూ దేశమును పరిపాలించుట చరిత్రాంశము. ప్రకృతిలోకూడ మెజారిటీలగు, మేకలు, ఆవులు మొదలగునవి పులులు, సింహములు మొ॥ వాని నుండి రక్షణను కోరు చున్నవి కదా ?. (సప్రూ కమిటీకి మేము పంపిన మెమోరాండము చూ.)

147. అందుచే ఈ రాజకీయసిద్ధాంతములను అంగీకరించినచో (i) ప్రత్యేక నియోజకవర్గములు (ii) ఏకముఖ నియోజకవర్గములు (విశ్వవిద్యాలయ నియోజకవర్గము జమిందారీ నియోజకవర్గము, వంటివి) (iii) స్థానములురిజర్వు చేయుట (iv) బహుముఖ నియోజకవర్గములు (అనగా జమీందారులు రైతులు, వగైరాలను అనగా పరస్పరవిరోధులను కలిపిఏక నియోజకవర్గములోఉంచు ఇప్పటి జెనరల్ నియోజక వర్గములవంటివి.) ఈ విషయములను చర్చింపవచ్చును.

148. రాష్ట్రీయ మంత్రి వర్గముల నిర్మాణముల విషయములో కూడ "బ్రాహ్మణుడా! రాజకీయమును విడిచిపెట్టుము" అను సూత్రమును అమలులో నుంచవలయును. కాని,దానిని బ్రాహ్మణుడంగీకరింపనిచో ఆరాష్ట్రముయొక్క బ్రాహ్మణేతర హిందూ జన సంఖ్యతో తన జన సంఖ్యను పోల్చి చూడగా వచ్చు వాటాను బట్టి వచ్చుస్థానము లతనికి మంత్రి వర్గములోను, పార్లమెంటరీ సభ్యత్వాదుల లోను ఈయవలెను. కేంద్ర ప్రభుత్వములో అట్లే అదే సూత్ర

మును బట్టి శాసన సభలలోను మంత్రి వర్గముల లోను తగిన స్థానములనే ఈయవలయును.

149. అన్ని రాష్ట్రముల లోను (i) బ్రాహ్మణేతర హిందువులకు, (ii) బ్రాహ్మణులకు, ద్విజులకు (iii) పంచము లనువారికి (iv) ముస్లిములకు మొ॥ వారికి చాల న్యాయముగా వారి వారి స్థానములను పంచిపెట్టు పద్ధతి యేది యనఁగా "ఏ యే రాష్ట్రములో ఏ యే సంఘము—అన్ని సంఘములు కలిసిన రాష్ట్ర ప్రజా సంఖ్యలో ఎన్నవపాలుగా ఉండునో—ఆ సంఘమునకు అంత పాలును రాష్ట్రీయ శాసన సభలలోను మంత్రి వర్గములలోను ఇచ్చుటయే." ఈ పద్ధతిని సర్వహిందూ దేశము మీఁదను కేంద్ర శాసన సభల విషయములోను కేంద్ర మంత్రి వర్గము విషయములోను అవలంబింప వలయును

150. హిందూ సంఘములో అంతర్భాగములను (i) బ్రాహ్మణులకు (ii) శూద్రు లనువారికి (iii) పంచములనువారికి—ఇట్లు కోరుట చాల విషాదకరమే అయినను—ప్రత్యేక నియోజక వర్గములను పరివర్తన కాలమును నిర్ణయించి ఆ కాలము నందు ఏర్పాటు చేయవలయును. ఈ కాలములో రాజకీయ, సాంఘిక ఆధ్యాత్మిక మత విషయములలో కొఱవడి యున్న యీ రెండు సంఘములు తగిన నిర్మాణములను ఆ సంఘముతో సమ మగు నట్లు చేసికొని బ్రాహ్మణ సోదరులతో పాటు హిందూ దేశ

రాజ్యాంగ నాయకత్వమును వహించుటకుఁ జాలినవారు అగుదురు.

151. వారి వారి నియోజక వర్గములలో బ్రాహ్మణులకుగాని బ్రాహ్మణేతరులకుగాని వారి వారి జనసంఖ్యా బలముచే వచ్చు వాటా కంటె "అధిక స్థానము" లను ఈయరాదని వేఱుగా చెప్పనక్కఱలేదు. ఆ సభ్యత్వ సంఖ్య ఆ దేశపు సర్వ సంఖ్యలో వారి సంఖ్య ఏ పాలో ఆ పాలును బట్టియే యుండవలయునని చెప్పితిమికదా ?

152. హిందూ దేశములో ఏరాష్ట్ర శాసన సభలకును కనీసము 120 మందికి తక్కువ సభ్యులుండ రాదు. బొంబాయి, కలకత్తా, మద్రాసు వంటి పెద్ద రాజ ధానుల శాసన సభలకుకూడ 350 కంటె హెచ్చు మంది శాసన సభ్యులుండరాదు.

153. హిందూ దేశములో ఏ సంఘమునకును జన సంఖ్య వంతుచే వచ్చుదానికంటె అధిక సంఖ్య మంత్రి వర్గములలోకాని, శాసన సభ్యులలోకాని, యుండరాదు. కాని, కోటికంటె తక్కువ సంఖ్య కలిగి భారత దేశములో చాల ప్రాముఖ్యమగు స్థితిలో ఉన్న సిక్కులవంటి హైందవేతర సంఘములలో మంత్రి వర్గములలో ఒక్కస్థానమును కూడ పొందజాలని (ప్రాక్షను) (అసంపూర్ణ స్థితి) ఏర్పడి నప్పుడు ఒక్క స్థానమును గాఁజేయుటకు 'అధిక ప్రదాన మును' చేయవచ్చును.

154 ఏ రాష్ట్ర మంత్రి వర్గములోగాని, 15 గురు కంటె తక్కువ మందిగాని, 20 మందికంటె హెచ్చుగా గాని యుండరాదు. కేంద్ర మంత్రి వర్గములో 25 సభ్యులుండ వచ్చును. అన్ని మంత్రి వర్గములందును అయిదింట మూడు వంతులను ప్రధానామాత్యులు ఏ సంఘమునకును అధిక స్థానములీయక జనసంఖ్య వంతుల వారిగా "హెచ్చుగా "శాసనసభా సమ్మతిని పొందువారు" అను సూత్రమునుబట్టి తీసికొనవలెను. తక్కిన అయిదింట రెండు పాళ్లను అన్ని సంఘములకును చెందిన కులతత్వ వ్యతిరేకులైన జాతీయ వాదులనుండి ఆయా మంత్రి వర్గములకు చెందిన శాసన సభలు తమలో నున్న జమీందారులయు, యూనివర్సిటీల, సర్వ కులములయు ఈ మొ॥ అన్ని వర్గ ప్రతినిధుల చేతను కలిసి ఎన్నుకొనబడవలయును. మంత్రివర్గములోని ఈ భాగము యొక్క యెన్నికలో 'ఆయా కుల, మత, సంఖ్యాను గుణ భాగము' అను సూత్రమునకు తావు లేదు. కుల తత్వ వాది గాక "భారత భూమి మొదట కులము తర్వాత" అను భావముకల్గి యుండువారికిఁ ప్రాధాన్య మీయ వలయును.

155. ఈ విన్నపమును ముగించుటలోగా అపో హాకు అవకాశ మిచ్చు ఒక విషయమును ఇచ్చట చెప్ప వలయును. (i) సద్బ్రాహ్మణ మతమును (ii) ది రియల్ ఇండియన్ నేషనల్ కాంగ్రెసు పక్షమును ఈశ్వర ప్రేరణముచే స్థాపింపఁ బడినవని గతించిన పేరాలలో

చెప్పితిమి. (ఈ విన్నపములో 82, 83 పేరాలను చూ.) అందు బహుశః అపోహకు అవకాశ మిచ్చు సందర్భములు ఉండవచ్చు నని యిప్పుడు స్ఫురించు చున్నది. దానిని ఉదహరించుటకు హేతువు ఈ ఉద్యమ జనకుఁడు దీనిని స్థాపించుటలో కేవల నిమిత్త మాత్రుఁ డనియు, ప్రారంభ రహితుఁడనియు చెప్పుటకును మఱియు ఈ ఉద్యమ ప్రారంభ చరిత్రమును ప్రపంచమునకుఁ జూపుటకును మాత్రమే.

156. తమ పవిత్ర సంస్థ లోనియే సభ్యుని విషయములో నేని, వ్యక్తి గౌరవము యొక్క హద్దులను ఉల్లంఘించినచో క్షమింపఁ బ్రార్థితులు. ఈ విన్నపమును చాల వేగముగా అనగా ఆఱు రోజులలో ఊహించుటయు, ముగించుటయుఁ జరిపితిమి. నేడు భారత భూమిని పరిపాలక జాతులగు ఆర్య బ్రాహ్మణులు, ముస్లిములు, బ్రిటిషు వారును తక్కిన జాతులకు తగిన భాగము లేకుండఁ జేసి అనఁగా—ఆస్తి దృష్టితో జూచినచో "హిందూ సంఖ్యలో నాల్గింట మూఁడు వంతులును, జన సంఖ్య దృష్టితో జూచినచో మూడింట రెండు వంతులునుగా ఉన్న శూద్రు లనువారి హక్కులను నిర్లక్ష్యము చేసి తమ హస్తగతము చేసికొనుచున్నారను ఆందోళనము చేతను పొరబాట్లు చేసి యుండవచ్చును. కావున ఆందోళిత హృదయుల దోషములను మఱతురుగాక, క్షమింతురుగాక.

157. మఱి యొక సారి సత్యము, శాంతము అనునవి ఈ పక్షము వారి జీవ గఱ్ఱలు అని విన్నవించుకొనుచున్నాము. 1937–వ సం॥ములో అన్ని రాష్ట్రీయ ప్రభుత్వములును బ్రాహ్మణీకృతము లైనప్పుడు శాంతించితిమి. ఒకానొక హిమాలయోన్నత ఆంధ్ర మహా నాయకుడు అన్నట్లు "సచ్ఛాస్త్రిని వదలి శ్రీదేవి .......సహచరుని సెంట్రల్ అసెంబ్లీ స్థానమున కెన్నుకొన్నను" శాంతించితిమి. మఱియు వ్యక్తి అన్యాయము ఇంక ముందు జరిగినను ఈ కాంగ్రెసు మహా సంస్థను వదలఁ జాలము. వ్యక్తి కంటె దేశము చాల గొప్పది కదా?

158. కాని, ప్రస్తుత స్థితి భిన్నముగా నున్నది. బ్రాహ్మణ బ్రాహ్మణేతరోద్యమమును "రాజాజీ" అపార్థము చేసి చెప్పుచున్నాఁడు. సప్రూకమిటీ ప్రకటించిన సంగ్రహమును బట్టి అది ముస్లిములను చాల అవసరము కంటె హెచ్చుగా ఓదార్పఁ బ్రయత్నించుచు శూద్రులను వారి హక్కుల విషయములో సంపూర్ణ నిర్లక్ష్యభావమును చూపిరని తెలిసినది. వర్కింగు కమిటీ బ్రాహ్మణీకృత భావములతో నిండియు బ్రాహ్మణాధిక సంఖ్యతో కూడియు ఉన్నది. మహాత్ముని "గాంధి వర్ణ సిద్ధాంతము" అనగా "జన్మపూర్వ నిర్ధారిత జీవనవృత్తి" శూద్రు లనువారి హక్కులకు

కాలకూట విషమును పోయుచున్నది. బహుశః 5000 సం॥ల నుండి ద్రావిడులకు, రామానుజ బుద్ధదేవాదులు పోరాడినను తప్పించుకొనుటకు వీలుకానిదైన మా సాంఘిక, ఆధ్యాత్మిక ఆర్థిక, మతవిషయిక జీవరక్తములను క్రోలుచున్న ఆ బ్రాహ్మణ ఘోర విష సర్పనిర్మిత బంధమగు "రామ రాజ్యము" అనబడు కని విని యెఱుగని ఘోర నరకములోనికి మరల శూద్రులనువారిని, పంచములనువారిని త్రోయుచున్నది. స్వర్గలోకతుల్యమగు వ్యక్తి స్వాతంత్ర్యమును అది సంపూర్ణముగా నిషేధించుచున్నది.

159. కావున, అత్యంత పూజ్యుఁడవగు ఓ అధ్యక్ష మహాశయా! చాల గౌరవనీయులరగు వర్కింగు కమిటీ సభ్యులారా "తన ఆత్మను పోగొట్టుకొని ప్రపంచము నంతటిని సంపాదించినను లాభ మేమి?" అని క్రీస్తు ప్రభువు చెప్పిన సూక్తి ప్రకారము ఈ విన్నపమును వ్రాసి తమకు సమర్పించుకొంటిమి. కావున దీనిని "యుక్తి యుక్తం వచోగ్రాహ్యాం బాలాదపి సుభాషితం; అనగా యుక్తియుక్త వాక్యమును బాలుఁడు చెప్పినను మంచి భాషణము అగుచో స్వీకరింపవలయును" అను భారత దేశము యొక్క చాల ఉత్తమమగు సంప్రదాయమును అనుసరించి స్వీకరించి ఆర్యుల దుష్ట శాస్త్రముల పరిభాషలోగాక ధర్మవంతమై

ఈశ్వర ప్రతినిధియగు హేతువాద బద్ధ మగు మనుష్య పరి భాషలో సమాధానము నొసంగుడని ప్రార్థించు చున్నాము. లోగడనే సప్రూ కమిటీ వారికి మేము పంపుకొనిన నివేదిక ప్రతిని మీకు పంపుకొంటిమి. ఈ విన్నపమును పరిశీలించు టలో ఈ రెండును జత పరచి చదువుదు రని విశ్వసించుచు న్నాము. మఱి యొక సారి నమస్కృతు లర్పించు కొను చున్నాము.

ఇట్లు
తమ అత్యంత విశ్వసనీయులు
డి. రాఘవచంద్రయ్య సచ్ఛాస్త్రి
కార్యదర్శి

ది రియల్ ఇండియన్ నేషనల్
కాంగ్రెసు పక్షము
బెజవాడ – 6–7–1945

## అనుబంధము i.

అష్టాదశ మహాపాపి యగు సనాతన బ్రాహ్మణునిచే దైవ సిద్ధాంతమని చెప్పబడు "వర్ణముల, వర్ణేతరుల ఆస్తి విభజనము."

(అ)

రెండు కోట్లకు లోబడిన ద్విజుల ఆస్తి,

1. బ్రాహ్మణులకు :— యజన, యాజన, దాన, ప్రతిగ్రహణ, స్వాధ్యాయ ప్రవచనములను షట్కర్మలు చేయుట మఱియు సర్వోన్నత మగు (i) సాంఘిక (ii) ఆధ్యాత్మిక, రాజకీయ, మత విషయిక స్థానమును, మంత్రిత్వము మొదలగు సర్వ పౌరోద్యోగముల నిచ్చుటయే గాక భూలోక దేవత్వమును ఇచ్చు, బ్రాహ్మణ ధర్మానుష్ఠానార్హత.

2. క్షత్రియులకు:—యుద్ధ భటత్వ, యోధత్వములు మఱియు రాజత్వ, చక్రవర్తిత్వములు పొందు నర్హత (శూద్రులనువారు, పంచములనువారు రాజులు గాని, చక్రవర్తులు కాని, జమీందారులుకాని, రెండెకరముల రైతులుకాని కారాదు; కలదు.

3. వైశ్యులకు :—వ్యవసాయ వాణిజ్యాది అన్ని ఆర్జన వృత్తులను చేయుట. (శూద్రులు శక్తి యుండియు ఆర్జింపరాదు.)

( ఆ )

## సుమారు 28 కోట్లమంది శూద్రులనువారి, పంచములను వారి ఆస్తి.

4. శూద్రులనువారు :—ఆస్తికలిగి యుండరాదు. బ్రాహ్మణుల భుక్తశేషము మీాద ఆధారపడవలెను. న్యాయాధిపతులు, మండలాధీశ్వరులు, రాజులు సంస్థానాధిపతులు, జమీాందార్లు ఇంత యేల 2 ఎకరముల రైతులు కూడ కారాదు. గీతలోని జన్మబడు "పరిచర్యాత్మకం కర్మ" అనగా చాకలి, మంగలి వగైరాల నీచ సేవలే వారి కర్మలు.

5. పంచములనువారు :—వీరు చండాలురు (ఉచ్చారణాతీతమగు నీచ నామము.) నాల్గువర్ణములకు చెందినవారు నివసించు గ్రామములలో నివసింపరాదు. మఱియు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులనువారల వృత్తులనియు చేయరాదు. సృష్టి అంతమునఱకు పాపాత్ములు, చూడరానివారు, అంటరానివారును.

## అ ను బ ం ధ ము ii.

20 కోట్ల మంది శూద్రులనువారి నిత్య జీవితములో ఐక్యము కలుగఁజేసికొని బ్రాహ్మణుడెట్లు వారిని ఆధ్యాత్మిక హత్య కావించుచున్నది.

" ప్రజనశ్చస్వాధ్యాయ ప్రవచనేచ
ప్రజాతిశ్చస్వాధ్యాయ ప్రవచనేచ"

అను దైవ శాసనము ప్రకారము భూలోకములోని ప్రతి మనుష్యుడును వివాహము చేసికొని ధర్మపత్నితో ఉండి సంతానమునకు పెండ్లిండ్లు మొదలగు శుభకార్యములు చేయుచు వానితో పాటు వేదాధ్యయన ప్రవచనములును చేయవలయునని శాసించెను. ఇందు శూద్రులనబడు వారికి పంచము లనువారికి వేదము చదువుట, యితరులకు బోధించుట నిషేధము అని చెప్పబడ లేదు. అందుచే బ్రహ్మ యజ్ఞ, దేవ యజ్ఞ, పితృ యజ్ఞ, అతిధి యజ్ఞ, భూత యజ్ఞములు ఐదును మోక్ష సిద్ధికి ప్రతి మనుష్యుడు చేయవలెను. కాని, అసూయచే అష్టాదశ మహా పాపులగు బ్రాహ్మణులు శూద్రు లనువారు వేదోక్త కర్మలు చేయరాదని నిషేధించి వారి జన్మములను వ్యర్థము చేయుచున్నారు.

గార్హపత్యము :— " ప్రజనశ్చ స్వాధ్యాయ ప్రవచనేచ "
శూద్రుడనువాడు ధర్మపత్నితో ఉండరాదా ? ద్విజులకే గాని శూద్రులకు గార్హపత్యము లేదని యిందు కలదా ? పురాణోక్త బ్రహ్మ యజ్ఞాదులు కలవా ? గార్హపత్యమను రెండవ ఆశ్రమము పురాణోక్తమును, మొదటిదగు బ్రహ్మచర్యము, మూడవ దగు వానప్రస్థము వేదోక్తములునా ? " వేదోక్త పురాణోక్తాశ్రమము "

అను రెండు తలల శిఖండిని సమర్థించు టెట్లు? శూద్రు లనువారికి గార్హస్థ్య పత్యమును బ్రాహ్మణుడు నిషేధించునా? అది యుండుచో స్వాధ్యాయ ప్రవచనములు తమంత తామే సిద్ధించునని పై జెప్పిన భగవద్వాక్యము చెప్పుచున్నది. మఱియు పురుష సూక్త దైవము యొక్క (i) శూద్రత్వ (ii) వైశ్యత్వ (iii) క్షత్రియత్వ (iv) బ్రాహ్మణత్వ ధర్మానుష్ఠానము లే క్రమముగా (i) బ్రహ్మ చర్య (ii) గార్హస్థ్య పత్య (iii) వానప్రస్థ (iv) సన్యాసములు. అట్టి శూద్రులనువారి ఈ క్రమాంతర మోక్ష సిద్ధిని అస్టాపిశ మహాపాపి యగు బ్రాహ్మణుఁడు అడ్డ తవులుచున్నాడు.

## అనుబంధము iii.

## సనాతన బ్రాహ్మణుని వర్ణాశ్రమ ధర్మము అను దానిలోని దోషములు

1. శూద్రునకు:– ఏ ఆశ్రమమును లేదు. ఇది "ప్రజనశ్చ" .... ఇత్యాది దైవసూక్తికి వ్యతిరేకము. పెండ్లియెంత అవసరమో వేదాధ్యయనము, వేదబోధ అంతవసరము. వివాహము బ్రాహ్మణులకే అన్నచో శూద్రులను వారికి వివాహము లేదన్నచో ఆ ఘోరానర్థమును, ద్విజ సంఘమును చెందును.

2. వైశ్యులకు :—సన్యాస వానప్రస్థములు లేవు.

3. క్షత్రియులకు :—సన్యాసము లేదు.

4. బ్రాహ్మణులకు :— నా లు గా శ్ర మ ము లు కలవు. వర్ణములు నాల్గింటికి పవిత్రీకరణములగు ధర్మాను ష్ఠానములే ఆశ్రమములు. అష్టాదశ మహాపాపి అర్థము ప్రకారము ద్విజాశ్రమములు అనవలయును. శూద్రునికే ఆశ్రమము లేనినాడు ఆ వర్ణమునేల అందుఁజేర్పవలెను? కావున "నాలుగు వర్ణముల ఆశ్రమములు" అను ఈ సమాసమే శూద్రులనువారికి వానిలో హక్కు కలదని చెప్పుచున్నది. ద్విజాశ్రమము లనుటకును వీలులేదు. ఈ నాల్గును ద్విజులందఱ సొత్తునుకాదు. వైశ్యునికి గార్హా పత్య మొక్కటే కలదు. క్షత్రియునకు సన్యాసము లేదు. కనుక ఆ సమాసము సర్వతోముఖముగా దోషవంతము. సద్బ్రాహ్మణుని అర్థములో ఆశ్రమములు అన్ని వర్ణముల వారి సమిష్టి సొత్తు. అందుచే పైఁజెప్పిన దోషములలో నొక్కటికూడ దానికి చెల్లవు.

## అనుబంధము iv.

నాల్గు ఆశ్రమములు మనుజుని నాల్గుదశలు.

బ్రహ్మచర్యము :—మనుజుని మొదటిదశ. 16–వ సం॥రము వఱకు బాలుడు అజ్ఞాన దశలో నుండును. బ్రహ్మచర్య

వ్రతము ననుష్ఠించును. గురుపరిచర్య చేసికొనుచు దానిని బాపుకొనును.

గార్హపత్యము :—ఈ వయస్సులో జనులకు వివాహము అవసరము. స్వార్థదశ యగు బ్రహ్మచర్యము కంటె నిది పవిత్రమైనది. ఏల అనగా తాను కష్టపడి పెండ్లము, బిడ్డలను పోషించును.

వానప్రస్థము :—కుటుంబ సేవలో నుండి దేశసేవ చేయుదశ. మఱియు భార్యగల బ్రహ్మచర్యములో నిగ్రహము చేయుటలవడును.

సన్యాసము :—ఆత్మను ఈశ్వరుని కర్పించుట. ఇది లోకోత్తర సేవ (i) స్వసేవ (ii) గృహసేవ (iii) దేశసేవల కంటె గొప్పదశ.

ఈ "దైవవర్ణ" సిద్ధాంతము సనాతనులనువారి వర్ణ సిద్ధాంతములో గల సర్వ దోషములను తొలగించును. (1) 'శూద్రత్వము ఉపనయన పూర్వదశ' అనుటే అష్టాదశ మహాపాపియగు బ్రాహ్మణుని వర్ణ సిద్ధాంతము తప్పని ఋజువు చేయును. ఏల అనగా శూద్రుడు బ్రాహ్మణుడు కాజాలడని లోకమునకు చెప్పుచు తాను శూద్రుడై పుట్టి బ్రాహ్మణు డగుచున్నాడు (2) 'పంచము లనువారు' కలరనుట "బ్రాహ్మణోస్య ముఖమాసీత్" "చాతుర్వర్ణ్యం మయా సృష్టం" అను సిద్ధాంతములకు వ్యతిరేకము.

ఈ సిద్ధాంతము ప్రకారము వారును జన్మచే శూద్రులే అగుటచే వర్ణములలోని వారే (3) "పురాణోక్త వేదోక్తగార్హపత్య" శిఖండి తప్పని ఋజువగును (4) ప్రపంచములో జనులెల్లరు శూద్రత్వాది నాల్గు వర్ణములు కలవారే. చాతుర్వర్ణ్యం అను గీతాసిద్ధాంతములోనివారే (5) "వర్ణాశ్రమధర్మము" అను సమాసములోని దోష మిప్పుడుండదు. ఏలనగా ఆశ్రమములు వర్ణములు అందఱికి చెందు సొత్తు(6) వానప్రస్థ సన్యాసములు వైశ్యులకులేవు (7) క్షత్రియులకు సన్యాసము లేదు (8) శూద్రులకు నాల్గు ఆశ్రమములు లేవు అను నిషేధములచే గల్గిన దోషములు పోయినవి. ఈ సిద్ధాంతము ప్రకారము స్కూలుఫైనలు ప్యాసయి ఇంటర్మీడియేటులో చేరి ఆ యా తరగతులలో నున్నంత కాలము ఆ యా విద్యార్థులు ఆ యా తరగతులవారుగా గణింపబడిట్లు ప్రజలు స్వయం నిర్ణయముచే వైశ్యత్వ, బ్రాహ్మణత్వ, క్షత్రియత్వము లనుష్ఠింతురు.

## అనుబంధము V.

1. బ్రాహ్మణుని పంచవిధ అష్టాదశ బహిష్కారము.

ఆధ్యాత్మిక బహిష్కారము:—ఇది మూడు బహిష్కారములతో కూడినది (1) 28 కోట్లమంది బ్రాహ్మణేతర హిందువులను (శూద్రులను వారు, పంచములనువారు) బ్రాహ్మణత్వము పొందరాదని నిషేధించుట (2) మఱియా రెండు హిందూ జాతులను వేదము చదువరాదని

నిషేధించుట (3) తపస్సు బ్రాహ్మణుని ప్రత్యేకముగు జన్మ హక్కని బ్రాహ్మణేతరు లందఱి విషయములోను నిషేధించుట (కొందఱి మతములో క్షత్రియులు మాత్రము తపస్సు చేసికొనవచ్చును).

2. మత విషయికమగు బహిష్కారము :—ఇది 20 కోట్ల ద్విజేతర హిందువుల విషయములో అవలంబింపబడు దేవాలయ ప్రవేశ విషయిక బహిష్కారము. 20 కోట్ల మంది శూద్రులను గర్భాలయములో ప్రవేశింపరాదని నిషేధించుటయు 8 కోట్ల మంది పంచములనువారిని అసలు దేవాలయముల లోనికే రాగూడదని నిషేధించుటయు.

3. దైవ సాన్నిధ్య నిషేధము :—20 కోట్లమంది శూద్రులనువారిని 8 కోట్ల మంది పంచములనువారిని దేవాలయములలో ఈశ్వరసేవ (అర్చకత్వము) చేయకుండ నిషేధించుట మఱియు గర్భాలయ స్వయం పూజను నిషేధించుట.

4. సాంఘిక బహిష్కారము :—ఇది 8 విధములు (1) బ్రాహ్మణుడు తదితర హిందువులకు ప్రథమ నమస్కారము చేయరాదనుట అనగా బ్రాహ్మణేతర హిందువులు నమస్కరించినప్పుడు దానికి బదులుగా నమస్కరింపవచ్చును కాని తానై ముందుగా చేయరాదనుట (2) సంబోధనములో తన కెవరును సమానులు గాదనుట

బ్రాహ్మణుని బ్రహ్మశ్రీ, ఆచార్య, అయ్యరు ఈ విధముగా సంబోధించుట; ఇతరులను దాస, గుప్త, వర్మ మ. రా. రా. శ్రీ ఈ మొదలగు వానితో పిలుచుట (3) బ్రాహ్మణుని అదర్శనీయ భోజనము చూచినచో తనకు పాపము (మైల) వచ్చుననుట (4) బ్రాహ్మణుని అస్పర్శనీయ దేహమును అంటిన మైల వచ్చుననుట (5) బ్రాహ్మణునితో కలిసి సహ పంక్తిలో బ్రాహ్మణేతర హిందువు లెవ్వరును భుజింప రాదనుట (6) నాల్గు వర్ణముల కన్యకలను దాను వివాహము చేసికొనుటకు అధికారము కలదని, తన కన్యకను పెండ్లి చేసికొనుటకు బ్రాహ్మణేతర హిందువుల కధికారము లేదనుట (7) యజ్ఞాది పరిషత్తుల లో ఇతరులు సమాన హోదాతో సమావేశము కారాదనుట (8) స్త్రీల హక్కులు పురుషులకు లేవనుట; అనగా స్త్రీలు బ్రాహ్మణ ధర్మమును అనుష్ఠించి యజన యాజనాది షట్కర్మలు చేయరాదనుట.

5. రాజకీయ బహిష్కారము :—ఇది అయిదు విధములు (1) బ్రాహ్మణుని కంటె హెచ్చు శిక్షను బ్రాహ్మణేతర హిందువులు పొందవలయు ననుట (2) క్షత్రియులకు తప్ప తక్కిన వర్ణముల వారికి రాజత్వము సైన్య శాఖలో యోధత్వ, భటత్వములు లేవనుట (3) వాణిజ్య వ్యవసాయములు, మఱి ఆర్జనకు ఉప

యోగించు ఇతర వృత్తులు చేయరాదని వైశ్యులు కాని వారికి నిషేధించుట (4) 20 కోట్ల మందికి 'శూద్రుడు' అను దుష్టనామమును ఇచ్చుట. మఱియు వారిని పైని చెప్పిన "ద్విజుల వృత్తు" లనబడు వృత్తులను జీవనోపాధికి చేయరాదని నిషేధించుట (5) 8 కోట్ల మందికి చండాలురు అను పాప నామము నిచ్చుట; మఱి వారు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వృత్తులలో ఏవియు చేయరాదనుట. మఱియు, ఈ నాల్గు వర్ణముల వారును నివసించు గ్రామములలో నివసింపగాదనుట. వర్ణేతరుడని వర్ణములవారి జన్మహక్కులు లేకుండ నిషేధించుట.

## అనుబంధము vi.

### బ్రాహ్మణుని 5 విధములగు 12 రిజర్వేషనులు.

1. ఆధ్యాత్మికమగు రిజర్వేషను:—ఇది మూఁడు రిజర్వేషనులతో కూడినది. (1) ఈశ్వర సాక్షాత్కృతి నందుటకు అనగా ఈ జన్మలో మోక్షము నందుటకు మఱియు భూలోకములో మహోన్నతమగు గౌరవము పొందుటకు హేతువగు బ్రాహ్మణ ధర్మానుష్ఠానము శాశ్వతముగా సృష్టి అంతము వఱకు బ్రాహ్మణుల జన్మహక్కనుట (2) శూద్రులనువారు పంచములను వారు ఎంత పవిత్రులయినను వేదాధ్యయనము, వేదబోధ చేయరాదనుట (3) సృష్టిలో బ్రాహ్మణుడు తప్ప తక్కిన వారెవ్వరును తపస్సు చేయరాదనుట.

2. మతవిషయికమగు రిజర్వేషను :— ఒక బ్రాహ్మణుడే శాశ్వతముగా గర్భాలయములో స్వయముగా పూజ చేయుటకు హక్కుగలవాడనియు బ్రాహ్మణేతర హిందువులలో ఎవ్వనికి ఆ హక్కు లేదనియు రిజర్వేషను.

3. దేవాలయార్చకత్వ రిజర్వేషను :— అర్చకత్వమునకు ఎంత పూజ్యుడైనను బ్రాహ్మణేతర హిందువు పనికి రాడని పాపాత్ముడైనను బ్రాహ్మణుడే తగునని చేసికొన్న రిజర్వేషను.

4. సాంఘిక రిజర్వేషను :— ఇది ఆఱు రిజర్వేషనులు కలది. (1) మొదటి నమస్కారము క్షత్రియాదులగు బ్రాహ్మణేతరులనుండి తనకే రావలయునుగాని తాను చేయనక్కర లేదను నిషేధము. (2) తనకు బ్రహ్మశ్రీ మొదలగు గౌరవ సంబోధనములు రిజర్వు చేసికొని యితరులకు లేకుండఁజేయుట (3) దృష్టిలో తాను ఏమైల లేని సర్వ పవిత్రుడనని యితరులు పాపాత్ములు కావున భోజనాదులలో తనను చూచిన పాపమనుట (4) స్పర్శలో తాను ఏ విధమగు పాపమును లేనివాడనని అందుచే తాను అంటుకొనిన యితరులకు ఏ పాపము (అంటు) ఉండదనియు ఇతరులు తనను భోజనాది సమయములలో అంటుకొన్నచో తనకు మైల (పాపము) వచ్చునని రిజర్వు చేసికొనుట (5) తన కన్యకలు పవిత్రులని; బ్రాహ్మణేతర హిందువులు వారిని

పెండ్లి యాడరాదని; క్షత్రియ, వైశ్య, శూద్ర కన్యలను తాను పెండ్లాడ వచ్చునని వివాహ విషయములో రిజర్వు చేసికొనుట (6) స్త్రీలకు పురుషుల బ్రాహ్మణ ధర్మానుష్ఠానపు హక్కులు మొదలగునవి లేవని నిరంకుశముగా నిర్ణయించు హక్కు కలిగి యుండుట.

5. రాజకీయ రిజర్వేషనులు :—ఎంత పవిత్రుడైనను బ్రాహ్మణుడు కానివాడు శిక్షా విషయములో ప్రత్యేక హక్కులు కోరరాదని; బ్రాహ్మణుడెంత ఘోరమగు నేరమును చేసినను అతనిని చంపినచో "బ్రహ్మహత్య" కావున అతనికి ఆ శిక్ష విధింపరాదని; ఇతరులకా శిక్ష విధింప వచ్చునని; తనకు శిక్షా విధానములో ఆధిక్యమును రిజర్వు చేసికొనుట. మఱి, అష్టమంత్రిత్వ, న్యాయాధిపతిత్వములు, కలెక్టరు, తహశ్శీలుదారు మొ॥ పేర్లు కల అధికార యుతములగు అన్ని యుద్యోగములు ఇతరులు చేయరాదని నిషేధించి బ్రాహ్మణునకు రిజర్వు చేసికొనుట.

## అనుబంధము vii

### శాసన సభాభ్యర్థుల అఫిడవిట్టులు.

1. దరఖాస్తుదారుని పేరు, 2. తండ్రి లేక భర్త పేరు 3. కులము లేక మతము 4. వృత్తి 5. జన్మదినము 6. కాంగ్రెసులో చేరిన తేదీ 7. ఏ ఎన్నిక వర్గము (ఇచ్చట

కేంద్ర రాష్ట్రీయ సభలలో దేనికి చెందినదో మరియు హిందూ, ముస్లిము, క్రైస్తవ ఇత్యాది నియోజక వర్గము లలో ఏదియో వ్రాయవలయును) నుండి ఆమె లేక అతడు ఎన్నికను కోరుచున్నారు? (8) ఆ ప్రత్యేక నియోజక వర్గమునుండి ఎన్నికను కోరుటలో గల విశేషార్హతలు. ఏ యితర నియోజక వర్గమేని రుచించునా? 9. విద్యా విషయికార్హతలు 10. ఇతర విధములగు అర్హతలు 11. అతడు/ఆమె కాంగ్రెసులో ఎంత కాలమునుండియు ఉన్నదియును 12. ఆమె/అతడు కాంగ్రెసులో ఎప్పుడైనను ఏ విధముగు డిసిప్లినరీ యాక్షను పొందిరా? పొందినచో ఎప్పుడు, ఏ కారణముచేత?

## అనుబంధము viii.

### బ్రాహ్మణుని 18 మహా పాపములు

1. బ్రాహ్మణ ధర్మము సృష్టి అంతము వఱకు తన ప్రత్యేక కులవృత్తియని సృష్టిలోని యితరుల కెల్లరకు దానిని నిషేధించుట (2) ప్రపంచములోని జను లెల్లరు తనకు ప్రథమ నమస్కారము చేయవలయుననుట తననుండి ప్రథమ నమస్కారము పొందు హక్కు ఇతరులకు లేదనుట (3) క్షత్రియులకు బ్రాహ్మణ ధర్మము, ప్రథమ నమస్కారార్హత నిషేధించుట (4) వైశ్యులకు బ్రాహ్మణ ధర్మము ప్రథమనమస్కారార్హత లేదనుట (5) శూద్రులను

వారికి బ్రాహ్మణత్వము, ప్రధమ నమస్కారము లేదనుట (6) పంచములనువారికి బ్రాహ్మణత్వ మనుష్ఠించుటకు హక్కు లేదనుట (7) బ్రహ్మశ్రీ, ఆచార్య, శాస్త్రి, అయ్యంగారు ఈ మొ॥నవి యితరులకు లేవని నిషేధించుట (8) ఇతరులను వర్మ,దాస, గుప్త ఇత్యాది నీచనామములతో పిలుచుట (9) తాను మైల లేని ప్రధమ పవిత్రుడననుట (అనగా తాను చూచిన ఇతరులకు మైల రాదనుట ) ఇతరు లందఱు తనను భోజన కాలాదులలో చూడరాని వారనుట (10) స్పర్శలో తాను మైల లేని మహా పవిత్రుడననుట యితరులు "అంటిన మైల వచ్చు అపవిత్రు" లనుట (11) దేవుని కూడ తన మంత్ర ప్రోక్షణలు లేనిదే అపవిత్రుడగునని ద్వితీయ పవిత్రునిగా జేసి దైవ ద్రోహము చేయుట (12) శూద్రులనువారికి గర్భాలయ స్వయం పూజ లేకుండ జేయుట (13) పంచములనువారికి దేవాలయ ప్రవేశమే లేదనుట (14) ద్విజేతరులగు హిందువులకు వేద పఠన, ప్రవచనములు లేకుండ జేయుట (15) బ్రాహ్మణేతర హిందువులకెల్లరికి తపోనిషేధము (16) బ్రాహ్మణేతరు లెవ్వరు తన కన్యకను పెండ్లాడరాదని నిషేధించుట (17) హత్యలు చేసినను తనకు శిక్ష లేదని శిక్షాతీతునిగా జేసికొని శిక్షా విధానములో అసమత్వమునుజొన్పుట (18) పురుషుల బ్రాహ్మణ ధర్మానుష్ఠానపు హక్కు మొ॥ స్త్రీలకు లేవనుట.

## అనుబంధము ix.

## బ్రాహ్మణుడు హరించిన బ్రాహ్మణేతర హిందువుల 18 జన్మ హక్కులు

(అ) త్రిగుణమగు ఆధ్యాత్మిక జన్మ హక్కులు అనగా (1) మోక్ష సిద్ధికి, ఇహలోక సర్వోన్నత స్థితికి ఈశ్వరుడిచ్చిన బ్రాహ్మణ ధర్మానుష్ఠాన హక్కు (2) 28 కోట్ల బ్రాహ్మణేతర హిందువులకు వేదము చదువుకొను హక్కు (3) మఱియు వారి కందరికి గల తపస్సు చేసికొను హక్కు (4) 28 కోట్ల బ్రాహ్మణేతర హిందువుల గర్భాలయ స్వయం పూజహక్కును (5) 28 కోట్ల బ్రాహ్మణేతర హిందువుల దైవసాన్నిధ్య మగు అర్చకత్వ హక్కును వారికి లేకుండఁ జేయుట మఱియు అష్ట విధ మగు సాంఘిక జన్మ హక్కుల నిషేధము అనగా (6) బ్రాహ్మణునుండి ప్రథమ నమస్కారము పొందు హక్కును బ్రాహ్మణేతర హిందువులకు లేకుండఁజేయుట. (7) సమత్వముతో సంబోధించుటకు సంబోధింపఁ బడుటకు బ్రాహ్మణేతరులకు హక్కు లేకుండ జేయుట (8) భోజనాదులలో దృష్టి దోషము లేకుండ చూచుటకు చూడబడుటకు సమానమగు హక్కును బ్రాహ్మణేతరులకు నిషేధించుట (9) భోజనాదికములలో స్పర్శదోషము లేకుండ అంటుకొనుటకు అంటుకొనబడుటకు హక్కును బ్రాహ్మణేతరులకు లేకుండ జేయుట (10)

యజ్ఞపరిషదాదుల విషయములో బ్రాహ్మణునితో సమా నత్వముతో సమావేశమగు హక్కును బ్రాహ్మణేతరులకు లేకుండ జేయుట (11) సహపంక్తి భోజన నిషేధము (12) నాల్గు వర్ణముల కన్యకలను దాను వివాహము చేసి కొను హక్కు గల్గి బ్రాహ్మణ కన్యకలను పెండ్లి చేసికొను హక్కును బ్రాహ్మణేతరులకు లేకుండజేయుట (13) స్త్రీలకు పురుషులకు గల హక్కులు లేవని హరించుట (14) బ్రాహ్మ ణునితో సమానమగు శిక్షా విధానమును బ్రాహ్మణేతర హిందువులకు లేకుండ జేయుట (15) రాజత్వ యోధత్వ యుద్ధ భటత్వములు క్షత్రియులు కాని వారికి లేకుండః జేయుట (16) వైశ్యులు కానివారికి వ్యవసాయ వాణిజ్య పాశుపాల్యాదులగు వృత్తులు లేవని నిషేధించుట (17) శూద్రులను వారికి పైని జెప్పిన ద్విజేతర వృత్తులు అన్నియు నిషేధించుట (18) పంచములనువారికి నాల్గు వర్ణముల వారి ఆధ్యాత్మిక మత విషయక, ఆర్థిక, రాజకీయ హక్కులు నిషేధించుట.

## అనుబంధము x.

మహాత్మాజీ యొక్క కాంగ్రెసు వర్కింగుకమిటీ వారి యొక్కయు రాజకీయ, మతవిషయిక భావము లెట్లు పరస్పర విరుద్ధములో చూపునది.

## మహాత్మాజీ

మహాత్మాజీ యొక్క నాజూకు వర్ణ సిద్ధాంతము పంచము లనువారికి శూద్రులనువారికి అట్లాంటికు ఛార్టరు లోని దేవాలయ స్వయం పూజను, అర్చకత్వమును 7 లక్షల గ్రామ దేవాలయములలోను కాశీ, బృందావనం, తిరుపతి, రామేశ్వరం మొ॥ జగత్ప్రసిద్ధ దేవాలయములలోను నిషేధించుచున్నది (2) 28 కోట్ల శూద్రులనువారికి, పంచము లనువారికి బ్రాహ్మణ ధర్మానుష్ఠాన హక్కులు తొలగించి ఆధ్యాత్మిక హత్య చేయుచున్నది. (3) బ్రాహ్మణ కన్యకను పెండ్లియాడు హక్కును నిషేధించుచున్నది. (4) అంతరాత్మ ప్రబోధించిన వృత్తిని చేసికొనకుండ చేయుచున్నది. ఏల అనగా ఒక శూద్రుఁడనువాడుగాని, పంచముడనువాడుగాని, క్షత్రియ వృత్తియను దానిని అనుష్ఠించుచో "పతితుడు" అనగా భ్రష్టుడు అగుచున్నాడు (5) వ్యక్తి మేధా సంపత్తిని నాశము చేయుచున్నది అనగా విక్రమార్కుని సంహరించిన శాలివాహనుడు కాని, మహాత్ముడు కాని, వాల్మీకికాని జనింప వీలులేదు. అందుచే అది (i) అట్లాంటికు ఛార్టరునకు విరుద్ధము. (ii) అంతరాత్మకు విరుద్ధము (iii) అహింసకు విరుద్ధము (iv) గౌండ్ల (కల్లు తీసి అమ్ము) వృత్తి విషయములోవలె వ్యక్తి స్వాతంత్ర్యమునకు విరుద్ధము.

## కాంగ్రెసు వర్కింగు కమిటీ.

వర్కింగు కమిటీవారు అంగీకరించిన కరాచీ ప్రాథమిక జన్మహక్కుల సిద్ధాంతము బ్రాహ్మణత్వ, క్షత్రియత్వ, వైశ్యత్వములను ద్విజేతరులు అవలంబింపవచ్చునని అంగీకరింపలేదు. అందుచే అది (1) శూద్రులనువారికి పంచములనువారికి ఏడు లక్షల గ్రామ దేవాలయములలోను కాశీ, రామేశ్వరం, బృందావనము మొ॥ జగత్ప్రసిద్ధ దేవాలయములలోను అర్చకులుగా ఉండు హక్కును లేకుండ జేయుచున్నది (2) ఈ జన్మలో బ్రాహ్మణత్వము పొందు హక్కును లేకుండఁజేసి ఆధ్యాత్మిక హత్యను చేయుచున్నది (3) మత రీత్యా బ్రాహ్మణుని కన్యను పెండ్లిచేసికొను హక్కును నిషేధించుచున్నది (4) బ్రాహ్మణేతర హిందువుల కన్యకలను పెండ్లిచేసికొను హక్కుగలదను అష్టాదశ మహాపాపియగు బ్రాహ్మణుని హక్కును సమర్థించుచున్నది (5) కావున ఆ కరాచీ తీర్మానము వారిక అవమానకరమైనది. (6) అట్లాంటికు ఛార్టరులోని ప్రార్థన స్వాతంత్ర్య సూత్రమునకు విరుద్ధము (7) మఱియు వ్యక్తి స్వాతంత్ర్యమునకును విరుద్ధమే (8) బ్రాహ్మణత్వ క్షత్రియత్వములు శూద్రులను వారికి, పంచములను వారికి నిషేధించుట సర్వోత్తమములగు ఆధ్యాత్మిక, మతవిషయక, రాజకీయ సాంఘిక స్థానములను లేకుండఁజేయుటయే.

స్వరాజ్య ప్రెస్, బెజవాడ. క. 14. 10-1-47-1000.

## గాంధీజీ కథలు

రెండు భాగములు. బాల బాలికలకు, చిన్న పెద్దలకు అత్యంతము వలె ఆనందదాయకములగు రమ్య కథలు. ఆంధ్ర దేశములో పెక్కు పాఠశాలలలోను, గృహములలోను చదువబడుచున్నది.

మొ॥ భా॥ రు 0-6-0. రెం॥ భా॥ రు 0-8-0

## నెహ్రూజీ కథలు

సర్వ ఆంధ్ర భూమిలో వ్యాపించి కీర్తిచెందినవి. చదువుటకు ఇంపుగా నుండుకథలు. మొ॥ భా॥ రు 0-6-0. రెం॥ భా॥ రు 0-8-0

## గాంధీజీ శతకము (పద్య)

ఈ లోకోత్తర పురుషుని సర్వ సిద్ధాంతములు వర్ణింపఁబడినవి. ప్రతి జాతీయవాదియుఁ జదివితీరవలెను. వేల పాఠశాలలలో చదువుచున్నారు.

వెల రు 0-5-0

## బ్రాహ్మణ సత్కృ పర్వము

వేదవ్యాస ప్రణీతము. శ్రీ వేదవ్యాసుని మహాభారతములో అష్టాదశ మహాపాపులగు బ్రాహ్మణులు లేకుండఁజేసిన పర్వము వేదవ్యాసు లనుగ్రహించినది. కైలాసగిరియందు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు పతి సమేతులై ఇంద్రాదులతో, అష్ట దిక్పాలురతో, దేవతలతో, మహర్షులతో విందు పేరోలగములో నుండ " బ్రాహ్మణ సత్కృ " ల కథ చరిత్రలు చెప్పబోను గాథ. అత్యద్భుతము. ప్రతి ఆంధ్రుడు చదువఁదగినది. భాగములుగా ప్రచురింపఁబడుచున్నది. మొ॥ భా॥ రు 0-10-0. రెం॥ భా॥ రు 0-10-0

సద్బ్రాహ్మణాశ్రమము,
బెజవాడ.